# రాయవాచకము



సంపాదకుడు

డా॥ సి. వి. రామచంద్రరావు




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

RAYAVACHAKAMU - A Telugu prose work of 16th century.
Edited by Dr. C. V. Ramachandra Rao, Reader in History,
Sri Satya Sai Institute of Higher learning, Puttaparthi,
Anantapur Dist. A. P.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాదు-500 004



ప్రచురణ : 332



ప్రథమ ముద్రణ : 1982

ప్రతులు : 2,000

వెల : రూ. 5-00

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి,
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాదు-500 004

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్,
హైదర్‌గూడ,
హైదరాబాదు-500 001.

Paper used for the Printing of this book was made available by the Government of India at Concessional rate.

# తొలి పలుకులు

రాయవాచకము తెలుగులో అరుదైన చారిత్రక వచన కావ్యం. తెలుగు భాషా వికాసానికి సంబంధించిన ఆధార గ్రంథం. 16 వ శతాబ్దంలోని తెలుగు వాడుక భాషా స్వరూపానికి ఇది సూచిక. శ్రీకృష్ణదేవరాయలకు ప్రతినిధిగా మధుర నేలిన విశ్వనాథనాయకునికి ఒక అజ్ఞాతనాముడైన స్థానాపతి వ్రాసిన 'విన్నపమి'ది. కృష్ణరాయల కాలంనాటి అధికారవర్గంలో ప్రచారంలో ఉన్న భాషలో కృష్ణరాయల చరిత్రం ఉంది ఈ వచన కావ్యంలో. పార్సీ భాషలోని రాజకీయ పారిభాషిక పదాలు ఈ కావ్యంలో కనిపిస్తాయి. అయితే ఇందులోని దీర్ఘమైన వాక్యాలు ఒక్కొక్కసారి చదువరులకు అర్థక్లేశాన్ని కలిగిస్తాయి. కాని వ్యర్థపదాలేవీ లేకుండా, పదాడంబరం లేకుండా సరళశైలిలో రచన సాగింది. 16 వ శతాబ్దంనాటి తెలుగు ప్రజల భాషనూ, చరిత్రనూ, సాంఘికేతి వృత్తాన్నీ తెలుసుకునేందుకు ఈ కావ్యం చక్కగా ఉపయోగపడుతుంది.

ఇంతకుపూర్వం ఈ పుస్తకం అచ్చైంది. కాని ఇప్పుడు దొరకడంలేదు. పరిశోధకులకూ, పండితులకూ ఉపయుక్తంగా ఉండే ఇలాంటి గ్రంథాలను తిరిగి అకాడమీ ప్రచురిస్తున్నది.

పుట్టపర్తిలో శ్రీ సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హైయర్ లర్నింగ్‌లో చరిత్ర విభాగంలో రీడరుగా ఉన్న డా॥ సి. వి. రామచంద్రరావుగారు ఈ రాయవాచకానికి పీఠికను వ్రాసి, సంపాదకత్వం వహించినారు. వారికి అకాడమీ పక్షాన ధన్యవాదాలు సమర్పించుకుంటున్నాను.

ముద్రణ దోషాలు ఎక్కువగా దొర్లినవి. సవరణలను జతగూర్చినాము. ముందు సరిచేసుకుని పాఠకులీ గ్రంథాన్ని ఉపయోగించుకుంటారని ఆశిస్తున్నాము.

హైదరాబాదు
23-8-1982

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి

# అనుక్రమణిక

# ఉపయుక్త గ్రంథాలు, వ్యాసాలు, పత్రికలు - వాని సంకేతాలు

**తెలుగు**


ఆరుద్ర : **సమగ్ర ఆంధ్ర సాహిత్యం**, 1966, సంపుటాలు 9, 10 11, 12. **(స.ఆం.సా.)**

అరుణకుమారి బి. : **ఆంధ్ర వాఙ్మయమున చారిత్రక కావ్యములు**, వాల్తేరు, 1978. **(ఆం.చా.కా.)**

ఏకాంబ్రనాథుడు : **ప్రతాపరుద్ర చరిత్రము**, నరేంద్రనాథ సాహిత్య మండలి, తణుకు, 1969. **(ప్ర.చ.)**

కాసె సర్వప్ప : **సిద్ధేశ్వర చరిత్రము**

కుమార ధూర్జటి : **కృష్ణరాయ విజయము**, ఏలూరు, 1902; మద్రాసు, 1929; ఆం.ప్ర. సాహిత్య అకాడమీ, 1981. **(కృ.రా.వి.)**

కులశేఖరరావు, యం. : **ఆంధ్ర వచన వాఙ్మయము**, హైదరాబాదు, 1974. **(ఆం.వ.చ.వాఙ్మ.)**

కృష్ణమూర్తి, భద్రిరాజు (సం.) : **తెలుగుభాషా చరిత్ర**, హైదరాబాదు రెండవ ముద్రణ, 1979. **(తె.భా.చ.)**

గోపాలకృష్ణరావు, కె. : **తెలుగుపై ఉర్దూ పారశీకముల ప్రభావము**, హైదరాబాదు, 1968. **(గో.కృ.)**

దొణప్ప, తూమాటి : **భాషా చారిత్రక వ్యాసావళి**, హైదరాబాదు, 1972. **(భా.చా.వ్యా.)**

నృసింహకవి, సంకుసాల : **కవికర్ణ రసాయనము**, (పరిష్కర్త : మోచర్ల రామకృష్ణకవి, ఆం. ప్ర. సాహిత్య అకాడమీ, 1967.

పెద తిరుమలాచార్యులు, తాళ్లపాక: *శ్రీభగవద్గీత* (పరిష్కర్త: జి.యన్. రెడ్డి) తిరుపతి, 1978.

ప్రభాకరశాస్త్రి, వేటూరు: (a) *తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర*. మద్రాసు, 1914. (b) "'స్నాన' శబ్ద విచారము" **భారతి**, 1927, నవంబరు, పు. 41-45 లు.

మహాదేవశాస్త్రి, కోరాడ: "కావ్యభాషా పరిణామం, (క్రీ.శ. 1000–1599)", **తె.భా.చ.** పు. 206 మొ॥

రామయ్యపంతులు, జయంతి (సంపాదకుడు, పరిష్కర్త) :

(a) **'రాయవాచకము', ఆం.సా.వ.ప**, 1914, తృతీయ సంపుటము, పు. 11-40, 49-64, 125-136, 175-182, 207-210 లు (రా.వా. 1914)

(b) **రాయవాచకము,** ఆంధ్రసాహిత్య పరిషత్ప్రచురణ సంఖ్య. 33, కాకినాడ, 1933. (రా.వా. 1933)

**రామరాజు,** బి: "కావ్య భాషాపరిణామం (క్రీ.శ. 1600–1899)", **తె.భా.చ,** పు. 239 మొ॥

**రెడ్డి,** జి.యన్. "అర్థ పరిణామం", **తె.భా.చ,** పు. 427 మొ॥; (పరిష్కర్త): తాళ్లపాక పెద తిరుమలాచార్యులు- శ్రీ భగవద్గీత (**తొలి తెలుగు** వచన భావానువాదం), తిరుపతి, 1978.

విశ్వనాథశర్మ, వేమూరి : "దక్షిణాది తెలుగు – కొన్ని పాత ఉత్తరాలు", **ఆం.ప.**, 1964-65, విశ్వావసు, పు. 151.

వీరరాజుపంతులు, నడకుదుటి: 'సర్వలక్షణ సార సంగ్రహము-స్నాన శబ్ద విచారము', **భారతి**, 1927, ఆగష్టు, పు.12; 1928 ఆగష్టు, పు.315-317 లు.

వెంకటరత్నం, తెలికచర్ల: 'వచన రచనా పరిణామము'; **వి.స.** III పు. 632.

వెంకటరమణయ్య, నేలటూరు :

a. **కృష్ణదేవరాయలు**, హైదరాబాదు, 1972 **(కృ.దే.రా.)**

b. **విజయనగరచరిత్ర**, భాగములు, 1, 2. హైదరాబాదు, 1979. **(విజ. చ)**

c. 'నల్లప్రజ' **భారతి**, 1938, డిశంబరు, పు. 663.

d. 'మధుర' తంజాపూరు నాయకరాజుల నాటి ఆంధ్ర వాఙ్మయము', **భారతి**, 1954 ఫిబ్రవరి, పు. 143 మొ॥

వెంకటరాఘవానందరావు, గొ. : "గద్యవాఙ్మయము"

వెంకటరామమూర్తి, గిడుగు: **గద్యచింతామణి**, భాగము I, గుంటూరు, 1933,

వేంకటరావు, నిడుదవోలు :

a. **ఆంధ్రవచన వాఙ్మయము**, మద్రాసు, 1954 **(ఆం. వ. వా)**

b. **దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయమ**, మద్రాసు, 1962 **(ద.ఆం.వా.)**

శేషయ్య, చాగంటి : **ఆంధ్ర కవి తరంగిణి (ఆం. క. త.)**

సభాపతి : **'సభాపతి లక్షణము-వచనము'**, **ఆం.సా.ప.ప**, 1924, 13. 1, పు. 66 మొ॥.;

**A Descriptive catalogue of Telugu Manuscripts in the Maharaja Sarfoji's Sarasvati Mahal Library, No.** 815

సత్యనారాయణ, మోడేకుర్తి : 'తెలుగు శాసనాలలో అన్యదేశ్యాలు' **భారతి**, 1959. అక్టోబరు, పు 65 మొ॥

సీతారామయ్య, కురుగంటి : **తంజాపురాంధ్రనాయక చరిత్రము**, మదరాసు, 1932.

సోమశేఖరశర్మ, మల్లంపల్లి-ఇతరులు : **విజ్ఞాన సర్వస్వము-మూడవసంపుటము**, మదరాసు, 1959. **(వి. స. III)**

## పత్రికలు

**ఆంధ్ర పత్రిక** ఉగాది సంచికలు (ఆం. ప.)

**ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక**, కాకినాడ (ఆం. సా. ప. ప.)

**భారతి**

## నిఘంటువులు

బ్రౌన్ చార్లెస్ ఫిలిప్, వెంకటరత్నం, క్యాంప్‌బెల్, వీరేశలింగం :

**నిఘంటు తెలుగు, ఇంగ్లీష్**, Second Ed; (బ్రౌ.ని)
New Delhi, 1979

బ్రౌన్ చార్లెస్ ఫిలిప్ : (a) **బ్రౌణ్య తెలుగు నిఘంటు**
(Telugu - English Dictionary), Madras, 1842 (బ్రౌణ్యము)

(b) **బ్రౌణ్య మిశ్ర భాషానిఘంటు**,
Madras, 1854 (బ్రౌ. మిశ్ర.)

రామయ్య, జయంతి : **శ్రీ సూర్యరాయాంధ్ర**
నిఘంటువు, కాకినాడ, 1936; పునర్ముద్రణ, (సూ.ని)
ఆం. ప్ర. సాహిత్య అకాడమీ, హైదరాబాదు, 1979

సీతారామాచార్యులు, బహుజనపల్లి : శబ్దరత్నాకరము (శ. ర.)
(పరిష్కర్త : నిడుదవోలు వేంకటరావు), పునర్ముద్రణ,
మద్రాసు, 1969

## English

Krishna swami Ayyangar (Ed.) :
**Sources of Vijayanagar History,** Madras, 1919 (Sources)

**Nilakanta Sastri, K. A & Venkataramanayya. N. (Eds-)**
**Further Sources of Vijayanagar History,** Madras, 1946 (Further Sources)

Sathianatha Iyer : **The History of the Nayaks of Madura,** Madras, 1924.

Sewell, Robert : **A sketch of the Dynasties of South India,** Delhi, Reprint, 1975. (Sewell)

Sherwani, H.K: **Muhammad Quli Qutb Shah,** Bombay, 1967. (Sherwani)

Siddiqui, A. M. : **History of Golconda,** Hyderabad, 1956 (Siddiqui)

Swamikannu Pillai : **An Indian Ephemeris,** Madras, 1920 (Ephemeris)

Venkataramanayya, N. : **Studies in the History of the Third Dynasty of Vijayanagar,** Madras, 1935 (Studies)

**Dictionaries**

Apte, V. S. : **The Students' Sanskrit English Dictionary**, Delhi, 1975 (Apte)

Kittel, F. : **A Kannada-English Dictionary,** Mangalore, 1894. (Kittel)

Shakespear, John : **A Dictionary of Hindustani and English,** Second Ed. 1880 (John)

**Inscriptions :**

**Epigraphia Carnatica** (E. C )

రాయవాచకము

**Tirumala-Tirupathi Devasthanam Inscriptions**
(T.T.D.I.)

**Report on TTDI** (by Sadhu Subramanya Sastry), 1930
(**Report**)

**ఇతర సంకేతాలు**

**14:10.** ఇట్లా చూపిన సంఖ్యలు, ఈ రాయవాచక ముద్రణలో, కోలను ( : ) కు ముందున్న సంఖ్య పుటను, కోలను ( : ) తర్వాత సంఖ్య పంక్తిని సూచిస్తుంది.

# తప్పొప్పుల పట్టిక

(*గమనిక:-* అకాడమీవారు నియమించిన ముద్రాపకులు, ప్రూఫ్‌రీడర్ (Proof-reader) తమ బాధ్యతను పూర్తిగా విస్మరించినందువలన, ఈ విలువైన గ్రంథంలో ఇన్ని అచ్చుతప్పులు దొర్లినాయి. గ్రంథం దాదాపు పూర్తిగా అచ్చయిన తర్వాతగాని, దానిని పరిశీలించే అవకాశం నాకు ఏర్పడ లేదు. ఈ అచ్చు తప్పులకు బాధ్యత ఎవరిదైనా, పరిష్కర్తగా, ఒక నైతిక బాధ్యతతో, పాఠకలోకానికి క్షమాపణ తెల్పుకొంటున్నాను—సి. వి. రామచంద్ర రావు, పరిష్కర్త.)

## పీఠిక

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| i | 16 | గజపతినాజి గెలిచిన | గజపతినాజిని గెలిచిన |
| iii | 19 | ను ప్రసిద్ధుడైన | సుప్రసిద్ధుడైన |
| iv | 7 | కర్ణాట కొజికం | కర్ణాట కొటికం |
| v | 21 | 1560 కి | 1560 |
| vi | 21 | కాబట్టి | కాబట్టి |
| vi | 26 | విన్నయట్టు | విన్నయట్టి |
| vii | 6 | సంకుపాల | సంకుసాల |
| vii | 9 | 1640 | 1540 |
| viii | 1 | చైత్రశుద్ధ అమావాస్య | చైత్రబహుళ అమావాస్య |
| viii | 16 | పురాణులుగా | పురాణాలుగా |
| viii | 28 | పూర్వార్ణం | పూర్వార్థం |
| x | 25 | విధుండు | విభుండు |
| xi | 8 | పెరుంచేడు | పెరుంబేడు |
| xii | 1 | కృష్ణప్పన్నాయడు | కృష్ణప్పనాయడు |

| | | | |
|---|---|---|---|
| xiii | 12 | అందుచేతనే తర్వాత | అందుచేతనే |
| xiv | 20 | ఆవసరం | అవసరం |
| xv | 13 | portugese | Portugese |
| | | paes | Paes |
| xv | 27 | గ్రంథములకు | గ్రంథములగు |
| xvi | 2 | వ్యావహారిక ప్రయోగము | వ్యావహారిక పదజాల ప్రయోగము |
| | 7 | Composition | composition |
| xvii | 5 | మాటవరసనై నను | మాటవరసకైనను |
| xxi | 4 | చారిత్రక కృతి[54] | చారిత్రక కృతి[53] |
| | 6 | కానివాడు | కానివాడు[54] |
| | 12 | మధురపురాంధ్ర | మధురాపురాంధ్ర |
| xxiii | 14 | సభావతి వచనం | సభాపతి వచనాన్ని |
| | 19 | చాయామాత్రం | ఛాయామాత్రం |
| | 23 | వికపంచిన | వికసించిన |
| | 24 | అణ్నగిర్లు | అణ్నగర్లు |
| xxv | 13 | రక్షిణాంధ్ర | రక్షిణాంధ్ర |
| Liii | 1 | ధళనోద్భూత | దళనోద్భూత |
| | 7 | 60:16 | 48:12 |
| | 8 | 70:4 | 48:73 |

## రాయవాచకము

| | | | |
|---|---|---|---|
| 2 | 7 | ఆధ్యాత్మ | అధ్యాత్మ |
| 4 | 26 | సంమకాంచన | సమకాంచన |
| 5 | 7 | అయన్నము | అ యన్నము |
| | 10 | అట్టీ | అట్టి |

| | | | |
|---|---|---|---|
| | 16 | భిక్షం బెట్టులును | భిక్షంబెట్టుటను |
| | 27 | దిలునా | దినాలు |
| 6 | 1 | పురుప | పురుష |
| | 5 | అశ్త్వద్ధ | అశ్వద్ధ |
| | 9 | ఆ దిక్కున | అదిక్కున |
| | 18 | నడెపి _ రా | నడిపిస్తిరా |
| | 21 | సింగిరిభట్టు | సింగిరిభట్లు |
| | 26 | పుభయపార్శ్వములు | వుభయపార్శ్వములు |
| 7 | 2 | కాపడి | కావడి |
| | 4 | అసమయాన | ఆ సమయాన |
| | 5 | వా వంటి | నా వంటి |
| | 26 | విశ్వనాథులనునున్ని | విశ్వనాథులనున్న |
| | | విశాలక్షి నిం్న | విశాలక్షినిన్ని |
| 8 | 10 | తామ్రపర్టి | తామ్రపర్ణి |
| | 11 | కట్టుడ | కట్టడ |
| | 18 | పేరు | పేర |
| 9 | 8 | కిష్కింద | కిష్కింధ |
| | 10 | విలువనంపించి | పిలువనంపించి |
| 10 | 6 | శంకుసాపన | శంకుస్థాపన |
| | 17 | సానానకు | స్థానానకు |
| 11 | 18 | దళనాకులు | దళనాయకులు |
| 12 | 4 | సీంధు | సింధు |
| | 25 | అర్థవ్యయం | అర్థ్రవయం |
| 13 | 3 | విచక్షము | విచక్షణము |
| | 18 | యెప్పు | యొప్పు |
| | 21 | సపాంగంబులను | సప్తాంగంబులను |
| 14 | 20 | దీర్ఘసూత్రతము | దీర్ఘసూత్రతయు |

| పుట | పంక్తి | అశుద్ధము | శుద్ధము |
|---|---|---|---|
| 15 | 15 | గృహ్ఞ | గృహస్థ |
| | 25 | చంధంబు | గంధంబు |
| 16 | 14 | అంబరీషు | అంబరీష |
| | 19 | ధోజన | భోజన |
| | 20 | ధోగంబు | భోగంబు |
| | 23 | రాజ్యంకలను, | రాజ్యంబులను |
| | 23 | శ్రీగంధంబులను పరిమళలేపనుండై | శ్రీగంధంబులను అష్టసుగంధంబుల పరిమళలేపనుండై |
| 17 | 6 | యొక్కటి | యెక్కటి |
| | 7 | వళ్లఖేదముల | వళ్లభేదముల |
| | 7 | అభ్యుదయ | అభ్యుదయ |
| | 19 | ఆపభ్రంశ | అపభ్రంశ |
| 18 | 13 | న్యాయముగానన్న | న్యాయముగానున్న |
| 21 | 23 | పట్టములోనున్న | పట్టములోనున్న |
| 22 | 8 | సడచిన | నడచిన |
| | 18 | కార్యములు పచ్చి | కార్యములు వచ్చి |
| 24 | 7 | శేకరించి | శేఖరించి |
| | 8 | శేకరించి | శేఖరించి |
| | 22 | బక్కింటికి | వొఖ్కింటికి |
| | 24 | వెక్క | లెఖ్క |
| | 26 | రోజుకున్న | రోజులకున్న |
| 25 | 5 | మెదలైన | మొదలైన |
| | 24 | ఒకనాటి | వొఖనాటి |
| 26 | 22 | బయదలన్న | బయదలనున్న |
| 27 | 10 | రాయలయారు | రాయలవారు |

| | | | |
|---|---|---|---|
| 28 | 13 | ఆసతిచ్చిన | ఆనతిచ్చిన |
| 29 | 17 | సంవత్సరాలాయెను | సంవ్వత్సరాలాయెను |
| 30 | 9 | తుళువర్ తునున్ను | తుళువరౌతులనున్ను |
| | 21 | కబ్బలి | కబ్బిలి |
| 31 | 14 | తిమ్మ్యరసు | తిమ్మరసు |
| 32 | 11 | భవతినానవ | భవతి వా నవ |
| 37 | 4 | లక్షాయాబై | లక్షాయాభై |
| | 11 | పగను | వగను |
| 38 | 19 | తలారకి | తలారికి |
| 39 | 2 | శింగ్గాణికొవల | శింగ్గాణికొనల |
| | 11 | కట్టీవుందురు | కట్టివుందురు |
| 42 | 17 | బట్లము | పట్టము |
| | 20 | తురకారణ్యామనగా | తురకాణ్యామనగా |
| 43 | 7 | అచి | అని |
| 45 | 25 | నంప్పేది | చంప్పేది |
| 46 | 14 | పౌరిగింట్టికి | వారగంట్టికి |
| | 23 | 23 వ పంక్తి తర్వాత "దేగల పట్టుక వుండ్డగా నిజాంశాహు అనే పేరు వచ్చెను" అని చేర్చి చదువుకోవలెను. | |
| 47 | 20 | ఆని | అని |
| 48 | 3 | ప్రత్యేకం | ప్రత్యేకం ప్రత్యేకంగ్గా |
| 48 | 4 | ఆప్పాజి | అప్పాజి |
| | 14 | నేవీధి | నే వీధి |
| | 14 | సంబ | స్తంభ |
| | 26 | బాబ్రాహ్మణోత్తములు | బ్రాంహ్మణోత్తములు |
| 51 | 11 | అయినప్పటికిన్ని | అఇనప్పటికిన్ని |

| | | | |
|---|---|---|---|
| 52 | 10 | అవిమొనలు | అనిమొనలు |
| | 12 | యేటికట్టుస | యేటిగట్టున |
| | 27 | తిరుగుతావుంప్డే | తిరుగుతావుండ్డే |
| 53 | 10 | సమరముయ్యగా | సమరమియ్యగా |
| 54 | 13 | వుండ్డే రవుతు | వుండ్డే రవుతుకు |
| | 24 | అరువైనవాలుగు | అరువై నాలుగు |
| 55 | 4 | పహా | సహా |
| | 15 | కదు | కద్దు |
| 56 | 1 | వాత్తఽలు | వార్తాలు |
| | 12 | నిమిత్య | నిమిత్త్యై |
| | 17 | ఆరి | అరి |
| | | ధర్మ్మత్రాం | ధర్మతాం |
| | 19 | వాతఽ | వార్తా |
| 58 | 7 | ఆమర | అమర |
| | 8 | అళ్ళుండ్లు | అల్లుండ్లు |
| | 14 | అందునుండి | అంద్దునుండి |
| | 23 | తెగాల | తెగల |
| 60 | 12 | పండ్డి | పంద్ది |
| | 17 | అంతట | అంత్తట |
| 61 | 7 | పోయిరి | పోఇరి |
| 62 | 8 | పోయినట్లాయను | పోఇనట్లాయను |
| | 9 | యేరుదాపిట | యేరుదాటి |
| | 22 | జృంభియటోప | జృంభితాటోప |
| 63 | 17 | గప్పినన | గప్పిన |
| | 18 | కొండవీడు | కొండ్డవీడు |
| 64 | 5 | అయినమట్టు | అఇనమట్టు |

| | | | |
|---|---|---|---|
| | 27 | అన్నియి | అన్నియు |
| 65 | 14 | శింగ్గాణులతనున్న | శింగ్గాణులచేతనున్న |
| 66 | 15 | అప్నందులకు | అన్నందులకు |
| | 24 | కూచ్చుండ | కూచ్చుఁండ |
| | 25 | కన్నాటకం | కన్నాఁటకం |
| | 26 | పోట్లూరి | పోట్లూరి |
| 67 | 5 | తురకారణ్యం | తురకాణ్యం |
| | 8 | కొంటే | కొంటేను |
| | 25 | వాల్లఁ | వాల్లఁ |
| 68 | 3 | పొరుదురు | పోరుదురు |
| | 12 | ఆనిమొనను | అనిమొనను |
| | 20 | ‘‘ఉదయాంన్నే’’ అని ఉన్న తర్వాత ‘‘అన్నిన్ని జూచేదు అని సంబుద్ధిగా చెప్పి ఉదయాన్నే”-అని చేర్చి చదువుకోవలెను. | |
| 69 | 8 | గుపగుస | గుసగుస |
| | 10 | వుంట్టగా | వుండ్డగా |
| | | దీపటికొలువై | దీవటికొలువై |
| 70 | 5 | అలోచన | ఆలోచన |
| 71 | 25 | నడిపించుకొంట్టా | నడిపించుకొండ్డా |
| 72 | 8 | పయనం | వయనం |
| | 16 | వ్రాసీ | వ్రాసి |
| | 19 | వజ్రాల పరిపెణ | వజ్రాల సరిపెణ |
| 73 | 12 | వీని | విని |
| | 25 | అనర్ఘ్యమై | అనర్ఘ్యమైన |
| 74 | 7 | పీథదోలి | పీడదోలి |
| 75 | 21 | తమతమ | తమ |

| | | | |
|---|---|---|---|
| 77 | 24 | అమ్మ్మవార్కి | అంమ్మవార్కి |
| | 25 | సమర్పించ్మి | సమర్పించ్చి |
| 79 | 1 | ప్రవేళమై | ప్రవేశమై |
| | 6 | కంబ్మలి | కంబ్బళి |
| | 14 | బోయనాకం | బోయనాయకం |
| | 23 | ''ప్రసంగ్గం వెంబ్బడిని'' తర్వాత "అంద్దరున్ను ...ప్రసంగ్గం వెంబ్బడిని''- పునరుక్తి. | |
| 82 | 8 | అంజాలపడి | అరిజాలపడి |
| | 12 | బుట్టుకొని | బట్టుకొని |
| | 22 | sstudies | Studies |
| 83 | 21 | హరిబాణంతామాళ్ను | హరిబాణం కొమాళ్ను |
| 85 | 22 | Dరసి | ఫారసి |
| 86 | 3 | రేయిలచ్చమని | చేయించ్చమని |
| 87 | 8 | కృ.రా.లి. | కృ.రా.వి. |
| | 6 | Armour | Armour |
| 89 | 7 | విరేషములని | విశేషములని |
| | 8 | వాజ్మ | వాఙ్మ |
| 90 | 13 | నిఘంటువుతో | నిఘంటువులలో |
| | 18 | రెంతయుడ్ | రెంతయున్ |
| 91 | 24 | మూడు | చూడు |
| 93 | 7 | Ring | King |
| | 7 | Princes | Prince |
| | 17 | హోమిక్ | హోమిక |

# రాయవాచకము

## —: పీఠిక :—

### రాయవాచక ప్రశంస

రాయవాచకము చరిత్రకారులకు బంగారు గని; భాషావేత్తలకు వజ్రాలఖని.

వాచ(చి)కము[1] అనగా సమాచారము. కర్ణాటక-విజయనగర రాయలను గూర్చిన, అందు ప్రత్యేకించి సాహితీ సమరాంగణ సార్వభౌముడయిన శ్రీకృష్ణదేవరాయలను గూర్చిన సమాచారము అందజేయుటచే ఈ గ్రంథానికి 'రాయవాచక'మను సార్థకనామధేయము. ఇందులో ప్రసక్తమయ్యే విషయాన్ని అది చదివినందువల్ల కలిగే ప్రయోజనాన్ని, ఈ గ్రంథ రచయిత నాలుగు అవతారికా పద్యాల్లో క్లుప్తంగా ఇలా చెప్పాడు :

విజయనగరవృత్తాంతము
సుజనులచే విన్నయట్టి సూనృతవాక్కుల్
ప్రజలకుఁ దేటపడంగా
సృజియించితిఁ గృష్ణరాయశేఖరు చరితల్

విజయనగర జనపాలుడు
విజయపురి గోలకొండ వీరుల తోడన్
గజపతి నాజి గెలిచిన
విజయుండౌ కృష్ణరాయ వీరుని చరితల్.

రాయవాచకము

తన గ్రంథాన్ని, గ్రంథంలోని రాజనీతులను, - అప్పాజీ రాయలకు చెప్పిన వానిని, పెద్దలు పిన్నలు అందరూ చదివి ప్రయోజనాన్ని పొందాలని ఆశించాడు.

రాయలకు రాజనీతులు
నాయుడు నప్పాజి చెప్పినవి యన్నియుఁ దాఁ
బాయక మనసున నునిచిన
రాయసములు వ్రాయఁ జదువ రసికత గలుగున్.

బాలురు చదివిన బుద్ధి వి
శాలురు గావలయు శాస్త్రజాలంబులలో
లోలురు నరివధ చింతా
శీలురు గావలయు భక్తి శీలత నెపుడున్.

రాయవాచకం చదివినందువలన, విన్నందువలన కలిగే శృతిఫలాన్ని గూడా దాని రచయిత ఇలా తెలిపాడు :

"యీ రాయవాచకం చడివినవాల్లకును విన్నవార్లకున్ను బుద్ధి వివేక విచక్షణములు గలిగి భాగ్యవంతులై యోగశాలులై ఆచంద్రార్కస్థాయిగా సుఖానవుంద్దురు"[2]

రాయవాచకాన్ని చదివినవారు, విన్నవారు భాగ్యవంతులు యోగశాలులు అవుతారో లేదో కాని వారికి చరిత్రవివేకము, భాషావిచక్షణ ఏర్పడుట మాత్రము తథ్యము.

## రచయిత-రచనాకాలము

రాయవాచక రచయిత తనను 'శ్రీమన్మహామండలేశ్వర కాశీవిశ్వనాథ నాయనయ్యవారిస్థానాపతి'[3] నని పదవిచే తెల్పుకొన్నాడు గాని తన పేరును తెల్పలేదు. విజయనగర సామ్రాజ్యకాలంలో విజయనగరరాయల సామంతులు, అమరనాయకులు రాజధానీ నగరమైన విజయనగరమందలి రాజకీయవృత్తాంతా

లను ఎప్పటికప్పుడు తమకు చేరవేయడానికి, తమకు చక్రవర్తులకు మధ్య రాజకీయ లావాదేవీలు కొనసాగించడానికి తమ స్థానాపతులను విజయనగరమందుంచెడివారు. ఇట్లే ఒక రాజ్యమువారు తమ ఇరుగుపొరుగు రాజ్యాలలో, ఇట్టి స్థానాపతులను నియమించెడి రాజకీయ ఆచారముండెడిది. గజపతి రాజ్యంలో కర్నాటకంవారి స్థానాపతి కమలనాభయ్యను,4 పరస్పరంగా ఉన్న తదితర రాజ్యాల, రాజ్యాధిపతుల, అమరనాయకుల స్థానాపతులను రాయవాచకం పేర్కొంటుంది 5 కాశీవిశ్వనాథనాయనయ్యవారి తరపున విజయనగరంలో ఉన్న స్థానాపతి పంపిన విన్నపం లేక 'రిపోర్ట్' యీ రాయవాచకం,

రాయవాచకంలో "కాశీవిశ్వనాథనాయనయ్యవారి స్థానాపతి భక్తపరాధీనుండు సద్వినయభయభక్తులనున్న శాయంగల విన్నపం" అని చెప్పి ఉండడం6 చేత 'భక్తపరాధీను'డనేది యీస్థానాపతి పేరా అని ప్రశ్నించుకోవచ్చు, షష్ఠీతత్పురుషంలో ఉన్న ఇట్టిపేరు అరుదైనది; వింతైనది. ఒకవేళ ఉండినదనుకొన్నా సమకాలిక సారస్వతంలో, శాసనాలలో తటస్థపడదు. అందుచే మనం ప్రస్తుతానికి రాయవాచక రచయితను విశ్వనాథనాయకుని స్థానాపతి అని పదవీపరంగానే చెప్పుకోవలసి ఉంటుంది. దీనినిబట్టి, ఈ విశ్వనాథనాయకుడెవడో అతని కాలమేదో నిర్ణయించగలిగితే రాయవాచక రచనాకాలం నిర్ణయించడం సాధ్యమవుతుంది.

విజయనగరచరిత్రలో సుప్రసిద్ధుడైన విశ్వనాథనాయకుడొకడున్నాడు. ఇతడు కొటికం నాగమనాయని పుత్రుడు. శ్రీకృష్ణదేవరాయల (క్రీ. శ. 1500-1530) చివరి ఏండ్లలో తంజావూరు పాలకుడైన వీరశేఖరచోళుడు మధుర రాజ్యంపై దండెత్తి అచట రాయల సామంతుడుగా మధురను పాలిస్తున్న చంద్రశేఖర పాండ్యుని పారదోలగా, పాండ్యుడు తన రాజ్యాన్ని తనకు దక్కించవలసిందని రాయలతో మొరపెట్టుకొన్నాడు. వీరశేఖరచోళుని దండించి పాండ్యునికి రాజ్యమిప్పించవలసినదని రాయలు నాగమనాయకుని ఆదేశించి సైన్యాలతో పంపాడు. నాగమనాయకుడు చోళుని తరిమి మధుర రాజ్యాన్ని ఆక్రమించి ఆ రాజ్యాన్ని రాయలు ఆదేశం ప్రకారం పాండ్యున కప్పగించక, అధికారాన్ని తన హస్తగతంచేసుకొని రాయలకెదురు తిరిగాడు,

రాయవాచకము

రాయలు నిండుసభలో ఈ తిరుగుబాటుదారుని శిక్షించగల సమర్థుడు లేడా అని ప్రశ్నించగా, విశ్వనాథనాయకుడు తానున్నాని ప్రకటించుకొని, రాయల అనుమతితో తన తండ్రిపై దండెత్తి అతనిని బంధించితెచ్చి రాయలసమక్షంలో ఉంచాడు. రాయలు విశ్వనాథనాయకుని అనన్యసామాన్య స్వామిభక్తికి మెచ్చి, నాగమనాయకుని క్షమించి, విశ్వనాథనాయకుని, మధుర రాజధానిగా, పాండ్య, చోళ రాజ్యాలకు అధిపతిని చేసినాడు ఈ వృత్తాంతం మనకు 'తంజావూరు ఆంధ్రరాజుల చరిత్ర'లో కనబడుతుంది.[7] 'కర్ణాట కొటికం రాజుల కైఫియత్'[8] ప్రకారం అచ్యుతరాయలకాలంలో విశ్వనాథనాయకుడు మధురరాజ్యానికి పట్టాభిషిక్తుడైనట్లు తెలుస్తుంది

పై వృత్తాంతాల ప్రకారం విశ్వనాథనాయకుడు శ్రీకృష్ణదేవరాయల చివరి కాలంలోనో లేక అచ్యుతరాయలకాలం (1530-1542)లోనో మధురరాజ్యానికి పట్టభద్రుడై, మధురనాయకరాజ్యస్థాపకుడును, మధురనాయకరాజులకు మూల పురుషుడును అయినాడు. విశ్వనాథనాయకుడు క్రీ. శ. 1563 వరకు జీవించి వుండినట్లు తెలుస్తుంది; శాసనాలనుబట్టి అతడు క్రీ. శ. 1550 వరకు పదవిలో ఉన్నట్లు తెలుస్తుంది. పై వృత్తాంతాలలోని విశ్వనాథనాయకుడిని, రాయవాచకం పేర్కొన్న కాశీవిశ్వనాథనాయనయ్యను ఒకరుగానే ఊహించి, గుర్తించి, ఆసూరి రంగస్వామి సరస్వతి,[9] యస్. కృష్ణస్వామి అయ్యంగార్[10] జయంతి రామయ్యపంతులు,[11] అరుణకుమారి[11a] మొదలుగా కొందరు చరిత్రకారులు, రాయవాచకాన్ని విశ్వనాథనాయకుని స్థానాపతి పదునారవ శతాబ్ది పూర్వార్థంలో, కృష్ణదేవరాయల చివరి ఏండ్లలోనో, అచ్యుతరాయలకాలం (1530-1542)లోనో వ్రాసి ఉండవచ్చునని అభిప్రాయపడ్డారు. కొందరు రాయవాచకం 16వ శతాబ్ది ఉత్తరార్థంలో, విశ్వనాథనాయకుని కాలంలో (1529-64) వ్రాసిందని భావించారు.[11b]

విజయనగర చరిత్రచతురాననులైన నేలటూరు వెంకటరమణయ్యగారు మొదట్లో పై అభిప్రాయాన్నే కలిగి ఉండినారు.[12] కాని తరువాత ఈ విషయంలో విశేష పరిశోధన గావించి, పైఅభిప్రాయంతో విభేదించారు. సమకాలిక రచనలు, శాసనాలు, సారస్వతము, కైఫియతులు ఆధారంగా, విశ్వనాథనాయ

కుడు కృష్ణదేవరాయలకాలంలో అడపం (తాంబూల కరండ వాహకుడు)గా మాత్రిముండినవాడని, అచ్యుతరాయలకాలంలో అతడు కొంతకాలం(క్రీ.శ. 1533-1542) మధురరాజ్యాన్ని పాలించి ఉన్నప్పటికి, అతడు సామంతరాజోచితమైన మహామండలేశ్వరాది బిరుదములు లేక తనను అచ్యుతరాయల 'ఊడిగము' (సేవకుడు)గ మాత్రిమే చెప్పుకొన్నవాడని, అటుతర్వాత అమరనాయకుడుగ మాత్రిమే ఉండినాడని, మధురనాయకరాజ్యము కృష్ణదేవరాయల కాలమునగాని, అచ్యుత దేవరాయల కాలమునగాని విశ్వనాథనాయకుడు స్థాపించలేదని, అది రక్షస-తంగడి లేక తళ్ళికోట యుద్ధము (క్రీ.శ. 1565) తర్వాత, సదాశివరాయల కాలం (క్రీ.శ. 1542-1576)లో అప్పటి అల్లకల్లోల పరిస్థితులు అదునుగతీసుకొని అప్పటివరకు అమరనాయకుడుగా ఉన్న విశ్వనాథ నాయకుని కుమారుడు కృష్ణప్ప (క్రీ.శ. 1564-1570) స్థాపించినాడని వెంకట రమణయ్యగారు నిర్ధారించారు.[18] అంతేకాక, రాయవాచకంలో పేర్కొన్న 'కాశీవిశ్వనాథ నాయనయ్య' మధురనాయకరాజ్యస్థాపకుడుగా తలచబడే నాగమ నాయకుని పుత్రుడు విశ్వనాథనాయకుడు కాదని నిరూపించి, రాయవాచక గ్రంధకర్త "మధురరాజ్యస్థాపకుడైన విశ్వనాథనాయకునియొక్క స్థానాపతియగాడు, పదునాఅవ శతాబ్దమునందీ గ్రంథము వ్రాయబడనులే"దని తీర్మానించారు.[14]

వెంకట రమణయ్యగారు చెప్పినట్లు, నాగమనాయకుని కుమారుడు విశ్వనాథనాయకుడు మధురనాయకరాజ్య స్థాపకుడు కాకపోగా, రాయవాచకమందలి అంతఃసాక్ష్యం కూడా అది విశ్వనాథనాయకుని కాలంలో, అనగా క్రీ.శ.1560 లకు ముందు వ్రాయబడినట్లు తెలుపదు. రాయవాచకంలో క్రీ.శ. 1560కి తర్వాత ఉండి, ప్రసిద్ధికెక్కిన చారిత్రకవ్యక్తుల, సంఘటనల ప్రసక్తి అధికంగానే ఉంది. రాయవాచక రచనాకాలానికి సంబంధించి ఈ అంతఃసాక్ష్యం వల్ల తెలియవచ్చే చారిత్రక వ్యక్తులను, సంఘటన్లలను కొన్నిటిని వెంకట రమణయ్యగారు తెలిపి ఉన్నారు; వారు తెలిపినవిగాక నేనుగా గమనించిన విషయాలు కొన్ని కలవు. ఈ గ్రంథరచనా కాలానికి సంబంధించి వెంకట రమణయ్యగారు తెలిపిన విషయాలను కొంత విపులీకరించిన్నీ, నేనుగా గమనిం

చిన వానిని ఈ క్రింద పొందుపరుస్తున్నాను. కాని ఈ అంతఃసాక్ష్యమంతా రాయవాచకం ఫలాని సంవత్సరాల మధ్య వ్రాసి ఉండవచ్చునని చెప్పడానికి తోడ్పడుతుందే కాని, ఖచ్చితంగా రచనాకాలాన్ని గుర్తించడానికి వీలుగాలేదు. శ్రీకృష్ణదేవరాయల (క్రీ.శ. 1509-1530) తర్వాతి కాలానికి సంబంధించి రాయవాచకం పేర్కొన్న సన్నివేశాలను, వ్యక్తులను, ఈ క్రింద, వీలైనంత వరకు వాని కాలక్రమంలో పొందుపరుస్తున్నాను.

(1) మొదటగా, రాయవాచకం ఫలానా కాలానికి ముందుగా రచించినదని చెప్పడానికి గట్టి ఆధారముంది. ఈ రాయవాచకం ఆధారంగా కుమార ధూర్జటి 'కృష్ణరాయవిజయ'మనే పద్యకావ్యాన్ని, ఆర్వీటి చినవెంకటపతి కోరికపై రచించి, శ్రీరామునికంకితమిచ్చాడు. ఈ చినవెంకటపతిని క్రీ. శ. 1630-1642లో కర్ణాట సామ్రాజ్యాన్ని పాలించిన ముమ్మడి వెంకటపతిదేవ రాయల తమ్ముడు చినవెంకటపతిగా గుర్తించి, వెంకటరమణయ్యగారు, ఈ కాలం (క్రీ.శ. 1630-1642) నాటికి "రాయవాచకము రచియింపబడియుండె నని నిశ్చయముగ జెప్పవచ్చును"అని అన్నారు.[15] కాని ఈ చినవెంకటపతిని గుర్తించుటలో వెంకటరమణయ్యగారు పొరపాటుపడ్డారు. ఈ చినవెంకటపతి, ముమ్మడి వెంకటపతి దేవరాయల తమ్ముడయిన చినవెంకటపతికి మనుమడైన ఆర్వీటి కోదండరామరాజు రెండవ కుమారుడు. అనగా క్రీ. శ. 1630-42 తర్వాత రెండుతరాలు దాటి ఉన్నవాడు; కాబట్టి 17వ శతాబ్దపు చివరిపాదంలోనో లేక చివరి దశకంలోనో ఉన్నవాడు. అందుచే 'కృష్ణరాయవిజయం' క్రీ.శ. 1675 తర్వాత వ్రాసినదై ఉండాలి,[15a] ఇది రాయవాచకానికి పద్యానుకృతి కాబట్టి. రాయవాచకం క్రీ.శ. 1675లకు ముందు వ్రాయబడి, ప్రాచుర్యాన్ని పొందినట్లు చెప్పవచ్చును.

(2) రాయవాచక కర్త అందలి విషయాలు తాను నేరుగా చూచి వ్రాసినవిగాక, ఇతరుల నుండి విని వ్రాసినట్లు, అవతారికాపద్యాలలో మొదటి దానిలో 'విజయనగర వృత్తాంతము సుజనులచే విన్నయట్టు సూనృతవాక్కుల్' అని సూచించి వున్నాడు. రాయవాచకం కృష్ణరాయల అన్న వీరనరసింహరాయల (1504-1509) దినచర్యము గూర్చి, శ్రీకృష్ణదేవరాయల దిగ్విజయ

విశేషాలను గూర్చి తెలుపుతుంది. రాయవాచక కర్త వారికాలంలో విజయ నగరంలో ఉన్నవాడు కాకపోవుటచే, అటుతర్వాతికాలంలో తాను ఇతరుల వల్ల విన్న విషయాలను వ్రాయడం జరిగింది. అందుచేతనే, కాలవ్యతిరిక్త మయిన సన్నివేశాలను, వ్యక్తులను, విషయాలను రాయవాచకంలో చేర్చడం జరిగింది.

(3) రాయవాచక కర్త, రాయవాచకంలో సంకుసాల నృసింహకవి విరచిత 'కవికర్ణరసాయనం'నుండి రెండు పద్యాలను ఉద్ధరించాడు.[16] సాహిత్య చరిత్రకారులు 'కవికర్ణరసాయనము' శ్రీకృష్ణదేవరాయల అనంతరము(క్రీ. శ. 1640) జరిగిన రచనగా అభిప్రాయపడ్డారు.

(4) శ్రీకృష్ణదేవరాయల ప్రత్యర్థి అయి అతని కాలంలో వున్న గజపతి వంశపాలకుడు ప్రతాపరుద్రగజపతి (క్రీ. శ. 1497–1538) కాని రాయవాచకం శ్రీకృష్ణదేవరాయల సమకాలికుడుగా బాహుబలేంద్ర ముకుంద గజపతిని పేర్కొంటుంది. తెలుగువాడయిన ఈ బాహుబలేంద్ర ముకుంద గజపతి క్రీ.శ. 1560 నుండి క్రీ. శ. 1568 వరకు కళింగోత్కళాలను పరిపాలించాడు.[17] అందుచే రాయవాచకం క్రీ.శ. 1568 తర్వాతనే వ్రాసి ఉండాలి.

(5) విద్యారణ్యులు విజయనగరస్థాపనకు "శాలివాహన శకాబ్దములు లెక్క ౧౧౨౭ యేండ్లు వెయ్యింన్నూటయిరువై యేడేండ్ల మీదచెల్లే ప్రభవనామ సంవత్సరం చైత్రశుద్ధ పౌర్ణమి స్థిరవారం శుభయోగ శుభకరణములు గూడిన శుభముహూర్తమందు ముహూర్తము జేసి, కృష్ణపక్షం అమావాస్యనాటి రాత్రి నిశిసమయమందు శంఖుస్థాపనం"చేసినట్లు రాయవాచకం తెలుపుతుంది.[18] అంతేగాక, వీరనరసింహరాయల కాలం నాటికి ఇరవై తొమ్మిదిమంది రాజులు మున్నూరేండ్లు పాలించారని జరిగిపోయిన కాలాన్ని చెప్పి, భవిష్యత్తులో "ఇంక అరువైయేండ్లు పట్టణమున్ను సింహాసనమున్ను నిలిచియుండును"[19] అని కూడా చెప్తుంది. ఇక్కడ చెప్పిన ప్రభవనామ సంవత్సర చైత్రశుద్ధ పౌర్ణమి స్థిరవారానికి సరిఅయిన శాలివాహనశక సంవత్సరం 1129;1127 అని చెప్పడం పొరపాటు. దీనికి సరిఅయిన క్రీస్తుశకకాలము 1207 మార్చి 15

గురువారం.[20] చైత్రశుద్ధ అమావాస్యకు సరిఅయిన క్రీస్తుశక కాలం 1207 మార్చి 30 శుక్రవారం.[21]

కాని ఇచట కాల నిర్ణయానికి రాయవాచక కర్త చెప్పిన శాలివాహన శకం 1127నే లెక్కలోనికి తీసుకోవటం సరిఅయినదిగా కనబడుతుంది. ఈ శక సంవత్సరానికి సరిఅయిన క్రీస్తువత్సరం 1127+78= 1205. ఆదారభ్యం వీరనరసింహరాయలకాలం నాటికి మున్నూరేండ్లు అయినట్లు రాయవాచకం చెప్తుంది, అనగా క్రీ.శ. 1205+300 =1505. ఇది సరిగా కృష్ణదేవ రాయల ముందు పాలించిన అతని అన్న వీరనరసింహరాయలు పట్టాభిషిక్తుడైన కాలానికి సరిపోతున్నది. అటుతర్వాత అరవైయేండ్లు అనగా క్రీస్తుశకం 1505+60 =క్రీ.శ. 1565 వరకు, పట్టణమున్ను సింహాసనమున్ను నిలిచి ఉంటాయని రాయవాచకం భవిష్యత్తును చెప్పింది. ఇది రక్షస-తంగడి యుద్ధం జరిగి విజయనగరం ధ్వంసమయిన వత్సరం. రాయవాచకంలో ఈ విషయం భవిష్యత్తును గూర్చి చెప్పినట్లు ఉండినా, యదార్థానికి ఈ రక్షస—తంగడి యుద్ధం (క్రీ.శ. 1565) తర్వాతనే రాయవాచకం వ్రాయడం జరిగిందని మనం అనుకోవాలి. చరిత్రలో జరిగిపోయిన విషయాలను ఇట్టి భవిష్య పురాణములుగా చెప్పడం మనకు సంప్రదాయమే.

విజయనగర స్థాపన జరిగింది క్రీ. శ. 1336లో అని చరిత్రకారులు ఏకగ్రీవంగా అంగీకరించిన విషయం. రాయవాచకం 130 ఏండ్ల తేడాతో విజయనగరకాలాన్ని తప్పుగా చెప్పినా, అప్పటినుండి వీరనరసింహరాయల కాలానికి (క్రీ.శ.1505..1509). అటుతరువాత విజయనగర విధ్వంసకాలానికి (క్రీ.శ. 1565) రాయవాచక కర్త చెప్పిన కాలం లెక్కింపు సరిపోతున్నది.

(6) రాయవాచక కర్త క్రీస్తుశకం పదహారవ శతాబ్దపు పూర్వార్ధంలో రచించిన ఏకామ్రనాథుని 'ప్రతాపచరిత్ర'[22] చూచినట్లు, రాయవాచకంలో చెప్పిన "ఢిల్లీలోనున్న ప్రతాపరుద్రుని వృత్తాంతము"[23] సూచిస్తుంది. అట్లే, పదహారవ శతాబ్దపు మధ్యకాలంలో రచించినట్లు భావింపబడిన 'సభాపతి వచనము'[24] నుండి రాయవాచకకర్త చాలావిషయము ఉద్ధరించుకొన్నాడు.[25]

(7) రాయవాచకంలో రాయలవారు వేగర్లను పంపించిన పట్టణాల జాబితాలో మైసూరు, చెన్నపట్టం,[26] చెప్పబడినాయి. అట్లె బాగానగరం లేక భాగ్యనగరాన్నికూడా రాయవాచకం పేర్కొంటుంది.[27] ఈ పట్టణాల నిర్మాణ కాలాలు రాయవాచక రచనా కాలాన్ని నిర్ణయించడానికి ఉపకరిస్తాయి.

క్రీ.శ. 1571లో కాని మైసూరు పట్టణం ఏర్పడలేదని చరిత్రకారుల అభిప్రాయం.[28]

ఇచట పేర్కొన్న చెన్నపట్టం కర్ణాటకంలోని చెన్నపట్టణం. విజయ నగర దళపతి, సామంతుడు అయిన రాణా ఇమ్మడి జగదేవరాయడు దీనికి క్రీ.శ. 1580లో కోట ఏర్పరచి, తనకు రాజధానిగా చేసుకొని పాలించినాడని చరిత్రకారుల అభిప్రాయం.[29]

బాగానగరం లేక భాగ్యనగరమనేది హైదరాబాదుకు మరొక పేరు. దీనిని గోల్కొండ సుల్తానైన ముహమ్మద్ కులీకుతుబ్ షా (క్రీ. శ. 1580–1612) క్రీ.శ. 1591లో నిర్మించాడని చరిత్రకారుల నిర్ణయం.[30]

(8) రాయవాచకం శ్రీకృష్ణదేవరాయలవారి సామంతుల, అమర నాయకుల దళపతుల పేర్లను మనకు తెలిపింది. వీరందరు చారిత్రకవ్యక్తులే. వీరిలో రాణా జగదేవుడు, మట్ల అనంతరాజు, వెలిగోట యాచమనాయడు, సాళువ మేకరాజు, చెవ్వప్పనాయడు, కృష్ణప్పనాయడు, అయ్యానమలక పేర్కొనబడినారు.[30a] కాని వీరు కృష్ణదేవరాయల కాలంలో చారిత్రక ప్రసిద్ధి వహించినవారు కాదు; కృష్ణదేవరాయలనాటి శాసనాలలోకాని, సమకాలిక సారస్వతంలో కాని వీరి పేరు వినపడదు. అచ్యుతరాయలకాలంలో (1530–1542) కూడా వీరు చారిత్రక ప్రసిద్ధి వహించలేదు. సదాశివరాయల కాలం (క్రీ. శ. 1542–1576)లో, క్రీ. శ. రక్షస–తంగడి యుద్ధానంతరం, క్రీ.శ. 1570 మొదలు విజయనగర సామ్రాజ్యాన్ని పాలించిన ఆరవీటి వంశ

రాయవాచకము

పాలకుల కాలంలో, వీరు రాజకీయంగా ప్రాముఖ్యం వహించడం, వీరిపేర్లు సమకాలిక శాసనాలలో, సారస్వతంలో కనపడడం జరిగాయి.

పైన పేర్కొన్నవారి చరిత్రను కొంత ఇచట క్లుప్తంగా చెప్పడం అవసరం.

రాణా జగదేవుడు కర్ణాటక రాష్ట్రిమందలి చెన్నపట్టణపాలకుడయిన ఇమ్మడి జగదేవుడు. ఇతడు ఈ చెన్నపట్టణానికి క్రీ. శ. 1580లో కోట కట్టించి, దానిని రాజధానిగా పాలించాడని పైన చెప్పి ఉన్నాము. ఇతడు అళియ రామరాయల కాలమాదిగా విజయనగర రాజులను పట్టభద్రులను చేయుటలో ప్రముఖపాత్ర వహించినట్లు, పొన్నతోట ఓభళకవి ఇతని కంకిత మిచ్చిన వామనపురాణం పీఠికలోని ఈ క్రింది పద్యం తెలుపుతుంది.

> అళియ రామావనీశుఁ దిర్మలనృపాల
> వరుల శ్రీరంగరాయల సరసుఁడైన
> వీరవెంకటరాయని వెలయరాయ
> పట్టభద్రులఁజేసె నప్పార్థివుండు.

ఇతడు రెండవ వెంకటపతి దేవరాయలకాలం (క్రీ. శ. 1586-1614)లో, అధికారానికై అప్పుడు ఉన్న అంతఃకలహాలలో, తిరుగుబాట్లలో, వేంకటపతి దేవరాయల పక్షం వహించి అతనిని సింహాసనంపై నిలబెట్టినవాడు.[31]

మట్ల అనంతరాజు సాహిత్యవేత్తలకు 'కకుత్స్థ విజయ' కావ్యకర్తగా తెలుసు. ఇతడు పై చెప్పిన జగదేవరాయనితోపాటు, రెండవ వెంకటపతి దేవరాయలకాలంలో ఏర్పడిన తిరుగుబాట్లనణచి, యవనదాడుల నెదిరించి, ఆ రాయలకు సింహాసనమున నిలకడ గలిగించినవాడు. 'కళాపూర్ణోదయ' కృతిపతి నందేల కృష్ణమరాజు తిరుగుబాటు నణచి రాయలకు మినుమిక్కిలి సహాయపడినవాడు.[32] క్రీ.శ. 1606(శా.శ. 1527 గతవిశ్వావసు సంవత్సరం) నాటిది, సీసమాలికలో, అనంతభూపాలుని సిద్ధవటశాసనం ఒకటి లభించింది.[33] ఈ శాసనం "వీరవెంకటరాయ విభుండు చంద్రగిరీంద్ర సీమ సామ్రాజ్యంబు

"సేయుచుండ" అని రెండవ వెంకటపతి దేవరాయలను పేర్కొని, అనంత భూపాలుని, "విబుధ కకుత్స్థ విజయ ప్రబంధాది కావ్యనిబంధనగ్రంథకర్త" "అఖిల కర్ణాట సింహాసనాధీశ్వర దక్షిణ బాహాభీధానధారి" అని వర్ణించింది. అతని ఇతర ఘనకార్యాలను పేర్కొన్నది.

వెలుగోటి యాచమనాయడు కస్తూరి రంగప్ప నాయనిపుత్రుడు. ఇతనికే పెద్ద యాచమనాయడని, యాచశూరుడని పేర్లు. ఇతడు క్రీ. శ. 1601–1602 ప్రాంతంలో తమిళదేశంలోని తిరుగుబాట్లనణచి రెండవ వెంకటపతి దేవరాయల నుండి పెరుంచేడుసీమ (చెంగల్పట్టు,మదురాంతకం తాలూకాలు)ను అమరంగా పొందినవాడు. రెండవ వెంకటపతి తర్వాత నాలుగు వత్సరాలు మాత్రమే పాలించిన శ్రీరంగరాయల (క్రీ.శ. 1614–1619)ప్రత్యర్థుల నెదిరించి, అతనిని సింహాసనముపై కుదురుపరచవలెనని తీవ్రప్రయత్నము చేసినవాడు శ్రీరంగ రాయల తర్వాత రామదేవరాయల (క్రీ. శ. 1619–1629)ను విజయనగర సింహాసనమున నిలుపు ప్రయత్నంలో సుప్రసిద్ధమయిన తోపూరు యుద్ధం (క్రీ.శ. 1617)లో గొబ్బూరు జగ్గరాయాది ప్రత్యర్థులనెదిర్చి జయించినవాడు. ఈ యాచమనాయని వీరోచిత కృత్యాలు వెలుగోటివారి వంశావళిలోను, అనేక కైఫియత్తులలోను, చాటువులలోను వర్ణింపబడినాయి.34

సాళువ మాకరాజు రెండవ వెంకటపతి కాలంలో, రెండవ శ్రీరంగ రాయల కాలం (1614–1619)లో ఉండి వారి ప్రత్యర్థివర్గంలో చేరినవాడు. ఈ సాళువ మాకరాజు తండ్రి అయిన సాళువ తిమ్మరాజుకే చదలువాడ మల్లన కవి తన 'విప్రనారాయణ చరిత్ర' నంకిత మిచ్చాడు. పై చెప్పిన తోపూరు యుద్ధంలో మాకరాజు గొబ్బూరి జగ్గరాయలవైపు పోరాడాడు.35

చెవ్వప్పనాయడు తంజావూరు నాయకరాజుల మూలపురుషుడయిన చెవ్వప్పనాయకుడు (క్రీ. శ. 1535–1580) అయి ఉండవచ్చు. ఇతడు అచ్యుతదేవరాయల దేవియైన తిరుమలాంబ (?) చెల్లెలు మూర్తyాంబ భర్త. కొటికం విశ్వనాథనాయకుని సమకాలికుడు. ఇతడు క్రీ. శ. 1580 వరకు జీవించి ఉండినా, ఇతని పరిపాలన క్రీ.శ. 1572కు పరిమితమయింది.36

రాయవాచకము

కృష్ణపనాయుడు విశ్వనాథనాయకుని పుత్రుడై ఉండవచ్చు.[37] ఇతడే మధురనాయక రాజ్యస్థాపకుడని వెంకటరమణయ్యగారి అభిప్రాయమును పైన చెప్పి ఉంటిమి. విశ్వనాథుని పుత్రుడైన ఈ కృష్ణప్పనాయకుడుగాక. సదాశివ రాయలకాలంలో ఆడపం బయ్యప్ప నాయకుని పుత్రుడు మరిఒక కృష్ణప్ప నాయకుడు కానవస్తాడు. ఇతడు హసన దేశాన్ని అమరనాయకంగా పాలిం చాడు. క్రీ.శ. 1562, 1563 నాటివి కర్ణాటక శాసనాలు మూడు ఇతనిని పేర్కొంటాయి.[38]

అయ్యనమలుక, సదాశివరాయలకాలంలో దుమ్మెసీమను అమరంగా పాలిస్తున్నట్టు క్రీ. శ. 1562 నాటి ఒక కర్ణాటక శాసనం చెప్తుంది. ఈ శాసనంలో ఇతడు అయ్యనమలుక వొడెయరు అని పిలువబడ్డాడు.[39]

పైన కనుపరచినవ్యక్తులు,సన్నివేశములు రాయవాచకము ఖచ్చితముగా క్రీ.శ. 1575కు పూర్వము వ్రాసినది కాదని సూచించును. రాయవాచక మందలి బాగానగర లేక భాగ్యనగర ప్రసక్తి అది, ఆ నగర నిర్మాణము (1591) తర్వాతనే వ్రాసి ఉండవలెనని సూచిస్తుంది. పోగా,

(9) రాయవాచకము పైన కనపరచిన చారిత్రక వ్యక్తులతోపాటు కొటికం విశ్వనాథనాయకుని కూడా కృష్ణరాయల దళనాయకులలో ఒకనిగా పేర్కొనింది.[40] ఇతనిని మహామండలేశ్వరుడనిగాని, మధురరాజ్యపాలకుడని గాని రాయవాచకము ఎక్కడా చెప్పలేదు. రాయవాచకమును రచించిన 'మహామండలేశ్వర కాశీవిశ్వనాథనాయని స్థానాపతి,' ఈ 'దళనాయకు'డయిన విశ్వనాథనాయని స్థానాపతి కాడనుటకు, ఈ విశ్వనాథనాయకులు వేర్వేరు వ్యక్తులనుటకు ఇది బలవత్తరమైన సాక్ష్యము. ఇక,

(10) రాయవాచకము పేర్కొనిన ఈ మహామండలేశ్వర విశ్వనాథ నాయనయ్య ఎవ్వరనునది విచారణీయము. మధురనాయక రాజులలో వారి మూలపురుషుడుగా ఎంచబడే నాగమనాయని పుత్రుడు విశ్వనాథనాయకుడుగాక మరి ఒక విశ్వనాథనాయకుడు ఉన్నాడు. ఇతడు క్రీ. శ. 1595 మొదలు 1602 వరకు మధురను పాలించిన రెండవ కృష్ణప్ప తమ్ముడు.[41] ఇతడు తన

అన్నతో కలిసి రాజ్యము పాలించినాడని చరిత్రకారుల అభిప్రాయము. రాయవాచక రచయిత అయిన స్థానాపతి 'విస్సప్ప' అనబడే ఈ విశ్వనాథనాయకుని స్థానాపతి అయి ఉండవలె.

పై ఉపపత్తులన్నీ రాయవాచకకర్త రెండవ వెంకటపతి దేవమహాదేవరాయలకాలం(క్రీ.శ. 1586-1614)లోనో, అటు తర్వాతనో ఉన్నవాడని సూచిస్తాయి. కాని ఇతడు మహామండలేశ్వర విశ్వనాథనాయనయవారి స్థానాపతి అగుటచే, ఈ విశ్వనాథనాయనయ్యను రెండవ వెంకటపతి దేవరాయలకాలం (క్రీ.శ. 1586-1614)లోనే ఉండి, క్రీ. శ. 1595 మొదలు 1602 వరకు మధురను తన అన్నతోపాటు కలిసి పాలించిన రెండవ కృష్ణప్ప తమ్ముడు విశ్వనాథనాయకునిగా గుర్తించవలసివస్తుంది. అందుచే రాయవాచకాన్ని క్రీ.శ. 1592, 1602ల మధ్య ఎప్పుడో వ్రాసి ఉండవలె. ఇది తరువాత జనబాహుళ్యంలో బాగా ప్రచారంలోకి వచ్చి ఉంటుంది. అందుచేతనే, తర్వాత సుమారు యాభై ఏండ్ల తర్వాత ఉండిన కుమార ధూర్జటి, ఆర్వీటి కోదండరామ రాజు రెండవ కొడుకైన చినవెంకటపతి ఆదేశంమీద రాయవాచకాన్ని 'కృష్ణరాయవిజయ'మనే పేర పద్యకృతిగా మలచడం జరిగింది. ప్రస్తుతానికి రాయవాచకం క్రీ. శ. 1592, 1602ల మధ్య వ్రాసినట్లే నిర్ణయించవలసి ఉన్నది. ఇంతకన్నా సూక్ష్మంగా రచనా కాలాన్ని నిర్ణయించడానికి ఆధారాలు లేవు.

కాలనిర్ణయానికి సంబంధించిన ఈ చర్చను ముగించే ముందు ఒక అనుమానాన్ని పాఠకుల ముందు ఉంచాలి. రాయవాచకకర్త రెండవ వెంకటపతి(1586-1614) కాలంలోనే ఉన్నవాడయితే, రాయవాచకంలో, రెండవ వెంకటపతి కాలంలోనే రాజకీయప్రాముఖ్యాన్ని వహించి ఉన్న మట్ల అనంతరాజు,రాణాజగదేవు మొదలైన ప్రసిద్ధవ్యక్తులను కృష్ణదేవరాయల ఆస్థానంలో ఉన్నవారుగా ఏల చెప్పవలసివచ్చింది? దీనికి ప్రస్తుతంలో సమాధానం లేదు. ఈ అనుమానం మీద రాయవాచకకర్త రెండవ వెంకటపతి కాలం తర్వాత ఉండినవాడని చెప్పడానికి, అతడు విశ్వనాథనాయనయ్యవారి స్థానాపతి అనే విషయం అడ్డు తగులుతుంది.

## రాయవాచకము — చారిత్రకాధారము

రాయవాచకం చరిత్రకారులకు బంగారుగనియని మొదటనే చెప్పితిమి. విజయనగర చరిత్రకారులకు, అందును ప్రత్యేకముగ సాహితీసమరాంగణ సార్వభౌముడయిన శ్రీకృష్ణదేవరాయల చరిత్రపై కృషి చేయువారికి ఇది అమూల్యమైన మౌలికాధారము. చారిత్రకాధారంగా దీని విలువను చరిత్ర కారులనేకులు గుర్తించారు; కాని ఈ గనిని త్రవ్వి విజయనగర చరిత్రలో బంగారుపంట పండించినవారు, విజయనగర చరిత్రలో అర్ధశతాబ్దమునకు మించి అవిరళకృషి గావించిన డాక్టర్ నేలటూరు వెంకటరమణయ్యగారు విజయనగర చరిత్రకు సంబంధించి, కృష్ణరాయల పరిపాలనా కాలానికి ప్రత్యేకించి, రాయవాచకంలోని అనేకానేక విషయాలను, ముఖ్యంగా ఆనాటి పరిపాలనాయంత్రాంగానికి, కృష్ణరాయల దిగ్విజయాలకు సంబంధించిన విశేషాలను, సమకాలిక సారస్వతంలో, శాసనాలలో చెప్పిన విషయాలతో, విదేశీయుల రచనలతో సమన్వయించి, తైపారువేసి, దానిలోని గుణ, దోష నిరూపణ చేసి, దాని నిగ్గు తేల్చిన మనీషి వెంకటరమణయ్యగారు.[42] వెంకట రమణయ్యగారు విశేషకృషి సలిపి ఉన్నప్పటికి, రాయవాచకంలోని చారిత్రక విషయాలకు ఆంగ్ల, ఆంధ్రభాషలలో సమగ్రవ్యాఖ్యానాన్ని సంతరించి ప్రకటించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది; కాని అది ప్రత్యేకమయిన విపులగ్రంథం అవుతుంది; దానికిది చోటు కాదు.

చారిత్రకాధారంగా రాయవాచకానికి గల ప్రాముఖ్యాన్ని గూర్చి పండితులు వెలిబుచ్చిన అభిప్రాయాలను కొన్నింటిని ఇచ్చట చెప్పడం అవసరం. విజయనగర చరిత్రకు గల మౌలిక సారస్వతాధారాల సంకలనమయిన Sources of VijayanagarHistory,1919లో ప్రచురింపబడింది. దాని ఆంగ్ల ఉపోద్ఘాతంలో, సంకలనకర్త రంగస్వామి సరస్వతి ఇట్లా వ్రాశాడు: "The hitherto not well exploited 'Krishna Raya Vijayam' and the 'Raya Vachakam' throw much light upon the actual course of Krishna Raya's Campaign against Orissa."[43] 1933లో ఆంధ్ర సాహిత్యపరిషత్తు (కాకినాడ) వారు తమ 33వ ప్రచురణగా రాయవాచకాన్ని

పుస్తకరూపంలో ప్రచురించారు. దాని Forewordలో యస్. కృష్ణస్వామి అయ్యంగార్ : "It certainly is worth publication as a work of historical character bearing upon the reign of the great Vijayanagar emperor Krishnaraya.............. the details given are of value and throw light upon a few points upon which light is badly needed...... the work is a welcome addition to the sources of history of an important period, and is likely to prove useful in the handy form in which it is printed."44 దాని Introduction లో జయంతి రామయ్య పంతులుగారు : "This chronicle......... is now republished in book form for the use of those engaged in historical research." "In some parts, it receives remakable confirmation from the accounts of the portugese writers paes and Nuniz." "Besides affording valuable information about a most notable epoch in the history of Southern India, the chronicle gives us an insight into the daily routine of life which the kings in those days were expected to live and which they very probably lived"45 "రాయవాచకము, చారిత్రిక విషయముల పట్టిక (Chronicle) అగుటచే వర్ణనలేమియు లేవు. కవి కేవలము చారిత్రికాంశములను వరుసక్రమమున చెప్పెను........ పెక్కు చారిత్రిక విషయములను క్రమముగ తెల్పుటచే విజయ నగర చరిత్రను తెలిసికొనగోరు చరిత్రికారుల కిది మిక్కిలి తోడ్పడును......... వచన చారిత్రిక గ్రంథమగు 'రాయవాచకము,' చంధోబద్ధమగు చారిత్రిక కావ్యమగు 'కృష్ణరాయ విజయము' కృష్ణదేవరాయల చరిత్రను ఆంధ్రులకు అందచేయు అపూర్వ గ్రంథములు" అని అరుణకుమారిగారు చెప్పినారు.45a 'ఆంధ్రవచన వాఙ్మయ' సిద్ధాంతవ్యాసకర్తలైన కులశేఖరరావుగారు ఇట్లు చెప్పినారు : చారిత్రకవచనైక గ్రంథములందు రాయవాచక మొకటి. ఇదివరకు వెలువడిన చారిత్రిక గ్రంథములకు ప్రతాపచరిత్ర, సిద్ధేశ్వరచరిత్ర ములకన్న నిది విశిష్టమైనది. ఇందలి చారిత్రక విశేషములు, మరికొంత యదార్థములుగనుండుటయే దీనికి కారణము.................. ఇట్లే గ్రంథకర్త వ్రాసిన విశేషములు, ప్రతాపచరిత్ర కన్నను, చరిత్రకు సన్నిహితముగానున్న వనుట నమంజనము......... జరిగిన సన్నివేశములపైని, చారిత్రకాంశముల

రాయవాచకము

మీద నీతని దృష్టియుండుటచే, భాష, శైలి మున్నగువాని నీతఁడంతశ్రద్ధగా పాటించి యుండలేదు. అందుచేత వ్యావహారిక ప్రయోగములిందున్నవి. సాహిత్యకమైన ప్రాధాన్యము నాతఁడు పాటించి యుండకపోవుట కూడ నీ కర్తకు చరిత్రపైగల యభినివేశమును స్పష్టపరచుచున్నది.[45b]

రాయవాచకమందలి విషయాలను, విజయనగర చరిత్రకు సంబంధించి తాను వ్రాసిన గ్రంథాలలో అతివిస్తారముగా ఉపయోగించుకొన్న నేలటూరు వెంకట రమణయ్యగారు, "Whatever be the date of its Composition, it stands the test of facts remarkably well. The genuineness of the various items of information which it supplies can be proved by a comparison with the inscriptions, and the contemporary Prabandhas and the Portuguese records."[46] అన్నారు. కాని వేరొకచోట వెంకటరమణయ్యగారు ఈ క్రింది అభిప్రాయమును వెలిబుచ్చినారు. "రాయవాచక మంతటి విశ్వాసపాత్రమైన యాధార గ్రంథముగాదు. రక్షసతంగడి యుద్ధానంతరము కావేరికి దక్షిణమందుండు రాయరాజ్యము నాక్రమించుకొనిన మధుర నాయకులు కృష్ణరాయలచే దక్షిణ రాజ్యమున ప్రతిష్ఠింపబడిరను వసత్య కల్పితగాథను ప్రచారములోనికి దెచ్చుట ఈ గ్రంథము యొక్క ముఖ్యోద్దేశము. కాని యందు వర్ణింపబడియుండు కృష్ణరాయల జైత్రయాత్రాకథన మన్యచరిత్రాధారముల మూలమున వాస్తవమని తెలియుచుండుటవలన దానిని మన మంగీకరించ వచ్చును."[47] వెంకటరమణయ్యగారి ఈ అభిప్రాయమందలి మొదటి రెండు వాక్యములు, ఆంగ్లములో వారొనగిన పై అభిప్రాయానికి కొంతవ్యతిరిక్తంగా ఉన్నాయి. వారు రాయవాచకంలో కొట్టవచ్చినట్టు కనబడే ఒకటిరెండు చారిత్రిక విరుద్ధవిషయాలను జ్ఞప్తియందుంచుకొని ఇట్టి అభిప్రాయాన్ని వెలిబుచ్చారనుకొంటాను. వారు రచించిన విజయనగర చరిత్ర (2 భాగములు), కృష్ణదేవరాయలు అను ప్రామాణిక చారిత్రక గ్రంథాలలో, Studies in the Third Dynasty of Vijayanagar మొదలుగా ఆంగ్లంలో రచించిన చారిత్రక గ్రంథాలలో, రాయవాచకమునుండి విశేషముగా, విస్తారముగా విషయాల నుద్ధరించి, వాని చారిత్రక ప్రామాణ్యతను, ప్రాముఖ్యమును నిరూపించి ఉన్నారు. అట్లే పై

అభిప్రాయంలో, రాయవాచక ముఖ్యోద్దేశము మధురనాయక రాజ్యస్థాపన గూర్చిన అసత్యపుగాథను ప్రచారములోనికి తెచ్చుట అని ఏల వెంకటరమ ణయ్యగారు చెప్పిరో అర్థమగుట లేదు. రాయవాచక ప్రారంభంలో దాని రచయిత తనను విశ్వనాథనాయనయ్య స్థానాపతిగా పేర్కొనుట తప్ప, ఇక ఆ గ్రంథంలో ఎచ్చటా మధురనాయక రాజుల ప్రసక్తి మాటవరసనైనను లేదు. పైన కనుపరచినట్లు మధురనాయక రాజ్యస్థాపకుడని తలచబడే కొటికం విశ్వ నాథనాయకుని కూడా రాయవాచకకర్త, ఆ రాజ్యస్థాపకుడని గాని, మధుర నాయకరాజుల మూలపురుషుడనికాని చెప్పలేదు; అతనిని కృష్ణదేవరాయల దళనాయకులలో ఒకడుగా మాత్రమే పేర్కొనినాడు. బహుశా, రాయవాచక కర్త, మధుర నాయక రాజ్యకాలంలో, ఉన్న, ప్రసిద్ధులయిన కొందరు చారిత్రిక వ్యక్తులను, కృష్ణరాయని కాలములో ఉన్నట్లు చెప్పుట వెంకట రమణయ్యగారి ఈ అభిప్రాయానికి కారణమై ఉండవచ్చు;కాని ఈ వ్యక్తులకు మధుర రాజ్యంతో ప్రసక్తి ఉన్నట్లు రాయవాచకం ఎక్కడా చెప్పలేదు. అందుచే, చారిత్రకాధార గ్రంథంగా, రాయవాచకమును గూర్చి వెంకటరమ ణయ్యగారు ఆంగ్లములో తెలిపిన అభిప్రాయమే సరి అయినది.

రాయవాచకంలో కొట్టవచ్చినట్లు కనబడే ఒకటి రెండు చారిత్రకవిరుద్ధ విషయా లున్నాయని చెప్పితిమి. వాటి నిచట కొంత ప్రస్తావిస్తాము. మొదటిది విద్యానగర లేక విజయనగర నిర్మాణము. విద్యానగర నిర్మాణము శ్రీవిద్యా రణ్యమునీంద్రుల ప్రోత్సాహముతో క్రీ.శ, 1336లో మొదటి హరిహరరాయలు (క్రీ శ. 1335/6–1353) ప్రారంభించినా దనునది పరిశోధనా ఫలితంగా చరిత్ర కారు లంగీకరించిన సత్యము. కాని రాయవాచకము విద్యానగర నిర్మాణ ముహూర్త, శంకుస్థాపనలను గూర్చి, "శాలివాహన శకాబ్దములు లెక్క-౧౧౨౭ యేండ్లు వెయ్యిం న్నూట యిరువై యేడేండ్లమీద చెల్లే ప్రభవనామ సంవత్సరం చైత్ర శుద్ధపౌర్ణమి స్థిరవారం శుభయోగ శుభకరణములు గూడిన శుభ ముహూర్తమునందు ముహూర్తము జేసి, కృష్ణపక్షం అమావాస్యనాటి

రాత్రి నిశిసమయమందు శంఖుస్థాపనం"[48] జరిగినట్లు తెలుపుతుంది. అనగా క్రీ.శ. 1205లో విద్యానగర నిర్మాణం ప్రారంభమయినట్లు తెలుపుతుంది.

ఇట్లాంటిదే కొంత చారిత్రిక కాలవిపర్యయంతో కూడి ఉన్నా, ఆసక్తికరమైన విషయము. శ్రీ తిరుపతి-తిరుమల వెంకటేశ్వర దేవస్థానప్రాంగణంలో శ్రీకృష్ణదేవరాయల, అతని దేవేరులైన తిరుమలదేవీ, చిన్నాదేవుల తామ్రప్రతిబింబాలను అందరూ చూచే ఉంటారు. శ్రీకృష్ణదేవరాయలు తన కళింగ దిగ్విజయానంతరము, రాయచూరు, కలుబరిగెలను జయించిన తర్వాత, తిరుపతి, కాళహస్తి దర్శించి, ఈ తామ్రప్రతిబింబాలను "శ్రీముఖ సంవత్సర అశ్వీజశుద్ధ 12 ది"కి, ఏ ఒకటో, రెండో రోజులు ముందుగా నిలిపినట్లు చెప్పుతుంది [49] ఈ తేదీ క్రీ.శ. 1513, అక్టోబరు 12, మంగళవారానికి సరిపోతుంది. కాని కృష్ణరాయల పూర్వ దిగ్విజయ యాత్ర క్రీ. శ. 1517 నాటికి గాని పూర్తి కాలేదు. రాయచూరు, కలుబరిగె దండయాత్రలు క్రీ.శ. 1520 నాటికి గాని ముగియలేదు.[50] అందుచే రాయవాచకం, సంఘటనల తర్వాత, క్రీ.శ. 1513లో ఈ తామ్రప్రతిబింబాలను నిలిపినారని చెప్పడం కాలవ్యతిరిక్తమయిన విషయము. కాని దీనినిబట్టి, రాయవాచకము చెప్పిన ఈ విషయమును ఉపేక్షింప తగదు. ఏలనన, క్రీ.శ. 1513లో శ్రీకృష్ణదేవరాయలు పూర్వ దిగ్విజయ యాత్రను ప్రారంభించి ఉదయగిరిని ముట్టడిస్తున్న కాలంలో శక. 1435 శ్రీముఖ వైశాఖ బ. 12 సోమవారం (క్రీ.శ. 1513 మే 2)నాడు, మరలా శక. 1435 శ్రీముఖ ఆషాఢ శు. 11 సోమవారం (క్రీ.శ. 1513 జూన్ 13)నాడు వేంకటేశ్వరస్వామిని దర్శించినట్లు తిరుపతి-తిరుమల దేవస్థాన శాసనాలవలన తెలుస్తుంది.[51] ఈ సందర్భాలలో ఒకదానిలో శ్రీకృష్ణదేవరాయలు తన యొక్క, తన దేవేరుల తామ్ర ప్రతిబింబాలను అచట నిలపడం జరిగి ఉండవచ్చు; కాని ఈ విషయం ఎక్కడా శాసనస్థం కాలేదు; రాయవాచకాన్నిబట్టి, శ్రీముఖ సంవత్సరంలోనే మరలా, మూడవసారి, రాయలు వేంకటేశ్వరస్వామిని దర్శించి, ఈ తామ్ర ప్రతిబింబాలను నిలిపినట్లు తెలుస్తుంది. రాయవాచకకర్త చెప్పిన చారిత్రిక సంఘటనల(పూర్వదిగ్విజయము,

రాయచూరు, కలుబరిగె విజయాలు)కు, శ్రీముఖ(క్రీ.శ. 1513) సంవత్సరానికి, అయిదారు వత్సరాల తేడాతో కాలం కుదరకపోయినా, కృష్ణరాయలు తామ్ర ప్రతిబింబాలను శ్రీముఖ (1513) సంవత్సరంలో నిలిపినాడని రాయవాచకం చెప్పిన విషయం యదార్థమనితోస్తుంది. రాయలు ఈ తామ్ర ప్రతిబింబాలు నిలిపిన విషయాన్ని ఎప్పుడు నిలిపాడనే విషయాన్ని ఒక్క రాయవాచకం మాత్రమే చెపుతుంది. నాకు తెలియవచ్చినంత వరకు సమకాలిక సారస్వతంలో కాని, శాసనాలలోకాని ఈ ప్రస్తావన కానరాదు.

రాయవాచక కథనంలో ఆయువుపట్టనదగినది, అత్యంత ప్రధానమయినది కృష్ణరాయ దిగ్విజయ వృత్తాంతము. రాయవాచకంలో ఇచ్చిన ఈ దిగ్విజయ వివరాలు, కాలక్రమం, సమకాలిక శాసనాలనుండి సారస్వతం నుండి తెలియవచ్చు విషయాలతో చాలవరకు సరిపడి, విజయనగర చరిత్రకారులకు మిక్కిలి ఉపయుక్తంగా ఉన్నాయి. ఇంతేకాక, రాయవాచకం విజయనగర సామ్రాజ్య పరిపాలనాయంత్రాంగం, మంత్రాంగం, కోశాది వివరణము, రాజోద్యోగులు, పదవులు, సేనా వివరాలు, సాంఘిక మర్యాదలు, రాజసభా మర్యాదలు, రాజుల దినచర్య మొదలయిన అనేకవిషయాలను గూర్చి తెలియజేస్తుంది; వేషభాషలు మొదలగు విషయాలను గూర్చి కొంత తెలియజేస్తుంది. ఆనాటి రాజ్యాల,రాజుల బలాబలాల తారతమ్యం, వారి అంగబలం,అర్థబలం, వారి రాజకీయపు ఎత్తుగడలు, రాజ్యవిస్తీర్ణాలు, దండన విధానాలు, వేగు మొదలగు ఆసక్తికరమగు ఎన్నో విషయాలను మనకు ఎరుకపరుస్తుంది. ఈ విషయాలలో కొన్నిటిని విశ్లేషించి ఈ గ్రంథానికి అనుబంధంగా చేర్చడమైనది.

## రాయవాచకము — ఆంధ్రవచన వాఙ్మయము

రాయవాచకం భాషావేత్తలకు, సాహిత్య పరిశోధకులకు వజ్రాలఖని యని తొలుతనే చెప్పి ఉంటిమి.

ఆంధ్రవచనవాఙ్మయంలో రాయవాచకానికొక విశిష్టస్థానముంది. ఒక

సాహిత్యవేత్త నుడివినట్లు. "దేశచరిత్రకు వలెనె తెలుగు వచన చరిత్రకున్నూ ఇది మిక్కిలి ముఖ్యమైన గ్రంథము.[52] ఆంధ్రభాషలో వచనరచన చాలా ప్రాచీన మయినది. క్రీ. శ. 7వ శతాబ్దం నుండి వచనం వ్యవహారంలో ఉన్నట్లు శాసనాలవలన తెలుస్తుంది. అంతేకాదు ఈ వచనం సమకాలిక వ్యవహారభాషలో వ్రాయబడింది. క్రీ.శ. పదకొండవ శతాబ్దంలో నన్నయ మహాభారత రచనతో, చంపూ ప్రక్రియలో, ఆంధ్రసాహిత్యం ఆరంభమయిన తర్వాత కూడా, తెలుగు శిలాశాసనాలు కడవరకు వచనంలో, ఆయా శాసనాల కాలంలోఉన్న వ్యవహారభాష లోనే వ్రాయబడినాయి. తెలుగు పద్యశాసనాలు చాల కొద్ది మాత్రమే ఉన్నాయి. కాని సాహిత్యంలో మాత్రం విస్తారమైన వచనరచన ఉండినా, అది ఆదికవి అయిన నన్నయభట్టు కాలం నుండి పద్య కావ్యాంతర్గతంగా మాత్రమే కానవస్తుంది. నన్నయ వచనరచన సమకాలిక తెలుగు శాసనాలలోని వచనరచనకు (అనగా నాటి వ్యవహారభాషకు) దగ్గరగా ఉందని గిడుగు రామమూర్తి, జయంతి రామయ్యపంతులు, మల్లంపల్లి సోమ శేఖరశర్మ మొదలగు శాసన పరిశోధకులు నిరూపించారు.[52a] కాని తరువాతి కాలంలో అది గ్రాంధికభాష ననుసరించి వ్యవహారభాషకు దూరమయిపోయింది. నన్నయ కాలం (క్రీ.శ. 11వ శతాబ్దం) నుండి పదిహేనవ శతాబ్దాంతం వరకు పద్యకావ్యాంతర్గతంగా తప్ప, విడిగా వచన రచన జరుగలేదు; స్వతంత్ర మయిన వచనకావ్యమేది వెలువడలేదు. పదునాల్గవ శతాబ్దం నాటి కృష్ణమా చార్యుల 'సింహగిరి నరహరి వచనములు,' 'శఠకోప విన్నపములు' ఈ చెప్పినదానికి మినహాయింపు మాత్రమే. ఆంధ్రసాహిత్యంలో ప్రబంధయుగ మని పేరుగాంచిన పదహారవ శతాబ్దం నుండి. తాళ్ళపాక పెదతిరుమలయ్య 'వెంకటేశ్వరవచనము'లాదిగ స్వతంత్ర వచనరచనలు పరిమితంగా తెలుగు సాహిత్యంలో చోటుచేసుకొన్నాయి. ఇవన్నీ చాలవరకు మత, వేదాంత వాఙ్మయానికి సంబంధించినవి; ఏ ఒకటో, రెండో తప్ప, మిగిలినవన్నీ గ్రాంథికభాషలో వ్రాసినవి.[53]

లౌకిక విషయాలకు సంబంధించి ఈ కాలంలో వెలువడిన వచనరచన లలో, వాని కాలక్రమంలో, ప్రతాపచరిత్ర, సభాపతి వచనము, రాయవాచకము

చెప్పుకోవాలి. ప్రతాపచరిత్ర 16వ శతాబ్దం పూర్వార్థానికి చెందింది. గ్రాంథిక భాషలో రచించింది; ఆంధ్రసాహిత్యంలో తొలి చారిత్రక రచన. నిడుదవోలు వెంకటరావుగారు అన్నట్లు, "ఇది కాకతీయుల వృత్తాంతమును దెలుపు తొలి వచనకృతి-చారిత్రక కృతి."[54] 'ప్రతాపచరిత్ర'కర్త ఏకామ్రనాథుడు. ఈ ఏకామ్రనాథుడు కూడా రాయవాచకకర్త వలెనే ఖచ్చితముగా గుర్తింపవీలు కానివాడు. 16వ శతాబ్దం మధ్యకాలానికి చెందినది[55] 'సభాపతి వచనము' సభాపతి (రాజు) ఎటువంటి వాడుగ ఉండవలె అనువర్ణనతో ప్రారంభమగు చున్నది కాబట్టి 'సభాపతి వచనము' అని దీనికి పేరు ఏర్పడింది. మంచి గ్రాంథిక రచన. కర్త ఎవరో తెలియదు.[56] ఇది ఒక చిన్న సంఖ్యార్థనామ ప్రకాశిక లేక సంకేత పదకోశం లాంటిది. పైన మనము చర్చించినట్లు, 16వ శతాబ్దం చివరనో, 17వ శతాబ్దపు ప్రారంభంలోనో వెలువడింది రాయవాచకం. దక్షిణదేశాంధ్రవాఙ్మయంలో మధురపురాంధ్ర వాఙ్మయ శాఖకు చెందినది. నిడుదవోలు వెంకటరావుగారు చెప్పినట్లు, "మధురలో విశేషమేమనగా వచనములోగూడ మొదట కావ్యములు బయలుదేరుట. విశ్వనాథనాయకుని స్థానాపతి రాయవాచకముతో నీ వాఙ్మయచరిత్ర ప్రారంభమగుచున్నది." "మధుర నాయకులకాలమునఁ బుట్టిన గ్రంథములలో రాయవాచకము ప్రథమము".[57]

ఈ చారిత్రిక వచన రచనలకు నాడు జనంలో బాగా ప్రచారం ఉండి ఉండాలి. ఎందువల్లననగా, ఏకామ్రనాథుడి 'ప్రతాపచరిత్ర'ను అతనికంటె అర్వాచీనుడయిన కాసె సర్వప్ప ద్విపద కావ్యంగా మలిచాడు; అంతేకాదు. అటు తర్వాత కూచిమంచి జగ్గకవి 18వ శతాబ్దపు పూర్వార్థంలో, దీనిని 'సోమదేవరాజీయ'మనుపేరిట పద్యకావ్యంగా రూపొందించాడు. ఇదేవిధంగా రాయవాచకాన్ననుసరించి, పదిహేడవశతాబ్దపు చివరిపాదంలో కుమారధూర్జటి 'కృష్ణరాయవిజయ' మనే పేరిట దానిని పద్యకావ్యంగా మలిచాడు.[58] తంజావూరి ఆంధ్రరాజుల చరిత్రలో రాయవాచకం నుండి రాజుల దినచర్యకు సంబంధించి సుమారు 25 పంక్తులు గ్రహింపబడ్డాయి.[58a]

రాయవాచకకర్త 'ప్రతాపచరిత్ర,' 'సభాపతి వచనము' చదివి 'రాయవాచకం'పేరిట కృష్ణదేవరాయని దిగ్విజయాలనుగుర్చి వ్రాయడానికి ప్రేరితు

వయనారన్నా విప్రతిపత్తి ఉండబోదు. 'ప్రతాపచరిత్ర,' "సభాపతివచనము' రాయవాచకకర్త నిండుపరుకలోని వని చెప్పడానికి రాయవాచకంలోనే సాక్ష్య ముంది. రాయవాచకంలో ఢిల్లీసురథాణీ వోరగంటి ప్రతాపరుద్రుడిని పట్టుకొని ఢిల్లీకి కొనిపోగా, అచట సురధాణి తల్లిగారు ప్రతాపరుద్రునిలో ఈశ్వరాంశ, సురథాణిలో విష్ణ్వాంశ చూచుట అనే సంఘటన చెప్పబడింది. ఇదే సంఘటన 'ప్రతాపచరిత్ర'లో చెప్పబడింది.59 రాయవాచకకర్త ఈ విషయాన్ని ప్రతాప చరిత్రనుండి సంగ్రహించినాడనడంలో విప్రతిపత్తి లేదు. పోగా రాయవాచ కంలో "కృష్ణరాయనికి మంత్రులు రాజనీతియుపదేశించుట" అనేశీర్షిక క్రింద, "తిరుమండై ..............." అని ప్రారంభమయిన కందపద్యం మొదలు, "దుష్టజన నిగ్రహంబును శిష్టజనపరిపాలనంబును జేయవలయు" అనునంత వరకు గ్రాంథికభాషలో ఉండే పేదుపుటల గ్రంథమంతా 'సభాపతి వచనము' నుండి రాయవాచకకర్త యథాతథంగా గ్రహించాడు.60

రాయవాచకకర్త బద్దెన 'నీతిసార ముక్తావళి' నుండి నాలుగు పద్యాలు సందర్భోచితంగా చేర్చాడు. ఆంధ్రమహాభాగవతం నుండి, భారతం నుండి పద్యాలను చేర్చాడు. ఒకటి రెండు సంస్కృత శ్లోకాలను ఉటంకించాడు. రానొక నాలుగు అవతారికా పద్యాలను వ్రాశాడు. నాడు దక్షిణదేశీయాంధ్రు లలో బద్దెన 'నీతిసార ముక్తావళి,' ఆంధ్రభారతం,భాగవతం మంచిప్రచారంలో ఉన్నాయని రాయవాచకం సూచిస్తుంది. ఇంతేగాక, ప్రబంధ యుగానికి (16వ శతాబ్దిం) చెందిన సంకుసాల నృసింహ కవి 'కవికర్ణ రసాయనము' నుండి రెండు పద్యాలను ఉద్ధృతమొనర్చాడు. 61

ఆంధ్రచరిత్రకారులకేగాక, ఆంధ్రవాఙ్మయ చరిత్రకారులకు,సాహిత్య పరిశోధకులకుకూడా రాయవాచకం అత్యంతోపయోగ మయినది.కృష్ణరాయల వారు తమ దిగ్విజయాల నన్నిటిని ముగించుకొన్న తర్వాత "కీర్తిశాశ్వతముగా నిలిచేటందులకు," తన మంత్రుల సలహాపై "కృతులందుకోవలెనని" నిశ్చ యించి, అల్లసాని పెద్దనను 'మనుచరిత్ర'ను చెప్పవలసిందనిన్ని, ముక్కు తిమ్మనను 'పారిజాతాపహరణము' వ్రాయమనిన్ని అనతిచ్చినట్లు రాయవాచకం చెప్తుతుంది.62 రాయవాచక మందించిన ఈ సమాచార మాధారంగా సాహిత్య

పరిశోధకులు మనుచరిత్ర, పారిజాతాపహరణ కావ్యాల రచనాకాలాన్ని నిర్ణయించడానికి ప్రయత్నించారు.[63] అష్టదిగ్గజకవీశ్వరులలో రాయవాచకం ముక్కుతిమ్మయ్యను, అల్లసానిపెద్దన్నను, మాదనగారి మల్లయ్యను మాత్రమే పేర్కొంటుంది.[64] అష్టదిగ్గజకవులందరూ ఆంధ్రకవులు కారని, వారిలో తమిళ, కన్నడ భాషా కవులు కూడా ఉండినారని ఒక వాదముంది; బహుశా రాయలకు సమకాలికులయిన "అష్టదిగ్గజ" ఆంధ్రభాషా కవులు వీరు ముగ్గురే అయి ఉండవచ్చు. అట్లే, తురకలమీద రాయల విజయాన్ని గూర్చి ముక్కుతిమ్మన చెప్పిన చాటువొకటి రాయవాచకంలోని కెక్కింది.[65] రాయవాచకం, రాయలనగరి విద్వాంసులుగా చతుర్వేది రామాదీక్షితులను, అష్టభాషాకవితా కృష్ణావధానులను, శాబ్దికం పాండిత్యం వెంకటరామ శాస్త్రులను, సహస్రావధాని ప్రభాకర శాస్త్రులను పేర్కొంది. ఇతరత్రా శాసనాలలో కాని, సారస్వతంలో కాని వీరి పేర్లు కనపడవు.[65a]

## రాయవాచకము - భాషావిశేషాలు

పైన చెప్పిన సభాపతివచనం, ఉద్ధృతంచేసిన పద్యాలను మినహాయిస్తే రాయవాచకకర్త తానుగా చెప్పదలచిన విషయమంతా నాటి వాడుక భాషలో చెప్పాడు. ఇది నాడు ద్రావిడదేశంలో ఉన్న ఆంధ్రులలో నిత్యవ్యవహారంలో ఉన్న వాడుక భాష అనుకోవాలి. కాని ఈ భాషలో "ద్రావిడదేశంలో ఉన్న ఆంధ్రుల భాష"అని ప్రత్యేకించి చెప్పడానికి ఏలాటి ఆస్కారం లేదు; ఈ భాషలో తమిళభాషా ప్రభావం ఛాయామాత్రంగా కూడా కనపడదు. ఒక్క అరవపదం కాని, తెలుగు తమిళాలు పరస్పరం ప్రభావితమై మార్పు చెందిన తెలుగు పదాలు కాని, తమిళ పదాలు కాని పొరపాటుగా కూడా రాయవాచకంలో కానరావు; రాయవాచకంలోనే కాదు, 17,18 శతాబ్దాలలో మూడుపూవులు ఆరుకాయలై వికసించిన దక్షిణాంధ్రవాఙ్మయంలోనే లేవని చెప్పడంలో తప్పు లేదనుకొంటాను. 'అణ్ణాగిర్లు'[66] 'సాపాటు' అనే పదాలు మినహాయిస్తే రాయవాచకంలో మరెట్టి తమిళపదాలు కాని, తమిళభాషాచ్ఛాయలోనికి వచ్చి రూపం మారిన తెలుగు పదాలు కాని కనపడవు.

రాయవాచకము

కాకతీయుల కాలం నుండి, ముఖ్యంగా క్రీ. శ. 1324లో కాకతీయ సామ్రాజ్యం పతనమై ముస్లిములు ఆంధ్రదేశంలో రాజకీయంగా అడుగుబెట్టి నప్పటినుండి. అనేక పారసీపదాలు రాజకీయ వ్యవహారపరంగా, తెలుగుభాషలో కొన్ని మార్పు లేక, కొన్ని ఇంచుక మార్పుతో చోటు చేసుకోసాగినాయి. శ్రీకృష్ణదేవరాయలకాలం నాటికి, 16వ శతాబ్ది పూర్వార్థానికి, ఈ పారసిపదాలు నిత్యవ్యవహారంలో ప్రవేశించి సమకాలిక శాసనాలలో వాడబడుటేగాక, కవుల కావ్యాలలో కూడా చోటు చేసుకొని కావ్య గౌరవాన్ని కూడా పొందినాయి. 16వ శతాబ్దపు ఉత్తరార్థం నుండి ఈ అన్యదేశ్యాలన్నీ తెలుగుభాషలో ఇమిడి పోసాగి, కాలక్రమంలో తెలుగు ప్రజల నిత్యవ్యవహారంలో అతిసామాన్య పదాలయినాయి. పదిహేడవశతాబ్దారంభం నాటికి తెలుగు వాడుక భాషలో మిక్కిలిగా వ్యవహారంలో ఉన్న పారసీపదాలు, ఎక్కువగా రాజకీయ పారిభాషి కాపదాలు, కొన్ని వేషభాషలను సూచించే పదాలు అనేకం మనము రాయవాచ కంలో చూడవచ్చు. 15వ శతాబ్దాంతంలో బుడతకీచులు దక్షిణదేశంలో అడుగు పెట్టినప్పటినుండి వారికి విజయనగర చక్రవర్తులతో రాజకీయంగా ఏర్పడిన సాన్నిహిత్య ఫలితంగా కొన్ని బుడతకీచు (పోర్చుగీసు) పదాలు, మిగిలిన దక్షిణాదిభాషలలో చోటుచేసుకొన్నట్లే,తెలుగులోకూడా చోటుచేసుకొన్నాయి. 66a రాయవాచకంలో ఒకటిరెండు బుడతకీచుపదాలుకూడా మనకు కనిపిస్తాయి. 66b ఈ అన్యదేశ్యపదాలు ఆంధ్రవాఙ్మయంలో శ్రీనాథుని కాలం నుండి చోటుచేసు కొన్నా, దక్షిణాంధ్రవాఙ్మయంలో వీని వాడుక అతివిస్తారంగా కనిపించడం వీని వ్యాప్తికి, ప్రాచుర్యానికి ఒక కొలమానమని చెప్పవచ్చు.

రాయవాచకంలో ఉన్న పారసీపదాలను మినహాయిస్తే, రాయవాచ కాన్నిబట్టి అప్పటి దక్షిణాది తెలుగు స్వచ్ఛంగా ఉండేదని స్పష్టమవుతుంది. మధుర, తంజావూరు తెలుగు నాయకరాజుల తర్వాత, వారి స్థానంలో పాల కులుగా వచ్చిన మహారాష్ట్ర రాజుల కాలంలో కూడ దక్షిణాది తెలుగు తన ఆచ్ఛదనాన్ని పోగొట్టుకొనలేదు. సుమారు మూడువందలఏండ్లు తమిళదేశపు నడిబొడ్డులో స్థావరమేర్పరచుకొని, తమిళభాషతో సన్నిహిత సంపర్కమునకు అవకాశము కలిగిన తెలుగు, ఆ భాషచే ప్రభావితము గాకపోవుట, ఆ రెండు

భాషల మధ్య చెప్పుకోదగిన ఎట్టి ఆదాన ప్రదానములు లేకపోవుట విస్మయము కలిగించు విషయము. సరళస్వభావముగల తెలుగులో పరుషస్వభావముతో కూడిన అరవమాటలు ఇమడకనా ? భాషావేత్తలు ఈ విషయము పరిశీలించ గలరు. బహుశా, నాడు, తమిళదేశములో తెలుగు రాజభాష అయి ఉండుట కూడా దీనికొక కారణముయి ఉండవచ్చును.

రాయవాచక భాష నోటిమాటకు చేతివ్రాతకు సామరస్యము కుదిరిన వాడుకభాష ; లక్షణగ్రంథాలలోని సూత్రాలకు కట్టుబడని భాష; సమకాలిక శాసనాలలో కనబడే భాష. ప్రాచీన పద్యకావ్యాంతర్గతమైన వచనాన్ని వదలిపెడ్తే, మిగిలిన తెలుగు వచన గ్రంథాలు చాల వరకు వాడుక భాషలోనే ఉన్న విషయం గిడుగు రామమూర్తి పంతులుగారు రుజువు చేశారు; వేటూరు ప్రభాకరశాస్త్రి మొదలగు సాహిత్యవేత్తలు, భాషా విమర్శకులు ఒప్పుకొన్న విషయం. కాని రాయవాచకం లోని భాష లక్షణ విరుద్ధ మయినదే కాని, కావ్య గౌరవం పొందనిది కాదు; రాయవాచకం లోని భాషకు దక్షిణాంధ్ర వాఙ్మయంలో విస్తారంగా ప్రయోగాలు కనబడతాయి. ఈ భాషా విశేషాలను ప్రస్తావించే ముందు, ఈ భాషను గూర్చి పండితులు వ్యక్తం చేసిన అభిప్రాయాలను కొన్నిటిని గమనిస్తాము.

1914 లో రాయవాచకాన్ని ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో మొదటి సారిగా ప్రకటిస్తూ జయంతి రామయ్య పంతులుగారు; "భాష తఱచుగా లక్షణ విరుద్ధమయినను జరిత్రాంశములే ప్రధానము చేసియు దక్షిణ దేశమం దానాఁడు వ్యాపించియున్న వ్యావహారి కాంధ్ర భాషా స్వరూపము లోకమునకుఁ దెలియుట మంచిదనియు వాక్యరచన మున్నది యున్నట్లే ప్రకటించు చున్నారము."[67] 1933 లో రాయవాచకాన్ని పుస్తక రూపంలో ప్రకటిస్తూ, జయంతి రామయ్య పంతులుగారు పై అభిప్రాయాన్నే, తమ ఆంగ్ల పీఠికలో కొంత విపులీకరించారు: "The book is written in the colloquial Telugu which seems to have been current among the Andhra residents in the Tamil districts about the middle of the

16th Century A.D. The language is often faulty and the style involved and some times obscure. Paragraphs and sometimes sections run into one another without any regard to clearness of expression. Punctuation was unknown to the writer.''[68] ఆ ప్రచురణకే వ్రాసిన Foreword లో కృష్ణస్వామి అయ్యంగార్: ''The language of the work is a rather popular form of Telugu and certain features of the language would indicate that it is the Telugu of the Tamil Country. Perhaps the agent was a Telugu of Tamil domicile.''[69]

రంగస్వామి సరస్వతి Sources of Vijayanagar History (1919) లో రాయవాచకానికి వ్రాసిన సంగ్రహ ఆంగ్లానువాద ప్రారంభంలో: "It is written in colloquial Telugu Prose.''[70] 'ఆంధ్ర వచన వాఙ్మయము'లో నిడుదవోలు వెంకటరావుగారు: ''ఇందు సరళమైన వ్యావహారిక వచనము గలదు.''[71] 'తెలుగుపై ఉర్దూ పారశీకముల ప్రభావము' (1968) అనే తమ గ్రంథంలో, రాయవాచకంలోని ఉర్దూ, ఫారసీ పదాలలో కొన్నిటికి అర్థనిరూపణచేస్తూ, కె. గోపాలకృష్ణరావుగారు: "ఇది చారిత్రక ప్రాధాన్యముగల వచన కావ్యము. విజయనగర వృత్తాంతము, శ్రీకృష్ణ రాయల చరిత్రము మున్నగు అంశము లిందు నాటి వ్యవహార భాష యందు వివరింప బడుట ప్రధానముగ గమనింప దగిన విశేషము. నాటి ఆంధ్ర వ్యవహార భాషా స్వరూపము గ్రహించుట కిది ఎంతయు తోడ్పడినట్లు, ఉర్దూ పారశీక పద ప్రయోగ స్వరూపము కూడ బరిశీలించుటకు సహాయకారిగ నున్నది. ఇతర కావ్యములందు గన్పట్టని విశిష్ట ప్రయోగము లిందుగలవు.''[72] ఆరుద్ర, ''రాయవాచకం ఆనాటి వ్యావహారికంలో వ్రాసిన చక్కని వచన గ్రంథం'' అన్నారు.[72a]

దక్షిణాంధ్ర సాహిత్యాన్ని గూర్చి వ్రాస్తూ నేలటూరు వెంకటరమణయ్య గారు: ''నాయక రాజ్యమందు వ్రాయబడిన వచన రచనలలో రాయవాచకము

ప్రధానమైనది.''[73] ''రాయవాచకము, 16 వ శతాబ్దాంతమున రాయ సామ్రాజ్యమున రాజకార్య వ్యవహారములను నడుపు అధికారవర్గమునందు చెలామణి యందుండిన భాషయందు వ్రాయబడినది. పార్సీ భాష సంపర్కము వలన ఆ భాష నుండి రాజకీయ పారిభాషిక పదము లనేకము లిందు జొచ్చినవి. తత్కారణమున నది సులభగ్రాహ్యము గాక పాఠకులకు క్లేశము గలిగించు చున్నది. అతి దీర్ఘవాక్యములును ప్రాత వచన రచనావిధానమును అచట నచట భావ వైశద్యమునకు బంధకములై వృథా జనకము లగుచున్నవి. కాని మొత్తము మీద నిందలి భాష, పొల్లు మాటలు గాని యనావశ్యక వర్ణనలు గాని లేక, పటుత్వము గలిగి యున్నది.''[74] ఈ రాయవాచకాన్ని, అటు తర్వాత వ్రాయబడిన వచన గ్రంథము ''మధురమంగా పుంశ్చలీ విలాసము'' తో పోలుస్తూ "అన్యదేశ రాజకీయ పరిభాషా పదభూయిష్ఠముగాకున్నను, ఇందలి భాషకును రాయవాచక భాషకును దగ్గరి పోలికలు గలవు. వచనాపద్ధతియు, నన్వయ సౌలభ్యములేని దీర్ఘవాక్యములు రెంటికిని సామాన్యము...''[75] అని వెంకట రమణయ్యగారు చెప్పినారు.

దక్షిణాంధ్ర సాహిత్యాన్ని గూర్చి వ్రాస్తూ, యస్వీ జోగారావుగారు, ''అది (రాయవాచకము) రాయ సామ్రాజ్యమునకు సంబంధించిన చరిత్రాత్మికము నప్పటి (16 వ శతాబ్దాంతము) రాజకీయోద్యోగుల వాడుక భాషతో కట్టుకథలతో నేకరువుపెట్టు గ్రంథము.'' అన్నారు.[76]

రాయవాచక శైలీ విశేషములను కొన్నిటిని వివరిస్తూ, కులశేఖరరావు గారు ఇట్లన్నారు : ''రాయవాచకమున అన్నిటికి మించి ముఖ్యముగా చెప్పవలసినది తత్కర్త యవలంబించిన వచనశైలి. ఇట్టి శైలి యాంధ్రమునందపూర్వమైనది. వ్యావహారికమునకు సన్నిహితమై, కథనాత్మకముగాను, సరళముగాను''న్నది. [76a] వారింకా ఇట్లు వివరించినారు: ''వ్యావహారిక శైలిని యభిమానించిన రాయవాచకకర్త వ్యావహారిక పదజాలమును కూడ నభిమానించి యున్నాడు. తన పరిసరములలో వాడబడు పదములను, రాజకీయ యోగముననున్న పదములను ఈతడు యథేచ్ఛగా గ్రహించి యుపయో

గెంచెను. ఇందు దేశ్య పదములును, అన్యదేశీయములును కలవు. దేశ్య పదములు చాల వరకు యథాతథముగా కాక మార్పు చెందిన రూపములలో నుపయోగింపఁబడినవి. కొన్ని మార్మూల పదములు, నేడు ప్రాచుర్యమున లేనివియు నిందు కలిగినవి. ఇఁక అన్యదేశీయ పదములు కూడ మార్పుతో నున్నవి యధికము. కొన్ని యున్నవి యున్నట్లే లేకపోలేదు.''[76b]

రాయవాచక భాషకు వెంకటరమణయ్యగారి మదింపు సరి అయినది. అది ఈనాడు వాడుకలో లేని, నాడు అధికారవర్గములో, జనసామాన్యములో వాడుకలో ఉన్న కొన్ని దేశ్య అన్యదేశ్య పదాలతో కూడి కొన్ని పట్ల సులభంగా అర్థంగాక, నేటి పాఠకుని తికమక పెట్టుతుంది. కాని నేడు వాడుకలో లేని ఈ మాటల అర్థం తెలుసుకొన్న తర్వాత రాయవాచక రచన, వెంకటరమణయ్యగారు చెప్పినట్లు, పొల్లుమాటలు, అనావశ్యక వర్ణనలు లేని పటిష్ఠమయిన వచన రచన అని స్పష్టమవుతుంది. రాయవాచక భాషకు, రచనకు ప్రత్యేకమైన కొన్ని భాషా విశేషాలను ఈ క్రింద కొంత పరిశీలిస్తాం.

రాయవాచకం లోనిది వ్యావహారిక వచనం అంటూనే, బాలవ్యాకరణ, ప్రౌఢ వ్యాకరణాది గ్రాంథిక భాషా వ్యాకరణాలలోని సూత్రాలను ఉటంకించి, రాయవాచకంలోని ఈ ప్రయోగము ఈ సూత్రానికి విరుద్ధము, ఆ సూత్రానికి విరుద్ధము అని చెప్తూ పోవడం వృథా ప్రయాస. ఎందువల్లనంటే, ఇచట, ప్రతి పుటలో, లాక్షణిక భాషా సూత్రాల ఉల్లంఘనకే లక్ష్యాలు కనపడతాయి. ఉదాహరణకు : ''యకారంబును, వృవూవొవోలును దెలుఁగు మాటలకు మొదట లేవు. సంస్కృత సమంబులందు సహితము వువూవొవో వర్ణాదులగు శబ్దంబులు లేవని యెఱుంగునది'' అని వ్యాకరణ శాసనం. రాయవాచకం ఈ శాసనాన్ని కడవరకు దాని ఉల్లంఘనలో మాత్రమే గౌరవించింది. అయితే ఇట్టి కావ్య భాషా వ్యాకరణ విరుద్ధమయిన శబ్దాలు, పదాలు, ప్రాచీన తాళపత్ర గ్రంథాలలో, శాసనాలలో కొల్లలుగా కనిపిస్తాయి; దక్షిణ దేశీయాంధ్ర కవులు తమ కావ్యాలలో వీనిని విస్తారంగా ప్రయోగించారనే విషయం, ఆ కావ్య భాష విశ్లేషణ మీద జరిగిన పరిశ్రమ మనకు ఎరుకపరుస్తుంది.[77] అసలు నన్నయ భట్టు తెలుఁగువారికి కావ్య భాషను రూపొందించిన కాల మాదిగా, తరువాతి

కవులు తమ కావ్యాలలో స్వతంత్రించి లాక్షణిక విరుద్ధాలైన కొన్ని పద ప్రయోగాలు, శబ్ద ప్రయోగాలు చేయడం, ఆ తరువాతి వారు వాటిని సమర్థించు కొంటూ పోవడం, చరిత్రలో అలవాటయిన విషయమే. నిడుదవోలు వెంకట రావుగారు చెప్పినట్లు, "తెలుగు భాషలో వ్యాకరణములు వ్రాసిన లాక్షణికు లందఱును, నన్నయ భట్టారక సంప్రదాయమును ననుసరించియే వ్రాసిరి. కాబట్టి యట్టి వ్యాకరణముల ననుసరించి, శివ కవుల గ్రంథములఁ బరిశీలించిన నవి వ్యాకరణ విరుద్ధము లగుటయే గన్పట్టును. కాని, కాలక్రమమ్మున కొంద ఱుత్తరాంధ్ర కవులు నట్టి ప్రయోగమ్ములు కావించిరి. అట్టివి ప్రాచీన భాషా లక్షణములకు సరిపోకపోవుటచే, నర్వాచీన లాక్షణికు లిట్టి విరుద్ధ ప్రయోగము లకు గతి కల్పింపవలసివచ్చెను. శివకవుల గ్రంథము లామూలాగ్రముగఁ బరిశీలించిన నర్వాచీన ప్రబంధ కవులు చేసిన ప్రయోగములను నంతకు చాలా కాలమునకు ముందే శివకవులు వానిని లాక్షణికముగా నంగీకరించిరని తెల్ల మగును. ప్రసిద్ధముగా ప్రచురముగా నుండెడి దేశభాషా సంప్రదాయమును తిరస్కరించి, మార్గ సంప్రదాయము ననుసరించుటచేతనే మన భాషా విమర్శన నిట్టి యవ్యవస్థకు సపోహకుఁ బాల్పడినది."[78] అందుచే ఈ క్రింద కావ్య భాషా వ్యాకరణ సూత్రాల్ల ప్రసక్తికి పోక, రాయవాచక భాషలోని ప్రధాన లక్షణా లను క్లుప్తంగా చెప్పడం జరిగింది.[79]

1914 లో ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో అచ్చైన రాయవాచక పాఠం, మూలప్రతిని యదాతథంగా అనుసరించిందని దాని సంపాదకులు తెలిపి నారు. దీనినిబట్టి రాయవాచకంలో వ్రాయసకాని తొందరపాటుకు, ఏమరు పాటుకు సంబంధించిన లేఖన దోషాలు (Scribal erros) ఇంచుమించు లేవనే చెప్పాలి.[80]

రాయవాచకంలో లేఖన సంప్రదాయం (Scriptal Tradition) చాల వరకు, నోటి మాటకు చేతివ్రాతకు పొత్తు కుదిర్చే ప్రయత్నంగా ఏర్పడింది. అంటే శబ్దాల, పదాల వ్రాతలో ఆనాటి ఉచ్చారణను విధేయమైన లేఖనమన్న

మాట. అందుచే పదలేఖనం (Spelling)లో ఈనాడు మనం వ్రాసే పద్ధతికి లేక అచ్చొత్తించే పద్ధతికి భిన్నంగా ఉన్న కొన్ని లక్షణాలను రాయవాచకంలో చూడవచ్చు.

| | లక్షణము | రాయవాచకంలోని రూపం | నేటిరూపం |
|---|---|---|---|
| i | పూర్ణబిందు పూర్వక ద్విత్వహల్లు | శింగ్గిరిభట్లు (6:14)* | శింగిరిభట్లు |
| | | వుంట్టిమి (12:19) | ఉంటిమి |
| | | కూర్చుంణ్డక (12;19) | కూర్చుండక |
| | | కెంప్పుల ఉంగ్గరము (79:9) | కెంపుల ఉంగరము |
| | | గోలకొంణ్డ (65:13) | గోలకొండ |
| | | కొంణ్డయ్య | కొండయ్య |
| | | వెంకట్టేశ్వరుల (77:9) | వెంకటేశ్వరుల |
| | | ముచుకుంద్దస్తుతి (2:10) | ముచికుందస్తుతి |
| ii | ఎడనెడా, పూర్ణబిందు పూర్వక అద్విరుక్తహల్లు | కొంణ్డవీండు (64:3) | కొండవీడు |
| | | సంతోషభరితుండు (3:7) | సంతోష భరితుడు |
| | | పరిశోధకుండు (26:12) | పరిశోధకుడు |
| | | జంగమువాండు (10:20) | జంగమువాడు |
| iii | పూర్ణబిందు పూర్వక అనునాసిక ద్విత్వం | పింమ్మట(2:14,12:10,29:26) | పిమ్మట |
| | | అనింన్ని (72:11) | అనిన్ని |
| | | ఇంన్నోయింటివద్ద (22:10) | ఇన్నోఇంటివద్ద |
| | | స్వామినింన్ని (71:25) | స్వామినిన్ని |
| | | తొంమ్మిది (4:5) | తొమ్మిది |

* బ్రాకెట్లలోని అంకెలు వరుసగా పుటను, పంక్తిని తెలుపును.

| | | | |
|---|---|---|---|
| iv | సంయుక్తాక్షరాల నడుమ ఒక అచ్చును చేర్చి ఉచ్చారణ సులభం చేసుకోవడం<br>Anaptyxis (స్వరభక్తి) | దరిశనం (6:16) | దర్శనం |
| v | పదమధ్య అజ్లోపాన్ని పాటించిన సంయుక్తాక్షర రచన (Syncope : వర్ణలోపము] | కర్ణీకం [31:4] | కరణీకం |
| | | వార్లను [38:4;60:4] | వారలను |
| | | పట్టానకు [28:27] | పట్టణానకు |
| | | శ్ధ [10:9] | శుద్ధ |
| vi | 'అయి,' 'ఐ'ల పరస్పర వినిమయము | పారీణులయి [3:18] | |
| | | పరాయణలై [3:14] | |
| vii | ఉచ్చారణా విధేయంగా 'సింహ' పదాన్ని 'సింహ్మ' అని వ్రాయడం. ఒకటి రెండుచోట్ల 'సింహ్వ' అని కూడా కలదు. | నృసింహ్మ [2:6] రాయలవారు | నృసింహ-రాయలవారు |
| | | నరసింహ్మ [20:12] నాయడు | నరసింహ నాయుడు |
| | | సింహ్మాసనము [11:5] | సింహాసనము |
| | | సింహ్వపు పిల్లలు [60:9] | సింహపు పిల్లలు |
| viii | తాలవ్య హల్లుకు పరంలో 'అ'త్వానికి 'ఏ'త్వం | చెలనం [10:1] | చలనం |
| ix | కొన్నిచోట్ల, ఉచ్చారణను బట్టి, హల్పరమైన 'ఏ' 'అ'లకు 'య' వత్తు | పాళ్యం [3:2?;57:9] | పాలెము ; పాళెము |
| | | యేవ్యాళ [42:8;54:5] | ఏవేళ |
| | | నిమిత్త్యమేమి (56:12) | నిమిత్తమేమి |
| | | నిమిత్యము (19:5) | నిమిత్తము |
| | | పల్యె (2:3) | పల్లె |

| | | | |
|---|---|---|---|
| | | వ్యేళ (56:11) | వేళ |
| | | పెట్యె (53:25) | పెట్టె |
| x | పద మధ్యంలో వ్యస్తంగా అచ్చు. | ఆఇత్తపడి (74:9) | ఆయత్తపడి |
| | | పోఇనట్లాయను (62:3) | పోయినట్లాయను |
| | | అఇతే (7:15) | అయితే |
| | | అఇదు (60:21) | అయిదు |
| | | కోఇంచ్చు (60:18) | కోయించ |
| xi | 'చ' వర్ణానికి 'శ, స'లు | విన్నపముశాయంగా (3:4) | విన్నపంచాయంగా |
| | | ఏమిశేతును (5:14) | ఏమిచేతును |
| | | కార్యము శేశి (58:12) | కార్యము చేశి |
| xii | 'స' వర్ణానికి 'శ' | వలశి | వలసి |
| | | తెలిశి ( ) | తెలసి |
| | | శేశి (58:12) | చేసి |
| | | కొంతశేపు (27:1) | కొంతసేపు |
| | | శేవించి (58:15) | సేవించి |
| | | తీశివచ్చు (36:20) | తీసివచ్చు |
| | | తారశిల్లి (47:14) | తారసిల్లి |
| xiii | రేఫముతో కూడిన సంయుక్తాక్షరానికి వలపల గిలక | తూప్పు౯ (53:16) | తూర్పు |
| | | దుగ్గ౯ం (63·12) | దుర్గం |
| | | కన్నా౯టకం (51:11) | కర్నాటకం |
| xiv | పదాది 'య' కార 'వ' కారాలు | వుచితాసనము (2:29) | ఉచితాసనము |
| | | యిచ్చు (5:11) | ఇచ్చు |
| | | యీశ్వరనాయుడు (20:12) | ఈశ్వరనాయుడు |

యిది (51:27) ఇది
యెండ (60:24) ఎండ

**విభక్తులు :—**

| | | |
|---|---|---|
| xv | ఆమహద్వాచక ప్రథమా విభక్తి ప్రత్యయమైన 'ము' కు బదులు బిందు పూర్వక 'బు' వర్ణము | స్పర్శనంబు(2:13) స్పర్శనము<br>రాజ్యంబు (48:5) రాజ్యము; రాజ్యం<br>యుద్ధంబు (9:3) యుద్ధము, |
| xvi | ప్రథమైక వచన ప్రత్యయం 'ము'కుబదులుపూర్ణానుస్వారం | భారతం (2:9) భారతం/ము<br>భాగవతం భాగవతం/ము<br>రామాయణం రామాయణం/ము<br>దరిశనం (6:16) దర్శనం/ము<br>ఆంధ్రదేశం (3:10) ఆంధ్రదేశం/ము |
| xvii | సముచ్చయముగా వాడబడు 'ను' వర్ణమును ద్విత్వముగా వాడుట నియతము | గంగవతరణమున్ను [2:9] గంగావతరణమును<br>ప్రయోజనమున్ను [19:16] ప్రయోజనమును<br>విశాలాక్షినిన్ని (7:23) విశాలాక్షిని<br>అగ్రహారములకున్ను (3:9,12) అగ్రహారములకును |
| xviii | తృతీయా విభక్తి ప్రత్యయం 'తోడ'కు నియతంగా 'తోడట్టు' | వినయంయముతోడట్టు (3:17) వినయముతోడ<br>కొలిచిన వార్లతోడట్టు (22:21) కొలచినవార్లతోడ<br>పాదములతోడట్టు (20:3) పాదములతోడ |

xix అమహద్వాచక ప్రత్యయం 'ము'కు విభక్తి ప్రత్యయాలు చేరినపుడు 'ము' లోపించి దాని పూర్వ హ్రస్వ 'అ' కారము దీర్ఘమగుట
- ముహూర్తానా (2:6)
- ప్రకారానకు (5:6)
- శరీరానకు (5:11)
- సుఖాన (19:7)
- శ్రీపాదాలు (4:20)
- దుర్గాలు (40:16)

xx సరళాదేశము, గసడదవాదేశము నిత్యము
- ఆబద్ధతికి ఆ పద్ధతికి
- పయనమనిదెలిశి (63(3)
- పరిపాలనంజేసుక (20:10)
- విన్నవింపజేశిన (3:27)
- భిక్షము బెట్టుదురు (5:7)
- నేజెప్పినట్లు (6:17)
- వానలున్ను గురుసును (18:15)
- గొండ్డారణ్యం (62:8) కొండారణ్యం

**ధాతువులు**

xxi వర్తమానకాలిక క్రియారూపాల లోని 'చున్న' రూపానికి నియతంగా వ్యావహారిక రూపమైన 'తావున్న' 'తావున్న' వాడుట.
- నడుపుతావున్నారు (3:1)
- నడుస్తావున్నది (3:2)
- విచ్చేస్తా వున్నారు (4:13)
- పెట్టుతూవున్నారు (5:13)

**వచనము**

xxii 'ఇ' కారాంత నామవాచకాలలో, 'ఇ'త్తునకు బహువచనము చేరినప్పుడు 'ఉత్వా'నికి బదులు పదాంతమందలి 'ఇ'త్వమునకు దీర్ఘము
- విడిది – విడిదీలు (12:10)
- ఫిరంగి-ఫిరంగీలు ( )

xxiii అమహద్బహువచనరూపాలలో వ్యావహారిక భాషకు సన్నిహితమైన సంక్షిప్త రూపాలు
- మాట్లు ( ) మాడలు

| | | |
|---|---|---|
| xxiv | కొన్నిచోట్ల కర్తృవచనానికి వ్యస్తమైన క్రియాపదం వాడుట | సురక్షితముగలవా (2:21)<br>నిత్యోత్సవములుగా ( )<br>నడుస్తావున్నది (3:2)<br>రాచకార్యములు విశేష<br>ముగా లేదు (3:20)<br>ప్రజలును స్వర్గాది<br>భోగములును--కలిగి<br>వుండును (8:21,23)<br>ప్రయోజనములేమి<br>యున్నది ( ) |
| xxv | కొన్నిచోట్ల మహద్మహతీ వాచక బహువచనానికి అమహద్వాచక సర్వనామం | వీణాధరులు ఇవి మొదలగు |

**సంఖ్యావాచకాలు**

| | |
|---|---|
| 70, 71 | డెబ్బది రెండు<br>డెబ్భయి రెండు (2.16)<br>డెబ్బయి రెండు (2:16) |
| 1 | ఒకటి, దాని విశేషణ రూపమైన ఒక, వ్యవహారోచ్చారణ ననుసరించి 'వొఖటి' 'వఖ్కా' 'వఖ' 'వొఖ' అని వ్రాయడం (3:11) (10:20) (18:5) (19:9) (23:9,11) |
| విశేష రూపకమైన సంఖ్యా వాచకానికి తర్వాత సామాన్యంగా వచ్చే సామూహిక వాచకమైన 'మంది' లోపించుట. | ముప్పైనృపతులు (7:22) |

సంధి

xxvi ఏ కాలంలో గాని వాడుక భాషలో వినిపించనట్టి, లాక్షణికులు అంగీకరించని అచ్సంధులు. హల్సంధులు రాయవాచకంలో ప్రతి పుటలో ఉన్నాయి. ఇట్టి లాక్షణిక విరుద్ధ ప్రయోగాలకు ఉదాహరణలు దక్షిణ దేశీయాంధ్ర కవుల కావ్యాలలో చాలా ఉన్నాయి.

xxvii 'యత్నా'నికి నియంతంగా (3:19)
వైకృత పదమైన "జతనం"

xxviii **మిశ్రరూపాలు**

ప్రహరిబడగరములు (8:17)
బీగముద్రలు (22:28; 8:18)
ఏక వదంతి (36:1)
ఏకవాగెగా (77:7)
నిత్యాసారి (49:10)
చేఖండ్డము (67:25)
గొండారణ్యం (52:8) కొండారణ్యం

xxix **కొన్ని నుడికారాలు**

ఇనుమారు ముమ్మారు (23:16.)
లెఖ్ఖ పఖ్ఖలు. (24.7)
నేటి మర్నాటి (24:7)
రేయు పగలు (24:3)
రాత్రిబగళ్ళు (3:23)
మునకలుగా (26:18)
అంకవంకలు (28:8)
విల్లుబెట్టుమేరకు (22:26)

కాలివేగం =

కాలు వేగం (21:6)
క్షణే క్షణే (22:13. 63:25)
కడ్డి కపళ్ళములు (30:26)
కమ్మ కాకితమ్ములు (4:7)

| | |
|---|---|
| దిక్కు తెలియక = | అదిక్కున (6:6) |
| వ్యయం = | వ్రియం (17:22) |
| కూర్చొని ఉంటిమి = | కూర్చుండక వుంటిమి (12:19) |
| | నాలుగారు ఘడియలు (4:10) |
| | వెలపట |
| తిరిగి చూడవలెను = | తొక్కి చూడవలెను (20:18) |
| | విడిదికొంప (23:3) |
| తిరిగి మరలి = | తిరిగి మరిగి (23:3) |
| | కన్న కార్యము, విన్న కార్యము(22:16) |
| | ఆప్రాచలోనలు (23:6) |
| మరునాడు<br>మరుసటినాడు | మరుచునాడు (55:22;24:8;64:5) |
| | కొనమూకలు (64:2) |
| | కోకతాకలు (75:15;76:7) |
| | చీటిపాటిచిక్కుచిల్వానములు (35:15) |
| | చెరాజోరా బట్టి (64:14) |
| | దగదప్పులు (59:15) |
| | ధాన్యదవసములు (59:2) |
| | పయటు బియ్యముపారు (67:9;73:15) |
| | పెదతల పోటు (65:14) |
| బలముతో మించి = | బలమించ్చి (34:14) |
| | భరవసము (38:14) |
| | మునుకలుగా (22:1;26:18;74:5) |
| మున్నెఱుక = | మున్నెరిక (34:15) |
| | మొనకురాదు (34:23) |
| | మోపాది అయిన (29:23) |
| | యాయులు స్థాయులు (67:13) |
| | యేండ్ల పరువళ్లు (66:12) |

రేపు మర్నాట (66:27)
రొక్క రోజనాలు (69:10)
అదరదోలి = వుదరదోలి (58:12)
వెయ్యారులు (56:6)
ప్రయప్రయాసములు (90:23)
ఏకపదంతి (36:1)
నాలుగార్లు

రాయవాచకంలో కనబడే వ్యావహారిక వచన రచన, భాషా సంవిధానం, దానికంటే కొంతముందు లేక వెనుకగా రచించిన వచన రచనలలో కానవస్తుంది. ఇట్టి వ్యావహారిక వచన రచనకు, దక్షిణాంధ్ర భాషలో, మహారాష్ట్రుల పాలన (క్రీ॥శ॥ 18 వ శతాబ్దం) వరకు సామ్యాలు కనబడతాయి. ఉదాహరణకు, రాయవాచకాని కంటే కొంత ముందుగా రచించిన తాళ్ళపాక పెద తిరుమలాచార్యుల భగవద్గీతా వచన భావానువాదంలోని వ్యావహారిక వచన రచన రాయవాచక రచనకు ఎంత దగ్గరగా ఉన్నదో చూడండి. ''యింతవట్టు వారున్నూ, వారైనా నన్ను వారు చంపినాను, వారి నే జంప నిశ్చయింపను; యీ రీతి త్రైలోక్య రాజ్యమున్నూ వచ్చినాను వల్లను; భూమి మాత్రానకు మరేమి వున్నది గనుక ?''

"తనంతనే వచ్చిన లాభాన సంతోషించుకొని, ఉచితమైన కర్మమును చేసేయప్పుడు శీతోష్ణాలను సహించినవాడై, సుఖదుఃఖాలు వస్తేను, తన కర్మలను వచ్చె నింతే అని, పరులతోను మచ్చరము లేనివాడై, కర్మానుష్ఠాన ఫలం సిద్ధించునప్పుడున్నూ, సముడైనవాడై కర్మముచేశీన్ని కట్టుపడరు.''[81]

తంజావూరు నాయక రాజుల పాలన అంతమయిన తర్వాత 17 వ శతాబ్దం చివరలో వ్రాసినదని చెప్ప తగ్గ 'తంజావూరు ఆంధ్ర రాజుల చరిత్ర' లోని వచనం చూడండి :

"ఆదిలో కృష్ణదేవరాయల వారు కటకం మొదలు కన్యాకుమారి దాకా దేశం లోపరచుకొని సుఖ సత్కథా వినోదంతో విజయనగరంలో రాజ్యమేలుతూ

వుండగా, మధురలో చంద్రశేఖర పాండ్యుడున్నూ రాయలవారికి వశవర్తులై రాజ్యం చేస్తూవుండిరి. ఆలో తంజాపూరు వీరశేఖర చోళరాజు బలత్కారంగా మధుర చంద్రశేఖరపాండ్యుణ్ణి జయించి ఆ రాజ్యం యావత్తూ కట్టుకొని యేల సాగెను. చంద్రశేఖర పాండ్యుడు యెత్తువడి విజయనగరం రాయల సముఖానికి వచ్చి జరిగిన వర్తమానం విన్నవించుకుంటూ 'మా దగ్గర కప్పం పుచ్చుకొని మమ్మి ఆజ్ఞలో నడిపించుకొని వస్తూ వున్నారు..........' అప్పుడు రాయల వారు ఆ మాటలు విని ఆగ్రహపడి తమ తోశేఖానా అధికారి అయిన నాగమ నాయని పిలిపించి దక్షిణ రాజ్యం యావత్తూ మీ తోశేఖానాకు అడమానం వున్నది గదా ! యిట్లావుండగా పాండ్య రాజ్యం చోళుడు"..........82 అట్లే, తంజా వూరు మహారాష్ట్రి పాలనలో ఒకతనికి ఒక వేశ్య వ్రాసిన జాబులోని వ్యవహార రచన గమనించండి :

"అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకులయ్ని మహారాజ ఛత్రపతి వారి పాద పద్మములకు పుష్ప గంధక కస్తూరి పన్నీరు పరిమళాదులచాత పూజ చాయ పడినటువంట్టి పాద పద్మములకు; విన్నపములు :— శేవకురాలు వెంకగాట రాఘవులు నిరంతరమునను అనేక సాష్టాంగ్గ దండ్డములు బెట్టి శాయంగ్గల విజ్ఞాపనములు ॥తర్వా॥ సముఖానను శలవు తీస్కుని కటాక్షవీక్షణం చొప్పు నను యిల్లు ప్రవేశించ్చినాము. సముఖమున శలవు తీస్కుని బయలు దేరిన నాట నుంచి దివ్య పదారవిందముల మీద అచంచ్చల ప్రతిభక్తి జ్ఞానమేకాని యితరములేదు. అది అట్లా ఉండ్డగా సముఖమున చేస్నిషువంటి మేలున్ను ఆదరణానుంన్నూ యిది నాకొరం వున్నది పుట్టుకు మరవ వలశ్నిదిలేదు. అది యెట్లాగంట్టై చంద్రుణ్ని చందబాళ్ని కలువలు యేరీత్ను వుండ్డునో అటు వలెనే........."83

రాయవాచకంలోని పదాలు కొన్ని నిఘంటువులలోనికి ఎక్కలేదు. అట్లు నిఘంటువులకెక్కని వానిల్ , నాడు వాడుకలో ఉన్న రాజకీయ పారి భాషిక పదాలున్నాయి; పారసీ భాషా ప్రభావ ఫలితంగా వాడుకలోనికి వచ్చిన అన్యదేశాలు, పారిభాషిక పదాలు ఉన్నాయి. కొన్ని వైరి సమాసాలు, మిశ్ర

సమాసాలు ఉన్నాయి; సందర్భాన్నిబట్టి అర్థం ఊహించవలసిన కొన్ని పదాలు ఉన్నాయి. ఈ రాయవాచకంలోని భాషను భాషావేత్తలు సమగ్రంగా, శాస్త్రీయంగా విశ్లేషించి, పదనిర్ణయం, అర్థనిర్ణయం చేసి, నిఘంటువులలో చేర్చవలసిన అవసరం ఎంతయినా ఉంది. భాషాశాస్త్ర పండితులు ఈ కార్యాన్ని చేపట్టగలరని ఆశిస్తున్నాను. ఇట్టి పదనిర్ణయం, అర్థనిర్ణయం చేయడానికి, ఇందు అనుబంధంగా చేర్చిన 'పద వివరణ'లో నా శక్తి కొలది ప్రయత్నించాను.

## రాయవాచకం - పూర్వముద్రణలు

రాయవాచకానికి లభ్యమైన రెండు తాటాకు ప్రతులను పరిశీలించి, పరిష్కరించి, ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, తృతీయ సంపుటంలో, (1914)లో, దానిని మొదటిసారిగా ముద్రించారు. ఈ ప్రతుల పరిష్కర్త జయంతి రామయ్యపంతులుగారు ఇలా వ్రాశారు : "ఈ గ్రంథము తాటియాకు ప్రతులు రెండు పుదుక్కోటలో దొరకినవి. అందొకటి సంపూర్ణముగను మరి యొకటి యసంపూర్ణముగానున్నవి. రెంటిని బరిశీలించి పాఠము నిర్ణయించుట యైనది. భాష తఱచుగా లక్షణ విరుద్ధమయినను జరిత్రాంశములే ప్రధానము చేసియు దక్షిణదేశమునందానాడు వ్యాపించి యున్న వ్యావహారికాంధ్రభాషా స్వరూపము లోకమునకుందెలియుట మంచిదనియు వాక్యరచనమున్నది ఉన్నట్లే ప్రకటించుచున్నాము. శీఘ్రముగానే యీ గ్రంథము టిప్పణముతో పుస్తక రూపముగ ప్రకటించదలిచినారము". 84 అటు తర్వాత ఈ టిప్పణముతో ప్రచురించడం జరగలేదు కాని, 1933 లో యస్. కె. అయ్యంగార్ ఆంగ్ల 'foreword' తో జయంతి రామయ్యపంతులుగారి ఆంగ్ల Introductionతో ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక 33 వ ప్రచురణగా, పుస్తకరూపంలో ప్రకటించారు. Foreword లో యస్. కృష్ణస్వామయ్యంగార్ రాయ వాచకంలోని ప్రధాన చరిత్రకాంశలలోని గుణదోషాలను స్థాలీపులాకంగాను, Introduction లో జయంతి రామయ్య పంతులుగారు ప్రధాన చారిత్రకాం

శాలను సారస్వతంలో, శాసనాలలో, విదేశీ రచనలలో చెప్పిన విషయాలతో తులనాత్మకంగా సరిచూచి, వానిలోని గుణదోషాలను కొంత విపులంగా తెలిపినారు. 1914 లో, ఆంధ్రసాహిత్య పరిష్పత్రిక మూడవ సంపుటిలో ముద్రించిన పాఠానికిగల పాదసూచికలలో, రెండవ తాటాకు ప్రతినిబట్టి ఉన్న పాఠభేదా, లను ఇచ్చినారు. ఇట్లా ఇచ్చిన పాఠభేదాలనుబట్టి ఈ రెండవ ప్రతి, మొదటి ప్రతిలో ఉన్న వాడుక భాషను సంస్కరించి, దానిని లాక్షణిక భాషకు దగ్గర చేసే ప్రయత్నంగా కనబడుతుంది. అంద్దుండి/అందుండి, కన్నాాటక/కనాన్టక, వాల్లాను/వాలాను, మరింన్ని/మరిన్ని వుంన్నది/వున్నది, బ్రాహ్మాల/బ్రాహ్మణుల, గోపాడి/గోపోజి, యేనూరేశి/యేనూరు, తిప్పమ్మ/తిమ్మప్ప మొదలుగాగల ఈ పాఠబేధాలన్ని పదలేఖనానికి (Spelling), ఎడనెడగల లేఖన దోషాల సవరణకు మాత్రమే పరిమితమై, గ్రంథము యొక్క అర్థస్వరూపానికి ఎట్టి భంగము వాటిల్లని విధంగా ఉన్నవి. ఈ 1914 ముద్రిత ప్రతిలో పాఠకుని సౌలభ్యంకొరకు విషయమునుబట్టి పార్శ్వ శీర్షికలు (Marginal headings) జయంతి రామయ్య పంతులుగారు చేర్చారు; ఇవి మూలములో లేనివి. పుస్తక రూపంలో 1933 లో వెలువడిన పునర్ముద్రణంలో ఈ శీర్షికలు, పుటల మధ్యకు మార్చబడినవి; అంతేగాక, పాఠకుల, పరిశోధకుల సౌలభ్యంకోసం, ప్రతి పుటలోని 22 పంక్తులలోని ప్రతి ఐదు పంక్తులను లెక్కించి, వాని ఎదురుగా 5, 10, 15, 20 సంఖ్యలను రామయ్య పంతులు చూపినారు.

రాయవాచకంపై ప్రచురణలు గాక, దానిలో కొన్ని భాగాలు ఇతరత్ర విస్తారంగా ఉద్ధృతమయినాయి. 1919 లో ప్రచురితమైన Sources of Vijayanagar History లో ఆసూరి రంగస్వామి సరస్వతి శ్రీ కృష్ణదేవరాయల దిగ్విజయాలకు సంబంధించిన గ్రంథాన్ని మాత్రం ఉద్ధృతం చేశాడు. అక్కడక్కడ అతికొద్ది మినహాయింపులతో ఈ గ్రంథం, 1933 రాయవాచక ముద్రణలో, 82 వ పుటనుండి 115 వ పుటవరకు ఉంది. రంగస్వామి సరస్వతి ఈ ఉద్ధృత గ్రంథానికి ముందు, సంగ్రహ ఆంగ్లానువాదాన్ని ఇచ్చాడు. 1946 లో ప్రచురించిన Furthet Sources of Vijayanagar History, Vol. II లో నేలటూరు వెంకటరమణయ్య గారు, రాయ

వాచకం ముద్రిత ప్రతి (1933, ముద్రణ) లోని 116 పుటలలో, దాదాపు **44** పుటలు మినహా మిగిలిన 72 పుటల గ్రంథాన్ని ఉద్ధృతం చేశారు. ఇందులో ఉద్ధృతం కాని పుటలు, 6-10, 75-78, 82-116 Further Sources, 3 వ 'వాల్యూం'లో వెంకటరమణయ్యగారు, ఈ ఉద్ధరించిన గ్రంథానికి ఆంగ్లానువాదం సమకూర్చారు. అంతేగాక, పాదసూచీలలో అన్వయ కాఠిన్య మున్న పదాలకు కొన్నిటికి వివరణ లిచ్చారు. కొన్ని చారిత్రక సందర్భాలను వివరించారు.

Sources of Vijayanagara History (1919) లో ఉద్ధరించిన గ్రంథాన్ని, Further Sources of Vijayanagar History లో ఉద్ధరించిన గ్రంథాన్ని, 1933 లో ప్రచురించిన గ్రంథంతో పోల్చినపుడు పద లేఖనానికి సంబంధించిన కొన్ని పాఠ భేదాలు కానవస్తాయి. వీనిలో కొన్ని సంపాదకులు జేసిన సవరణల ఫలితంగా ఏర్పడినట్లున్నాయి. ఉదాహరణకు : 1933 ముద్రిత ప్రతికి, Sources (1919) లో ఉధృతమైన గ్రంథానికి గల పాఠ భేదాలు; అదే రీతికి/అదే రీతిని; యెడవంక్క వారల/యెడ వంకల వారలనున్ను; దండ్డుయాత్ర/దండుయాత్ర; రామలింగ్గమ నాయనికి/ రామలింగమ నాయనికి; గుత్తి కండ్డికోట/గుత్తి కండికోట మొదలుగా. అట్లే 1933 ముద్రిత పాఠానికి, Further Sources (1946) లోని పాఠానికి మధ్యగల పాఠ భేదాలలో కొన్ని; వున్నది/వున్నవి; అడ్డబడి/అడ్డవడి; సకలు/సకల మావుతులు/మావతులు; పెద్దసాని అక్కప్ప నాయుడు/పెమ్మసాని అక్కప్ప నాయుడు; వేరవులు/మేరవులు; శేయించి/సేయించి; మాటలాడుతు/ఘాట లాడుతూ; బంగ్గారు పీట/బంగారు పీట; బాసిశె/బాసిన; అంతేశి/అంత్తేసి, మొదలుగా, రాయవాచకములో చెప్పిన విషయానికి సంబంధించి, అర్థ గతంగా, ఈ పాఠ భేదాలను పట్టించుకోనవసరం లేదు. కాని, నాటి వ్యవహారిక భాషా స్వరూపాన్ని తెలుసుకోడానికి ఈ పాఠ భేదాలను గమనించక తప్పదు.

1932 లో ప్రకటించిన గిడుగు రామమూర్తిగారి 'గద్య చింతామణి' మొదటి భాగంలో పు. 103-105 లలో, 1914 ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో

ఉన్న రాయవాచక పాఠాన్ని, ప్రారంభం నుండి, విద్యానగర పట్టణ నిర్మాణాన్ని గురించి "పుంభావ సరస్వతి విన్నపం జేసిన వివరము'' అనేంత వరకు ఉధృతం చేశారు.

**ప్రస్తుత ముద్రణ :**

రాయవాచక ప్రస్తుత ముద్రణకు 1933 లో జయంతి రామయ్య పంతులు గారి సంపాదకత్వాన ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక ప్రచురణ సంఖ్య, 33 గా పుస్తక రూపంలో ప్రచురితమయిన రాయవాచకం మూల ప్రతి (Vulgate) గా గ్రహించడ మయింది. ఈ 1933 ప్రచురణ, 1914 లో ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో, జయంతి రామయ్య పంతులు గారు. రాయ వాచకానికి గల రెండు తాళపత్ర ప్రతులను పరిష్కరించి ప్రకటించిన పాఠాన్ని అనుసరించింది; జయంతి రామయ్య గారే చెప్పినట్లు, నాటి వాక్య రచనను యథాతథంగా ప్రతిబింబిస్తుంది.

తాళ పత్ర మూల ప్రతులలోని లేఖనా పద్ధతిని గూర్చి జయంతి రామయ్య గారు 'Punctuation was unknown to the writer' అని చెప్పి, 1914, 1933 ముద్రిత పత్రులలో వారు కొన్ని విరామ సంజ్ఞల (Punctuation marks) చేర్చారు. ప్రస్తుత ముద్రణలో, వారు ఎందువల్లనో విడిచి పెట్టిన, మరికొన్ని విరామ సంజ్ఞలను, అన్వయ సౌలభ్యం కోసం, నేను చేర్చాను. రాయ వాచక కర్త తన కథాకథనాన్ని నాటకీయంగా నడిపించాడు; నవలా రచయితవలె కథాకథనం చేస్తూనే, పాత్రల సంభాషణలను, వారి నోటనే పలికించాడు. అందుచే ఈ విరామ సంజ్ఞల అవసరం ఎంతైనా ఉంది. పోగా 1933 ముద్రణలో అచ్చు పొరపాటని తోచిన నాలుగైదు పదాలను సరి చేశాను. ఈ సవరణలు మినహా, ఈ ముద్రణ ప్రతి 1933 ముద్రణ ప్రతిని యథాతథంగా అనుసరించింది.

## రాయవాచకము - కృష్ణరాయ విజయము

రాయ వాచక రచనానంతరము, నూరేండ్లకు కొంత అటు ఇటుగా, కుమార ధూర్జటి, రాయవాచకంలోని ఇతివృత్తాన్ననుసరించి కృష్ణరాయవిజయ

మనే పద్యకావ్యం రూపొందించినాడని పైన చెప్పాము. వచనంలో చారిత్రక విషయాలకే పరిమితమయిన రాయవాచకాన్ని, పద్య కావ్యంగా మలచడంలో కావ్య ప్రక్రియకు అనుగుణంగా కుమార ధూర్జటి మార్పులను చేర్పులను చేశాడు. రాయవాచకంలోని కొంత విషయాన్ని పరిహరించాడు. రాయవాచకంలో అర్థ సంశయంతో కూడిన కొన్ని పదాల అర్థనిర్ణయం చేయడానికి కృష్ణరాయ విజయం కొంత తోడ్పడుతుంది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి నేను పరిష్కరించి ఇచ్చిన 'కృష్ణరాయ విజయ' పీఠికలో, ఆ కావ్యవైశిష్ట్యంతో పాటు, రాయవాచకాన్ని అనుసరించడంలో కుమార ధూర్జటి చేసిన మార్పులు చేర్పులు, కృష్ణరాయవిజయ రచనాకాలం మొదలైన విషయాలను చర్చించి ఉన్నాను. జిజ్ఞాసువులు చూడగలరు. ఒకే ఇతివృత్తం గల రాయవాచక వచనకావ్యాన్ని, కృష్ణరాయ విజయ పద్యకావ్యాన్ని సాహిత్య జిజ్ఞాసువులు, చరిత్ర పరిశోధకులు తులనాత్మకంగా పరిశీలించవలసి ఉంటుంది.

రాయవాచకాన్ని పరిష్కరించే అవకాశం కల్పించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి, వ్రాతప్రతులను గురించి నా ప్రశ్నలకు ఓపికతో వెంటనే జవాబులిచ్చి సహాయపడిన సాహితీ మిత్రులు, మద్రాసు ఓరియంటల్ మ్యాన్యుస్క్రిప్టు లైబ్రరీ పండితులు తీర్థం శ్రీధరమూర్తి గారికి, వ్యాకరణ విషయమై నాకు గల కొన్ని సంశయాలను తీర్చిన మిత్రుడు, వి. ఆర్. కాలేజి (నెల్లూరు) ఆంధ్రోపన్యాసకులు యం. వేణుగోపాల్ గారికి, నా కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను.

'ప్రమాణ సిద్ధాన్త విరుద్ధమత్ర
యత్కించిదుక్తం మతిమాంద్య దోషాత్।
మాత్సర్యముత్సార్య తదార్యచిత్తాః
ప్రసాదమాధాయ విశోధయన్తు॥'

1 నవంబర్, 1980
నెల్లూరు

సి. వి. రామచంద్రరావు

# సూచికలు

1. వాచికము : సమాచారము. వక్కాణము; వాచకము = వాచ్యార్థమును తెలిపెడు శబ్దము. (శబ్దరత్నాకరము); వాచికం=A message, an oral or verbal communication, News, tidings, intelegence in general; వాచకం=A Reader (Apte)

   వాచక=news, tidings, intelligence (Kittel)

   వాచికము=చెప్పి పంపించిన వర్తమానము, సమాచారము (బ్రౌ.ని) రాయవాచకకర్త వ్యవహారములో ఉన్న "వాచకాన్ని" "వాచిక" మనే అర్థంలో వాడాడు.

2. 80 : 9-14 ఈ గ్రంథంలో. ఇట్లా చూపిన సంఖ్యలలో, కోలన్ (:) కు ముందు సంఖ్య రాయవాచకంలోని పుటను, తరువాతి సంఖ్య లేక సంఖ్యలు, ఆ పుటలోని పంక్తులను తెలుపుతాయి.

3. 2:3-5

4. 68 : 24; 69 : 26

5. 35 : 18-19, 43 : 15; 45 : 4; 49 : 14; 50:25-26; 79 : 13

6. 2 : 3-5

7. చూడు S. Krishna Swamy Ayyangar, Sources, (1919) p 327 ff

8. ప్రభాకర శాస్త్రి వేటూరు, తంజావూరి ఆంధ్ర రాజుల చరిత్ర. పు ౧-౧౫ Further sources (1946), ii p. 32ff

9. Sources; P. iii

10. రాయవాచకము (1933) Foreword పు. 12

11. అదే, Introduction పు. 2

11a. అరుణ కుమారి, ఆం. చా. కా; పు. 165

11b. కులశేఖరరావు ఆం. వచ. వాఙ్మ, పు. 509-510. లు

12. "వీనినే కాక కొటికము విశ్వనాథనాయని స్థానాపతి రచించిన 'రాయ వాచకము' ను కూడ ఇచట స్మరింపవలసియున్నది" –వెంకటరమణయ్య "తెలుగు దేశచరిత్ర-ఆధారములు", వి.స. III, పు. 62

13. Venkataramanayya, Studies, Pp. 453ff., also Further Sources, 1, Pp 239–241.

14. వెంకటరమణయ్య, నేలటూరు, 'మధుర తంజావూరు నాయక రాజుల నాటి ఆంధ్ర వాఙ్మయము' భారతి, 1954, ఫిబ్రవరి, పు. 148

15. అదే, పు. 148

15. కొన్ని ఉపపత్తులను బట్టి కృ. రా. వి. యథార్థానికి 18 వ శతాబ్దం మొదటి దశకంలో వ్రాసినట్టు చెప్పవలసివస్తుంది. కృ. రా. వి. రచనాకాలాన్ని, నేను పరిష్కర్తగా ఆం. ప్ర. సా. ఆకాడమీ వారు ప్రచురించిన, 'కృష్ణరాయ విజయము'లో విపులంగా చర్చించాను.

16. 62:21-26, 63 : 1-4; కవికర్ణ రసాయనము, ii. 64, 65, చూడు క్రింద సూచిక. 61

17. ముకుంద బాహుబలేంద్ర గజపతి 3వ అంకవత్సరం, రౌద్రి, చైత్ర శు. 1 బుధ (క్రీ.శ. 1560 ఏప్రిల్ 10) నాటి తెలుగు శాసనము ఉంది. దీనిని బట్టి ఇతడు క్రీ.శ. 1558-59 లో రాజ్యానికి వచ్చినట్లు తెలుస్తుంది.

18. 10 : 7-12

19. 11 : 3-6

20. Swami Kannu Pillai's Ephemeris

21. అదే

22. "ప్రతాపరుద్ర చరిత్రము" (తణుకు, 1969). దీని రచనా కాలనిర్ణయానికై, చూడు ఖండవల్లి లక్ష్మీరంజనం గారి ఉపోద్ఘాతము పు.1-8లు; ఏకామ్రనాధుడు క్రీ. శ. 1623 ప్రాంత వాడను ఆరుద్రగారి గణింపు (స. ఆం. సా. సం. 9, పు. 77)ను లక్ష్మీరంజనంగారు సరికాదన్నారు. లక్ష్మీరంజనంగారి వాదము సమంజసంగా ఉంది.

23. 45 ; 21-24, 46 : 1-13, 46 : 13-18 ; ప్రతాపరుద్ర చరిత్రము పు. 84-85.

24. A Descriptive Catalogue of Telugu Manuscripts in the Maharaja Sarfoji's Saraswathi Mahal Library, No. 815; "సభాపతి లక్షణము" ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, సం. 13,(1925) సంచిక 1, పు. 69-71లు

25. ఈ విషయానికి సంబంధించి. పైన "రాయవాచకము - ఆంధ్ర వచన వాఙ్మయము" అను శీర్షిక క్రింద కూడా చూడునది.

26. 21 : 9; 21 : 17

27. 49 : 20

28. See sewell, P. 54, n 3.

29. The fort appears to have been built about 1580 by Jagadevaraya who made Chennapatna the capital of the territory, bestowed upon him for his gallant defence of Penugonda''Lewis Rice, vol 2, Bangalore

నిడుదవోలు వెంకటరావు ''మైసూరు చెన్నపట్టణ నిర్మాత ఇమ్మడి జగదేవరాయుడు'' భారతి, 1953 జనవరి, పు. 76-79లు

30. ''In 999/1591 the plans for the construction of the new capital were ready''-Sherwani, P. 14;ibid App.ii "The Bhagmathi Legend'' 'P. 135 ff; Siddiqui, P. 91' 389.
వి. స. iii, పు. 429

నేలటూరు వెంకటరమణయ్యగారు ఈ భాగానగరం క్రీ. శ. 1580 తర్వాత నిర్మించారని ఒకచోట (Studies, P.xxv), ''భాగ్యనగరము క్రీ. శ. 1589 సంవత్సరమున నిర్మింపబడెను'' అని మరియొకచోట (భారతి 1954, పు. 148) చెప్పినారు.

30.a) 44 : 15-25

31. చూడు, నిడుదవోలు వెంకటరావు ''మైసూరు చెన్నపట్టణనిర్మాత ఇమ్మడి జగదేవరాయుడు,'' భారతి 1953, జనవరి, పు. 76-79లు ; దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము (1960), పు. 483 మొ॥ జగదేవరాయని వంశ వృక్షానికై చూడు. T.T D.I. Vol. 2. Table No. 170

32. N. Venkataramanayya, Further sources, i, 314, 316, 319, 323-324; చాగంటి శేషయ్య 'ఆంధ్ర కవి తరంగణి' 11 వ సంపుటము, పు. 67, మొ.

33. Sources, P. 248, చాగంటి శేషయ్య, ఆం.క.త,పు. 73-75, మట్ల వంశ వృక్షానికై చూడు T.T.D.I. VI. 2 Table No. 34

34. Futher Sources I, P. 321 ff, 327, 332, 334.

35. చాగంటి శేషయ్య, ఆం. క. త; సం. 10, పు. 67; Further sources I

36. కురుగంటి సీతారామయ్య, తంజావూరు నాయక చరిత్రము; పు. 76 మొ.

37. చూడు, మధుర నాయక రాజుల వంశవృక్షము-అనుబంధము. 5

38. EC. V. Hn 15 (క్రీ. శ. 1562); EC. V. Hn.6 (క్రీ. శ. 1563); EC. V. Hn. 2 (క్రీ.శ. 1563).

39. EC. VII. Ci. 69 (క్రీ. శ. 1562); మరియొక కర్ణాటక శాసనం EC. IV. Ng 26 (క్రీ. శ. 1563) లో ''అలకమలకె'' జగదేక రాయని కార్యకర్తగా చెప్పబడినాడు.

40. 44:20

41. చూడు అనుబంధము. 5-మధురనాయకరాజుల వంశవృక్షము. Sewell PP. 50-61లో ఇచ్చిన వంశవృక్షంలో, మొదటి విశ్వనాథనాయకుని (నాగమనాయని పుత్రుడు) తర్వాత, మరి ఇద్దరు విశ్వనాథులు పేర్కొనబడినారు. మొదటి విశ్వనాథుని పౌత్రుడయిన విశ్వనాథుడు 1573నుండి 1595 వరకు మొదట విశ్వనాథుని ప్రపౌత్రుడు, రెండవ కృష్ణప్ప

తమ్ముడు అయిన విశ్వనాథుడు 1595 నుండి 1601 వరకు పాలించి నట్లు చెప్పబడింది.

42. రాయవాచకంలోని చారిత్రక విషయములకు సంబంధించిన చర్చ, వెంకట రమణయ్యగారి ఈ క్రింది గ్రంథాలలో సందర్భానుసారంగా చూడవచ్చు.
Studies in the History of Third Dynasty of Vijayanagar, Madras, 1935.

Further Sources of Viiayanagar History, Madras 1946.
'కృష్ణదేవరాయలు', హైదరాబాదు, 1972
'విజయనగర చరిత్ర' భాగములు 1, 2, హైదరాబాదు, 1976

43. Sources, P. II

44. రాయవాచకము, ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణ. 33 (1933)

45. అదే.

45.a. అరుణకుమారి, పు.193

45.b. కులశేఖరరావు ఆం.వ.చ. వా పు. 507-508 లు

46. Studies, P. xxvi

47. కృ. దే. రా, పు. 3

48. 10:7-12

49. 76.25 నుండి 77:17; రాయలు శ్రీముఖ సంవత్సర ఆశ్వీజ శుద్ధ 12న కాళహస్తిలో ఉన్నట్లు రాయవాచకం చెపుతుంది. అందుచే ఒకటి రెండు రోజుల ముందు తిరుపతిలో ఉన్నట్లు ఎంచడమైనది.

50. వెంకటరమణయ్య, విజ. చ., భా 2:, పు. 10 మొ.

51. Report, P. 151 ff

52. తెలికచర్ల వెంకటరత్నం, వచనరచనా పరిణామము, III, పు. 632
వి. స. III పు. 632

52a. "చాళుక్య యుగమందలి శాసనములను పరిశీలించినపుడు వానిలో ఆంధ్ర వచన రచనముకొక మార్గమేర్పడినట్లు స్పష్టమగుచున్నది." కులశేఖర రావు, ఆం. వచ. వా, పు. 73

52b. అదే, పు. 440

53. చూడు నిడుదవోలు వెంకటరావు, ఆంధ్ర వచన వాఙ్మయము

54. పైన సూచిక 22 చూడుము

55. ఆం. వ. వా. కులశేఖరరావు; ఆం. వచ. వా, పు. 433

56. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక 1924, సంపు 13, సంచిక 1. పు 69లో దీని వ్రాత ప్రతిని గూర్చి ఇట్లు తెలిపినారు. "ఈ పుస్తకమును దక్షిణ దేశము నుండి వచ్చినదియే. వేంకట కృష్ణప్ప నాయకుని యహల్యా సంక్రందనములోఁ జివర వ్రాయబడి యున్నది. 7 పత్రములు గలవు. పూర్వ భాగము పూర్ణముగా వ్రాయబడి యున్నది. ఉత్తర భాగము కొంత లేదు. కవి ఎవ్వరో తెలియదు. సభాపతులే కాదు, సకల జనులు నెఱుంగవలసిన ననేక విషయములిందుఁగలవు" చూడు పైన సూచిక. 24

57. ద. ఆం. వా, పు. 310, 311

58. చూడు, ఉపోద్ఘాతము, "కృష్ణరాయ విజయము" (ఆం. ప్ర. సాహిత్య అకాడమీ, హైదరాబాదు 1981)

58.a. చూడు రా. వా, 2 : 6-:12 తంజావూరి ఆంధ్ర రాజుల చరిత్ర పు. 15-16 లు.

59. పైన సూచిక 28 చూచునది.

60. 13:10 నుండి 13:8; చూ., పైన సూచిక 24; కులశేఖరరావు, ఆం. వచ. వాఙ్మ, పు. 644-349 చూచునది.

61. రాయవాచకంలో ఇచ్చిన ఈ పద్య పాఠాలకు, ఇటీవల అచ్చు అయిన ఈ కావ్య ప్రతులలోని పద్య పాఠాలకు, పాఠ భేదాలు ఎక్కువగా ఉన్నాయి. పండితులు గమనింపగలరు. ఉదాహరణకు కవి కర్ణ రసాయనంలోనివి రెండు పద్యాలు. ( II, 64-65 ), రాయవాచకం (62:21-26; 63:1-4) లో ఈ క్రింద పాఠంతో ఉన్నాయి.

క. ధాత్రీశుఁడంత దిగ్జయ
యాత్రా సంరంభ జృంభితాటోపగతిన్
శత్రువుల గుండెలవియఁగ
జైత్ర ప్రస్థాన భేరి సేయించుటయున్.

ఉ. ఘూకంపంబు జనింప రొప్పఁగ మహాంభోరాసు లుప్పొంగఁగా
లోకాలోకము లెల్లఁ బెల్లగిల మూఁల్లోకంబు ఘూర్ణిల్లన
స్తోక వ్యాప్తి నిజాండ గోళ దళనోద్భూత ధ్వనింబోలెన
ర్గాకాలాంబుద గర్జిత ధ్వని సమారంభంబులై మీఱఁగన్.

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ శ్రీ మోచర్ల రామకృష్ణకవి పరిష్కర్తగా 1967 లో అచ్చు వేసిన "కవికర్ణ రసాయనము''లో ఈ పద్యాల పాఠం ఇలా ఉంది :

క. ధాత్రీశుఁడంత దిగ్జయ
యాత్రాసంరంభ జృంభితాటోపహతిన్
శాత్రవుల గుండె లవియఁగ
జైత్ర ప్రస్థాన భేరి జరిపించుటయున్ (II-64)

శా. భూకంపంబుజనింప. రొంపిఁ మహాంభోరాసు లుప్పొంగఁగా,
లోకాలోకము పెల్లగిల్లఁగ. మూఁడుల్లోకంబు ఘూర్ణిల్ల, న

స్తోకవ్యాప్తి నజాండ ఖాండ ఛళనోద్భూత ధ్వనింబోలి, యు
ద్రేకించెన్ విజయ ప్రయాణ హ(హ)త భేరి భూరి భాంకారముల్.
(11-65)

వావిళ్ళ వారి ప్రతి ననుసరించి అకాడమీ ముద్రణ ప్రతిని సిద్ధము చేసినట్లు పరిష్కర్త తెలిపినారు. పండితులు ఇట్లే అన్ని పద్యాల పాఠ భేదాల నరయ గలరు. రాయవాచకములో ఉద్ధృతమయిన పద్యములన్నిటిని, అవి ఏ గ్రంథాల లోనివో గుర్తించుట నాకు సాధ్యము కాలేదు. వీనిలో 69 : 16 నుండి 70 : 4 వరకుగల "ఏవంక జూచిన............పట్టన శోభితంబు" అనే సీసము ఎక్కడదో గుర్తించగలిగితే, కొంత, రాయవాచక కాల నిర్ణయానికి తోడ్పడుతుందనుకొంటాను. ఇది రాయవాచక కర్తే వ్రాసిన పద్యమైనా అయి ఉండవచ్చు.

62. 79 : 19 నుండి 80 : 5 వరకు.

63. ఉదాహరణకు, కుందూరి ఈశ్వరదత్తు, "పారిజాతాపహరణ, మనుచరిత్ర రచనా కాలములు" ఆం.ప., 1930, ప్రమోదూత, పు. 103 మొ॥

64. 61 : 18, 19,25; 80:3

65. 61 : 21-24

65a. 11:20–22

66. 26:5; 26:26

66a. దొణప్ప, ఆ. చా. వ్యా, 214 మొ॥

66b. రాయవాచకంలోని 'కబాయి' (42-3) అనే పదం, దొణప్పగారు బుడతకీచు పదమన్నారు. భా, చ., వ్యా, 263

67. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక 1914, ఆనంద, పు. 11.

68. 'రాయవాచకము' (పరిషత్ప్రకటన. 33), పు. 4

69. అదే; పు. 4

70. Sources of Vijayanagara History, పు. 110

71. ఆం. వ. వా, పు. 46

72. గో. కృ. రా, పు. 68

72a. ఆరుద్ర, స, ఆం. సా. IX. 81

73. భారతి, 1954, ఫిబ్రవరి, పుట. 148.

74. అదే, పు. 149

75. అదే, పు. 150

76. విజ్ఞాన సర్వస్వము, III, పు. 832.

76a. కులశేఖరరావు, ఆం.వచ.వాఙ్మ, పు. 512.

76b. అదే, పు. 516-517.

77. చూడు: రామరాజు బి, "కావ్యభాషా పరిణామం" (క్రీ.శ. 1600-1899) తె.భా.చ., పు 239 మొ॥

78. ద. ఆం. వా, పీఠిక, పు. 121-122లు.

79. ఈ భాషా లక్షణాలను, చెప్పడంలో నాకు జి.యన్. రెడ్డిగారి, బి. రామ రామరాజుగారి భాషావిషయక వ్యాసాలు మార్గదర్శకంగా ఉండినాయి. చూడు. జి.యన్. రెడ్డి (పరిష్కర్త), తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు, శ్రీ భగవద్గీత (తొలి తెలుగు వచన భావానువాదం). పీఠిక; రామరాజు, "కావ్యభాషా పరిణామం (క్రీ. శ. 1600-1899," తె. భా. చ, పు. 239 మొ॥

80. పైన "రాయవాచకం-పూర్వ ముద్రణలు" అనే శీర్షిక క్రింద చూచేది.

81. పెదతిరుమలాచార్యులు తాళ్ళపాక : భగవద్గీత (పరిష్కర్త : జి. యన్. రెడ్డి), తిరుపతి, 1978, పు. 13,81లు.

82. ప్రభాకరశాస్త్రి, వే. తంజాపూరి ఆంధ్రరాజుల చరిత, పు. ౧-౨లు.

83. విశ్వనాథ శర్మ, వేమూరి, "దక్షిణాది తెలుగు-కొన్ని పాత ఉత్తరాలు," ఆం.ప 1964-65, పు. 153.

84. ఆం.సా.ప.ప, 1914, పు. 11.



# రాయవాచకము

కాశీ విశ్వనాథనాయనయ్యవారి స్థానాపతి

# విషయసూచిక

# రాయవాచకము

## అవతారిక

క. విజయనగరవృత్తాంతము
సుజనులచే విన్నయట్టి సూనృతవాక్కుల్
ప్రజలకుఁ దేటపడంగా
సృజియించితిఁ గృష్ణరాయ శేఖరుచరితల్. ౧

క. విజయనగరజనపాలుఁడు
విజయాపురి గోలకొండ వీరులతోడన్
గజపతిని నాజి గెలిచిన
విజయుండౌ కృష్ణరాయవీరునిచరితల్. ౨

క. రాయలకు రాజనీతులు
నాయుఁడు నప్పాజి చెప్పినవి యన్నియుఁ దాఁ
జాయక మనసున నునిచిన
రాయసములు వ్రాయఁ జదువ రసికత గలుగున్. ౩

క. బాలురు చదివిన బుద్ధివి
శాలురు గావలయు శాస్త్రజాలంబులలో
లోలురు నరివధచింతా
శీలురు గావలయు భక్తిశీలత నెపుడున్. ౪

## కథాప్రారంభము

శ్రీమంతు సకలగుణసంపన్ను లయిన మహామేరు సమానధీరు లైన
అఖండితలక్ష్మీప్రసన్ను లయిన శ్రీమన్మహా మండలేశ్వర రాజమాన్య
మహారాజరాజశ్రీ కాశీవిశ్వనాథనాయనయ్యవారి దివ్యశ్రీపాదపద్మములకు
దేవరవారి స్థానాపతి భక్తపరాధీనుండు సద్వినయ భయభక్తులనున్ను
5 శాయంగల విన్నపం.

విద్యానగరమందు వీరనృసింహరాయలవారు బ్రాహ్మీముహూర్తాన
లేచి ఆరాధ్యుల నామావళులున్ను ఆధ్యాత్మ సంకీర్తనలున్ను పాండవ
గీతలు భ్రమరగీతలు గజేంద్రమోక్షం భారతసావిత్రి దధివామన స్తోత్రము
గంగావతరణమున్ను నదీస్తోత్రమున్ను భారతం భాగవతం రామాయణం
10 ముచుకుందస్తుతి అక్రూరస్తుతి భీష్మస్తుతి సంజయునినీతి విదురనీతి

## కర్ణాటకరాజుల దినచర్య

చాణూరనీతి పద్యనీతి ఇది మొదలైనవిన్ని నీతివైరాగ్య శతకం పురాణ
శ్రవణమున్ను రాజనీతు లన్నియు విని దర్పణావలోకానంతరం కన్య
కామణుల కపిలకామధేనువను స్పర్శనంబు జేసి విప్రవరుల దర్శనంబు
జేసిన పిమ్మట దంతధావన ముఖమజ్జన నామతీర్థ మై విభూతి ధరియించి
15 పేరోలగంబై కూర్చుండగాను నూట యెనిమిది తిరుపతులనుంచిన్ని తీర్థ
ప్రసాదములున్ను డబ్బై రెండు దేవస్థలాలనుంచి విభూతి గంధ ప్రసాద
ములున్ను రాగా యెదురుకొని ప్రత్యుద్దానము జేశి అంజలిచే నందుకొని
శిరసావహించి స్థలాంతరాల నుంచిన్ని వచ్చిన అయ్యంగార్లనున్ను
ఆరాధ్యపీఠంవారలనున్ను వుచితాసనములయందు కూర్చుండ నియమించి
అష్ట స్వయం వ్యక్తం శ్రీరంగం శ్రీముష్ణం వెంకటాచలం
20 సాలగ్రామం తోతాద్రినైమిశారణ్యం పుష్కరక్షేత్రం ఇది
మొదలయిన స్థలాలకు సురక్షితము గలవా అని అడిగినందులకు
దేవరవారి ప్రతాపాతిశయమువల్ల ఆయాస్థలాంతరముల వున్న

ముద్రికర్తలు వొఖటికొకటి కొదవలేకుండ నడుపుతావున్నారు
నూటయెనిమిది తిరుపతులున్ను నిత్యోత్సవములుగా నడుస్తావున్నది అని
అయ్యంగార్లున్ను పలుకగా, పృథివ్యాపస్తేజో వాయు రాకాశాత్మకమైన
యేకామ్రినాథ జంబునాథ అరుణాచలేశ్వర కాళహస్తీశ్వర చిదంబరం
మొదలైన దెబ్బై రెండు దేవస్థలాలకున్ను పదునెనిమిది శక్తుల 5
కున్ను నిండు పడితరములుగలిగి నిత్యోత్సవములు గలిగి వున్నదనేటట్టుగా
ఆరాధ్యులు దెలుపంగా, విన్నవాడై చాలాసంతోషభరితుండై వార్లకుపట్టె
లు యిచ్చి ధర్మాసనం ధర్మయ్యను పిలువనంపగా ఆయన వచ్చి నిలిచి
దేవరవారు ఆనతిచ్చిన ప్రికారం ద్రావిడరాజ్యములో గల అగ్రిహార
ములకున్ను ఆంధ్రిదేశం హయనదేశం మొరసునాడు మెల్నాడు 10
కర్ణాటకం ఘట్టంశీమ చేర చోర పాండ్య మగధ మళయాళ ఆదిగా గల
అగ్రిహారములకున్ను అవధి ఆటంకములు లేక నిత్యకర్మానుష్ఠానపరు
లై ఋగ్యజుస్సామాథర్వణ పారీణులయి షట్ఛాస్త్రపారీణు లయి
పంచయజ్ఞ పరాయణులై అతిథి సంతర్పణలు జేసుకొని నిర్విచారు
లై సుఖవసతిగా వున్నారని విన్నపము శాయంగా, రాయల 15
వారు విన సవధరించి దళనాయకుల పిలువ నంపగా వారు వచ్చి
హొడగని నిలిచి వినయముతోడట్టు సింహాసనరాజ్యములో గల గిరిదుర్గ
వనదుర్గ జలదుర్గ స్థలదుర్గముల యందు కావలికట్లు ప్రిహరిబడగరములు
న్ను బీగముద్రలు స్వామివారి ప్రతాపమువల్ల జతనమై వున్నది, సా
మంతరాచకార్యములు విశేషములుగా లేదు అని విన్నపం శాయంగా, 20
ఆవెంబడిగా తలారి జంగమయ్య వచ్చి రాయలవారి సముఖానకు అడ్డబడి
చేతులుకట్టుకొని నిలిచి దళనాయకులతోను విద్యానగరపట్టణములోనున్ను
వెలిపాళ్యములయందు న్ను యాదిహెచ్చరికలు గలిగి రాత్రి పగళ్లు
తలార్లు జతనమై జాగ్రతగా కాస్తావున్నారు; గనక పట్టణములో గల
అష్టాదశవర్ణాదులవారున్ను అత్యంతసంతోషపరులై అతివైభవములతో 25
డట్టు నిత్యకల్యాణములు న్ను పచ్చతోరణములున్ను గల్గివున్నారని
విన్నపం శాయంగా, దళనాయకులు విని రాయలవారికి విన్నపంజేసి

నారు. ఆ పిమ్మట విఠలవిరూపాక్షస్వామి ధ్వజారోహణమై వున్నది
రథోత్సవానకు విజయం శాయవలెను. అని విన్న పంశాయంగా దగ్గరవున్న
దళనాయకులు ఆతీరున్నె రాయలవారు విచ్చేస్తావున్నారు. స్వామి
రథారూఢులైన తోడుతోనె వచ్చి విన్నపం శాయమని అంప్పించి రాయల
నగరి తొమ్మిది సంప్రితులనున్ను పిలువనంపగా కరణాలు వచ్చి పదు
నెనిమిది రేవుల లెఖ్ఖలున్ను వినుపించిన తర్వాత రాయల
వారు దిక్కులనుంచి వచ్చిన కమ్మకాకితములు యేకాంతముగా
వినుపించ్చగా విని ప్రధానులను దళవాయిని రప్పించ్చుక కొంతదడవు
యేకాంతపుకొలువుగా నుండి ఆపిమ్మట నిండు కొలువుకు వచ్చినవారై సకల
సామాజికులను రప్పించుక నాలుగారుఘడియలు పేరోలగంబై కూ
ర్చుండివుండగా నగరిఅల్లుండ్లు కొమాళ్ళు దొరమన్నీలు ప్రభువులు
పాళ్యగార్లు అమరనాయకులు ఆప్తులు, ఆశ్రితులు, విద్వాంసులు.
పురోహితులు, ఆచార్యపురుషులు, జియ్యంగార్లు, యతీశ్వరులు, దైవజ్ఞులు,
భేషజులు, రౌతులు మావుతులు, చేర్వగార్లు, రాజులు, వందివైతాళికులు
పాటకులు, పఠాణీకులు, శాస్త్రజ్ఞులు, నాటకాలంకారులు, విద్యాధికులు,
వీణాధరులు ఇవి మొదలుగాఁ గల దెబ్బై రెండు వినియోగాలవారున్ను
వచ్చి కొలువుండ గా దైవజ్ఞులున్ను లక్షణికులున్ను దళనాయకులతోను
ఆగ తానాగత భూతభవిష్యద్వర్తమానములుగా ప్రసంగం శాయంగా
ఆ వెంబడిని విద్యానగరం పట్టం గ్గావించ్చేటందుకు మునుపు
విద్యారణ్య శ్రీపాదాలు యెందుండిరి వారు ఇప్పటికి రాకారణమేమి వారు
వచ్చి పట్టం గావించినది యెట్లు అని ఆడిగింనదులకు ముల్లం
డ్రడిండిమపుంభావసరస్వతి విద్యారణ్యుల వచనాలున్ను విజ్ఞానేశ్వర
మనువచ నాలున్ను ఆయనకు దెలిశివుండును పుంభావ సరస్వతి విన్న

## విద్యారణ్య ప్రశంస

పంజేశినవివరం; మూకాంబికయందు జ్ఞానేంద్రసరస్వతులు విద్యారణ్యులకు
ఆశ్రమస్వీకార మిచ్చి జ్ఞానోపదేశం జేశి సన్యాసాశ్రమమునకు సంమకాం

చనలోష్టుం డై కామక్రోధములు కట్టిబెట్టి మదమాత్సర్యములు విడిచి
శత్రువుల మిత్రువులుగా జూచి తిట్టినవారల దీవించినవార
లుగాయెంచి భూమియె పర్యంకముగా శయనించి భిక్షాన్నమె అమృతాన్న
మని తృప్తుండై కాషాయవస్త్రములు గట్టి నియతబ్రంహ్మధ్యానవిపుణతను
ఏకాంగుండై మౌనముతోడట్టు గ్రామైకరాత్రముగా చరింప మని ఉపదే 5
శించిన ప్రకారానకు చలింపక సంచరింపంగా పురాతన పుణ్యంవల్ల
యేవూర యేయింటికి పోయిన మృష్టాన్న భిక్షము బెట్టుదురు ఆయన్నము
దెచ్చి గురువు లయిన జ్ఞానేంద్రసరస్వతుల సన్నిధానమున వుంచగాను
వారు జూచి సన్యాసులకు భిక్షాన్నము అర్హమింతేగాని మృష్టాన్నము
యోగ్యము గాదు అట్టిపట్ల రాజయోగ్యమైన అన్నము దేవచ్చునా అని 10
కోపగించుకోంగా విద్యారణ్యులు యీశరీరానకు కావలె నని యిచ్చచేతను
అడిగినవాడనుగాను. యేవూర యేయింటికి పోయినా యీరీతిని భిక్షం
బెట్టుతావున్నారు. యీప్రారబ్ధానకు ఏమిశేతును అని విన్నపంశా
యంగా, జ్ఞానేంద్రులవారు విద్యారణ్యుల పరిశోధించవలశి తమశిష్యులను
వెంబడి పంపగా, వార్లు విద్యారణ్యుల వెంబడిని పోయి అక్కడక్కడ 15
పంచభక్ష్య పరమాన్నముతో డట్టు భిక్షంబెట్టులును గని వచ్చి గురు
వులయిన జ్ఞానేంద్రులతో యీవివరం పలకరించగా వారు యితని
పురాతన పుణ్యఫలము తప్పింపరాదు ప్రారబ్ధం అనుభవించక తీరదు
అని మనస్సున యెంచి అయినా భాగీరథీయాత్రజేశి అందువాసముగావుండి
జీవన్ముక్తుండవగుమని ఆనతిచ్చి అంపంగా అనుజ్ఞాతుండై విద్యారణ్యులు 20
భూప్రదక్షణముగా విరాటపురందాటి వరాటదేశానకు పోంగా ఆదిపర్వతం
సమీపాన వరాహనదీతీరాన అశ్వద్ధ వృక్షమందు ఋగ్యజుస్సామాధర్వణ
పారీణత జేసుక బ్రాహ్మణుండు ఏకదేశాస వానప్రస్థుం డై వుండగాను ఆయ
నను చేరబోయి విద్యారణ్యులు ఆ బ్రాహ్మనిపూర్వోత్తరములున్ను
గోత్రనామాలున్ను అడుగగా ఆ బ్రాహ్మణుండు సత్యవచనుండు గనక 25
తన్నపేరు శింగిరిభట్లుండురు రఘునాయకులు రాజ్యపరిపాలనం జేశే
దిలునా దశాశ్వ మేధ షోడశ. మహాదానములున్ను శాయంగా తులా

పురుషదానానకు యెవ్వరున్ను పూనేవారు లేరు గనక అందువల్లను
యాగఫలితం శేయ మని రఘునాయకులు మాతో పలకరించగా
ఆయనకొరకై తులాపురుష దానానకు ఆచార్యత్వముగా నన్ను నియ
మించిరి గనక వారి చేత ప్రతిగ్రహాలబ్ధం డైన దారభ్యం
5 యీ అశ్వత్థవన మందువాసముగా వుందును తనకు ఆగత అనాగత
భూత భవిష్యద్వర్తమానము లన్నియు దెలుసును అదెట్లంటేను-
మీరు జ్ఞానేంద్రులవారి శిష్యులు మీనామధేయం విద్యారణ్యులు మిమ్ము
భాగీరథీస్నానము జేశి అందువాసముగా వుండి అచ్చటనే జీవన్ముక్తుండ
వగుమని నియమించి అంపినారు గనక మీరు ఆ దిక్కున ఉండతగ్గది
10 లేదు కాశిలో వేదవ్యాసుల దర్శనమున్ను అన్నపూర్ణ విశాలాక్షీ విశ్వేశ్వ
రుల దర్శనమున్ను కలిగి వారి అనుగ్రహమువల్ల తిరుగా పంపానదీ
తీరానకు వచ్చి పెంపుగా ఒక పట్నంగావించి హరి హరుల పేరిట
వార్లను పట్టముగట్టి ఇష్టసంపదలతో డట్టు మోదంబున వుండేటందుకు
శింగిరిభట్లు ఆగతం జెప్పినందులకు, విద్యారణ్యులు శింగిరిభట్లను
15 బ్రహ్మరక్షస్సుగా యెంచి భీతిలేక ప్రత్యుత్తర మియ్యగా దలచి వ్యాసులు
మనదృష్టి గోచరులు గానేరరే వారిదరిశనం యే రీతున గలిగీని అని
అడిగినందులకు వ్యాసులు మీ దృష్టి పదమయ్యేటట్టు జేశేను నేజెప్పినట్టు
నడిపిస్తే రాయనా నాయభీష్ట కార్యములున్ను నెరవేరును, మీకున్ను.
కార్యసాధకములు కలిగీని అని పలకరించె. గనక ఆ తీరున్నే మీ
20 యభీష్టకార్యము లున్ను నెరవేర్చేము అని పలకరించి నందులకు
సింగిరిభట్లు పలికే ప్రకారం అయితే మీకు కరతలామలకముగ
దెలిపేను అని పలుకరించగా విద్యారణ్యులు చాలా సంతోష బడి
వేదవ్యాసుల దర్శనానకు హేతువుపలకరించ మనగా శింగిరిభట్లుపలికే
ప్రకారం-మేము పలకరించే వార్తలు విని కాశికి బోయి మావద్దకి వస్తేను
25 అన్నికార్యములున్ను జెప్పేము మీరు కాశికిబోయిన సమయాన వేదవ్యాసు
లు కావడికుండలతో మధువున్ను భుజాన పుంచుకొని తోలుకుక్కలు యిన్ని
బిల్లలు చెప్పులున్ను వీలిదట్టిన్ని పుభయపార్శ్వములు చతుర్వేదసమావము

తైన నాలుగు శునకములుగూడి రాగా నికృష్టమయిన రూపము
తోడట్టు మధ్యాహ్న కాలమందు గంగాతీరానకువచ్చి కావడి గట్టున
దించ్చి మణికర్ణికలోన స్నానముజేసి గట్టుకు వచ్చి గోదోహనమాత్రం
వెలపట వచ్చి నిలిచి వుందురు గనక అనమయానమీరు సంకోజపడక
అచ్చటికి బోయి వారిపాదములు ఘట్టిగా పట్టుకొని వందనంచేస్తేను పావం 5
టిహీనుని మీవంటియతీశ్వరులు యీరీతున వందనములు శేతురా అని
హీనకులాచారపుమాటలుగా యెన్నివిధములుగ పలకరించగా పాదములు
విడువక బట్టుకొంటే అప్పుడు వారికి దయవచ్చి అనుగ్రహించేరు
అని జెప్పంగా విద్యారణ్యులు విని అందుండి కాశికి బోయి మణికర్ణికా
ఘట్టాన కాచి వుండగా ఆలాగె మధ్యాహ్న కాల మందు శింగిరిభట్లు 10
పలికిన ప్రకారానకు వేషము వేసుకొని వచ్చే వేదవ్యాసుల గనుగొని
సాష్టాంగ నమస్కారములు జేసి రెండు పాదములున్ను కన్నుల
నొత్తుక భక్తియై విలిచిన సన్యాసినిజూచి యీతండు మాస్వరూపం
తెలిశినది యెట్టు అని జ్ఞానదృష్టినిజూచి విద్యారణ్యులతోను మీరు
శింగిరిభట్లు దెలుపగా గదా మాస్వరూపం యెరిగితిరి అఞత్తె 15
మంచిదాయెను శింగిరిభట్లు బహుకాలముగా మాకుస్నేహమైవుండును
ఆయనకునిద్రాఆహారములు లేక అశ్వద్ధవన మందు చాలా అవధిపడుతావు
న్నాడు నిన్నుంచి కర్నాట కాన వఖ నగరం కానున్నది అందు ము
న్నూట అరవై యేండ్లు లక్ష్మీకటాక్షం కలిగివుండును ఆపట్ణం వున్న నాళ్ల
కు ఆ సింహాసనస్థునితోదెలిపి శింగిరిభట్లకు ప్రీతిగా నిత్య కృత్యమున్ను 20
పంచభక్ష్యపరమాన్నముతోడట్టు మృష్టాన్నముగా సహస్రబ్రాహ్మణభో
జనం శేయించ మని ఆనరపతితో పలికి ఆనగరమందు ముప్పైన్నృపతులు
కీర్తి ఖ్యాతులుగల్గి నడవ కారణమున్నది అని పలకరించి కొన్ని
మంత్రరహస్యములున్ను విద్యారణ్యులకు అనుగ్రహించి వేదవ్యాసులు
అదృశ్యులయి పోగాను విద్యారణ్యులు ఆనందభరితుండై భాగీరథిలో 25
స్నానము జేశి కాశీ విశ్వనాథులనున్ను విశాలాక్షినిన్ని దర్శించి గయా
ప్రయాగలున్ను దర్శనస్నానములు జేసి ప్రయాణగతుండై శింగిరిభ

ట్లు వున్న తావునకు వచ్చి తాము కాశికి బోయిన పూర్వోత్తరములున్ను వేదవ్యాసులు ఆనతిచ్చిన వృత్తాంతములున్ను శింగిరిభట్లకు దెలుపంగా శింగిరిభట్లు సంతోషబడి విద్యారణ్యుతోను లక్ష్మీకటాక్షమువల్ల వఖ్కాపురం గావించి అందున రాజుల ప్రతిష్ఠ జేస్తేను ఆపురానకు తా

## విద్యానగరనిర్మాణము

ము వచ్చి ఆయవనీపతులకు మేలొనగూర్చి కీడు పరిహరించుకొంచున్ను వుందున్ను. అచ్చట తనకు ప్రీతిగా నిరంతరమున్ను ఆనగరమందు అవ్వారిగా సత్రములున్ను దివ్యతిరుపతులున్ను పంచభూతాత్మకమైన శివస్థలాలయందున్ను గంగా, యమునా, సరస్వతీ, గోదావరీ, సింధు, నర్మదా, కావేరి, తామ్రపర్ణి మొదలయిన మహానదీ తీరాలనున్ను నిరంతరం అవ్వారిగా రేయిపగలు అన్నదానము జేసేటట్టు కట్టడ శేయ మని మనవిజేసుక విద్యారణ్యులను శింగిరిభట్లతో తాము విద్యానగరానకు వచ్చి అందుండి రాయలవారికి అహర్నిశమున్ను తాము ఆశీర్వాదము జేసుక ఉండవలెను అని పలికి అంపించుకొని విద్యారణ్యులు ఉత్తరదేశాన కాశ్మీరఖండమందు మండలమిశ్రులవద్దను సకలశాస్త్రములున్ను నేర్చి చింతామణీ మంత్రోపదేశముచేత లక్ష్మీదేవిని ప్రార్థనసేయంగా, ఆ ఇందిరాదేవి ప్రత్యక్షమై నీకు కావలసిన వరము అడుగు మని ఆనతియ్యగా విద్యారణ్యులు తన పేరు వొక పట్ణం గావించవలసివున్నది మీరు అక్కడ యెన్నాళ్లు వానముగా వుందురో అన్నాళ్లున్ను ఆపట్ణములోగల ప్రజ అందరున్ను సుఖస్థితిని వుండవలెను, అందు నుంచిన్ని తనపేరు కీర్తిన్ని శాశ్వతముగా నిలుచును; భూలోకమందు ఎవ్వనిపేరయినా యెన్నాళ్లు వెలయతా వున్నదో అన్నాళ్లున్ను ప్రజలకు స్వర్గాది భోగములున్ను ఐశ్వర్యప్రదమున్ను పుత్రపౌత్రాదివృద్ధిన్ని కలిగివుండును గనక తాము గావించే పట్ణమందు మీరు శాశ్వతముగ వుండేటట్టు ఆనతీయవలె నని ప్రార్థన శేయంగా, ఆమహాదేవి మీ మనస్సుప్రకారం వచ్చియుండే మని అనుగ్రహించి, నీవు మమ్ము

వారుగదా మాకు లెస్సగా తెలియజెప్పవలె" నని ఆనతిచ్చినందులకు, అప్పా
జి అయ్యమరసు కొండమరసు బాచరసు మొదలైనవార్లు నలుగురున్ను
"స్వామివారు ఆనతిచ్చినది నీతికార్యమే సరి, సకలనీతులున్ను, విచక్షను
లున్ను, సకలకారన్నిర్వాహకములున్ను, సామర్థ్యములున్ను...మయ్యేది
సామాజికులతో ఆలోచించేది సకలసామ్రాజ్యసాధకమని రాయలదేవునితో 5
రాజనీతులు విన్నపంజేసినది.

## కృష్ణదేవరాయనికి మంత్రులు రాజనీతియుపదేశించుట

"సింహాసనాధిపతి అనంగా విష్ణు అంశ గాని యితరంగాదు. అది
యేలాగంటేను "నరాణాంచ నరాధిప"మని భగవద్వాక్యం ఉన్నది.

§అందుకు నీతిపద్యం.§ 10

క. తరుణుండై నవరత్నా
భరణుండై గంధపుష్పపరిమళయుతుఁడై
నరనాయికపరివృతుఁడై
పరఁగినవాఁడ మరు నిట సభాపతియనఁగన్.

క. శ్రీరమ్యుడు విజయుండును 15
ధీరోదాత్తుండు సుగుణతేజోనిధియై
యూరయ సింహాసనమున
నారూఢుం డగుఁట యెప్పు నానభనడుమన్.

ఇట్లు సింహాసనస్థుండు స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్రదుర్గబలంబు
లను రాజసప్తాంగంబుల దెలిశి ఆందోలికా అంబర ఆభరణ వాహన రాజ 20
సన్మాన ఓర్పార తాంబూలాంబులను ఉచిత సపాంగంబులను రాశియెరుగ
వలయు. సామ భేద దాన దండమాయోపాయ ఉపేక్ష మహేంద్ర జాలం
బులు తెలియవలయు, రాజులకు సప్తవ్యసనంబులు గలవు. అందులకు
నీతిపద్యము.

గీ. వెలఁది, జూదంబు, పానంబు, వేఁట, పలుకు 25
ప్రల్లదంబును, దండంబుఁబరుసఁదనము,

రాయవాచకము

సౌమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేఁత
యనెడు సప్తవ్యసనములఁ జనదు తగుల.

అవి యేవి యెట్లంటేను:- వెలది, స్త్రీవ్యసనము, జూదము, జూద
మాడుట, పానము, సురాపానముచేయుట, వేటవోవుట, పలుకుప్రల్లదము,
5 తిట్టుట, అకారణంగా దండించుట, అనుచితం వెచ్చబెట్టుట, యీయేడు
వ్యసనములున్ను వర్జించవలెను. ఇదిగాక, సుత నిధి దేవగేహ వనతటాక
కృతి బ్రహ్మప్రతిష్ఠ మొదలైనవి సప్తసంతానంబుల బడయుచు, కవి
విద్వాంస పౌరాణిక ఇతిహాస భట్ట పరిహాసక గాయకులను సభా సప్తాంగ
పరివేష్టితుండై అసృక్ మాంస మేదో ధాతు అస్థి మజ్జా శు క్లంబులను
10 సప్తధాతువుల పరిజ్ఞాతుండై, లవణ ఇక్షు సురా సర్పిదధి క్షీరశుద్ధోదకంబు
లను సప్తసాగర పరివేష్ఠితంబైన క్షోణీ చక్రంబు నిర్వక్రంబుగా భుజా
పీఠంబున ఆదరింపుచు జంబూ ప్లక్ష కుశ క్రౌంచ శాక శాల్మలీ పుష్కర
ద్వీపంబులయందు నిజేచ్ఛ కీర్తిప్రభలు వెలుగొందజేయుచు, హిమవంత
మాల్యవంత నిషధ వింధ్య పారియాత్రక గంధమాదన హేమకూటం
15 బులను సప్తకులగిరి ప్రభావంబులు దెలియుచు కశ్యప అత్రి భరద్వాజ
విశ్వామిత్ర గౌతమ జమదగ్ని వసిష్ఠులను సప్తమహా ఋషీశ్వరుల తప
స్సామర్థ్యంబుల కనిపింపుచు, శిరోవేష్టన కర్ణభూషణ గ్రైవేయక
అంబర వాహన గంధ తాంబూలంబులను సప్తత్యాగంబుల నెరింగి, మరి
యు నాస్తిక్యంబు అనృతంబు అప్రసాదంబు అనర్థకంబు క్రోధంబు దీర్ఘ
20 చింత దీర్ఘసూత్రితము యెరుకగలవారల యెరుంగమియు అర్థంబులయం
దు అనాసక్తియు అనర్థకచింత నిశ్చిత కార్యంబులు శాయమియు మంత్రం
బుల రక్షింపమియు శుభంబుల ప్రయోగింపమియు విషయంబుల తగులు
టయు ననంబరగిన పదునాలుగు రాజ దోషంబులు పరిహరించి కనుసృష్టి
పంచత్వంబువలన గోకులంబులు నందనవనంబులు జలస్థల పదస్థల వణి
25 క్రియ దుర్గరక్షణంబుల అర్థంబు లార్జింపుచు, పంగు అంధక మూక
బధిర వికలాంగులు మొదలుగాగల పాంథుల దయతో నరసి రక్షింపుచు

భయాతురు డైన శత్రువుశరణన్న గాచి రక్షింపుచు, అన్వీక్షి...దండనీతి
అనియెడు తర్కవిద్యార్థశాస్త్రంబుల రహస్యంబుల నెరింగి, రథారోహణ
అశ్వారోహణగజారోహణ పద...లాఘవ విచక్షణుండై, దానధర్మ
పరోపకారంబులగు ధర్మత్రయంబులనెరింగి, ప్రభుమంత్ర ఉత్సాహంబు
లను శక్తిత్రియంబులు గలిగి శత్రు మిత్ర ఉదాసీనులను త్రివిధంబుల 5
దారనెరింగి, ఉత్పత్తిస్థితిలయంబులను త్రివిధంబులనెరింగి, ప్రాతర్మ
ధ్యాహ్న సాయంకాలంబులను త్రిసంధ్యానియమస్థుండై ఆహవనీయ
గార్హపత్య దక్షిణాగ్నులను త్రేతాగ్ని హోత్రంబులు సలుపుచు, శైత్య
మాంద్య సౌరభ్యంబులను వాయుమార్గత్రియంబుల నెరింగి, యేలాగను
క్రముక ధవళపత్ర ముక్తాఫల చూర్ణంబులను త్రిగుణాత్మక రూపంబైన 10
తాంబూలంబు లనుభవింపుచు,సత్వరజ స్తమోగుణంబులను త్రిగుణంబుల
నెరింగి, ఉత్తమ మధ్య మాధమములను త్రివిధ నాయకలక్షణంబుల
నెరింగి, ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ పురుషార్థపరుండై, వేద శాస్త్ర
పురాణ ఇతిహాసంబులను చతుష్టయంబుల పరీక్షింపుచు, ఋగ్యజుస్సా
మాధర్వణంబులను చతురాగమంబుల పరీక్షింపుచు, బ్రహ్మచారి గృహస్థ 15
వానప్రస్థ భిక్షుకులను చతురాశ్రమంబుల వారిని దెలిశి రక్షింపుచు, రథ
గజ తురగ పదాతులను చతురంగ బల స్తోముండై, మనోబుద్ధ్యహంకార
చిత్తంబులను చతుర్విధంబులఁ దెలిసి, క్షౌరాభ్యంగన దంతధావననిర్మల
వస్త్రంబులను చతుర్విధగరగరికలుగలిగి వస్త్రాభరణగంధపుష్పంబులను
చతుర్విధ శృంగారవంతుడై, ఉన్మదన మదనమోహన వశీకరణ సంతా 20
పంబులను చతుర్విధమదనమార్గముల నెరింగి, భద్రదంత కూచిమార
పాంచాల విట విదూషక పీఠమర్దన నాగరీకుల వగుదిని హస్తిని చిత్తిని
శంఖిని పద్మిని యను చతుర్విధ జాతి స్త్రీ లక్షణంబుల నెరింగి, బాల్య
యౌవన కౌమారలోలులను చతుర్విధవయఃపరిపాకంబుల నెరింగి జార
చతురిక సంసారిక మాతిక లక్షణంబుల నెరింగి, శబ్ద స్పర్శ రూప రస 25
చంధంబులను పంచమహాభూతంబుల నెరింగి,శ్రోత్రత్వక్ చక్షుఃనాసికా

రాయవాచకము

జిహ్వాలను పంచేంద్రియంబుల వదిలస్థుండై, మిత్రభేద సుహృల్లాభ సంధివిగ్రహ లబ్ధనాశన అసంప్రేక్ష్య కార్యత్వంబుల నెరింగి, ప్రారంభో పాయ పురుష ద్రవ్య సంపత్తి దేశకాల విభాగ వార్తా ప్రతికార్య సంధి యను పంచాంగంబుల నెరింగి నడుపుచు, పృథి వ్యాప స్తేజో వాయు
5 రాకాశంబులను పంచభూతాత్మకుండైన ప్రాణాపాన వ్యానోదాన సమా నంబులను పంచప్రాణస్థానజ్ఞుండై, అరవిందం అశోకం చూతంమల్లి కా నీలోత్పలంబులను పంచబాణములకు లోనుగాక, ఊధుట మీటుట వ్రేయుట రచ్చుపైకం ఆలాపంబులను పంచమహావాద్యంబుల నెరింగి, భక్ష్య భోజ్య లేహ్య చోష్య పానీయంబులను పంచవిధ ఆహారంబుల నెఱింగి,
10 కటుతిక్త లవణ ఆమ్ల మధు కషాయంబులను షడ్రసంబుల ఊణంబుల నడుపుచు, సంధి విగ్రహ యాన ఆసన ద్వైదీభావ సమాశ్రియంబులను రాజషాడ్గుణ్యంబులను యెరింగి, హరిశ్చంద్ర నల పురుకుత్స పురూరవ సగర కార్తవీర్యులను ఆర్గురు చక్రవర్తుల చరిత్రంబులు వినుచు, గయ అంబరీష శశిబిందు అనంగ్గు పృథు నృగు మరుత్త భరత రామ
15 దిలీప శిబి రంతిదేవ యయాతి మాంధాత భగీరథులను పదార్గురు రాజుల కథాశ్రవణ...జైన కాపాలిక బౌద్ధ చార్వాకంబులను షడ్దర్శనంబులను యెరింగి, వేదాంత, వైశేషిక, భాట్ట, ప్రభాకర, పూర్వోత్తరమీమాం సంబులనియెడు షట్చాస్త్రంబుల పరీక్షింపుచు, ధన ధాన్య వస్తు వాహన బంధుజన దాసీదాసాది జనులను గలిగి భోజన వస్త్ర గంధ పుష్ప తాంబూ
20 లంబుల ప్రియ కామినీ సంగగోష్ఠియు పాన్పులను అష్టభోగంబు లనుభ వింపుచు, కులము రూపము విద్యయు ధనము బలము యవ్వనము రాజ్యంకలను అష్టమదంబులను అహంకరించి, కస్తూరి కర్పూరం చాందు జవ్వాజి అగరు పన్నీరు తట్టుపునుగు శ్రీగంధంబులను పరిమళ లేపనుండై, వాగెయు రాగెయు బహుమానంబు కేళయు శస్త్రసాధనంబు
25 వీరాస్త్రంబుల రాకయు అను అష్టావధానంబుల నెరింగి, శృంగార వీర కరుణ అద్భుత హాస్య భయానక బీభత్సరౌద్రావేశుండై, ముక్తాహా

తిరిగి జూడక పొమ్ము మేము నీవెంబడిగా వస్తా వున్నార మని ఆన
తిచ్చి పంపగా, కాశ్మీరదేశానమండి వుజ్జనికి వచ్చి కొల్లాపురమందుండి
కిష్కింధకురాగా, విద్యారణ్యులు తుంగభద్రలో స్నానముజేసి
పంపానదీతీరానకువచ్చి పంపావిరూపాక్షులను సేవించి మతంగపర్వత
మెక్కి పట్టం గావించేందుకు చతురశ్రమమైన భూమిని నాలుగుదిక్కులు 5
చూడగా, ఆ సమీపాన గోవులమందలోనున్న శునకాన్ని పర్వతగుహలో
నున్న కుందేలు తరుమగా విద్యారణ్యులు జూచి ఆశ్చర్యబడి, లోకము
లోను శునకం కుందేటిని తరిమేది గాని కుందేలు శునకాన్ని తరిమేది
యెక్కడ జూడము యీస్థలమహిమయేమో అని ఆదిక్కుల నున్న పిన్న
పెద్దలను పిలువనంపించి అడుగగా వారుచెప్పునది— యీయొక్క స్థల 10
మహాత్మ్యముయెంతబలవంతులుగావున్నాను మతంగమహామునులవారి
శాపమువల్ల దుర్బలుల హింసించ కూడదు అని చెప్పి వున్నారు. పూర్వ
మందు కిష్కింధలో వాలిసుగ్రీవులుండును. వారు తమలోతాము కల
హించుకొని యుద్ధముజేశి ఆయొక్క యుద్ధంబుజేయగల సమయాన మహా
బలవంతుండు గనక సుగ్రీవుండు వాలితో యెదురించి యుద్ధము సేయలేక 15
పారివచ్చి యీ మతంగపర్వతముమీదికి వచ్చి వుండును. వాలి వెంటాడి
రాగా పూర్వమందు వాలిని యీకొండ యెక్కకుండ మతంగమహా ముని
శాపమిచ్చినాడు గనుక ఆ దారభ్యం బలవంతములైన జంతువులైన
మనుష్యులయినా యీదిక్కు బలవంతపు పని శేయబడదు అని చెప్పినారు
అలాగున అది మొదలుగా సుగ్రీవుండు వాలితో యుద్ధము శేయకూడక 20
యీ మతంగ పర్వతానకు వచ్చును. కాబట్టి యీస్థలానకు ఎంతబల
వంతుడు వచ్చినా నిర్వాహకశక్తి లేక పారి పోవును గాని యెదురించి
నిలువ లేదు అవి యేమో యీస్థలానవుండే జంతువు లయినా గాని మనుష్య
లైనా గాని అరిజనులకు అసాధ్య మని జెప్పగా, విద్యారణ్యులు ఆశ్చర్యబ 25
డి, ఇది మునీశ్వరుల మహిమగల తావు అని చాలాయెంచి యీ దిక్కున
పట్టము గావించవలెను అని నిశ్చయించి అశ్వపతి గజపతి నరపతులలో
నరపతియే ఘనము గనుక నరపతిరాజ్యానకు పరోపకారముగ పురం

గావించవలెనని యెన్నటికిన్ని చెలనం లేకుండా వుండేటట్టు మంచి
ముహూర్తాన శంకుస్థాపనం జేశి వాస్తుపురుషుని నిలిపి నగరికి స్థలం
యేర్పఱచి నగరున్ను దేవళమున్ను కోట కొత్తళములున్ను నవద్వారము
లున్ను ఏర్పఱచి వాస్తువులు దీర్చి నిధులు యేర్పాటు శేయవలెననితమతో
5 కూడా విద్యాభ్యాసముచేసిన చతుర్వేద శంకరాబ్ధికుండైన శిష్యుని వెం

## శంకుస్థాపన ముహూర్తము

బడిగా కూర్చుకొని నిశ్చయించి, యప్పుడు శాలివాహన
శకాబ్దములు లెక్క ౧౧౨౭ యేండ్లు వెయ్యింన్నూట యిరువై
యేడేండ్ల మీద వెల్లే ప్రభవనామ సంవత్సరం చైత్ర శుద్ధ పౌర్ణమి స్థిర
10 వారం శుభయోగ శుభకరణములు గూడిన శుభ ముహూర్తమందు
ముహూర్తముజేసి, కృష్ణపక్షం అమావాస్యనాటి రాత్రి నిశిసమయమందు
శంఖుస్థాపనంజేసేటందుకు శాస్త్రజ్ఞులనున్ను మంత్రాధికులనున్ను దైవజ్ఞాల
నున్ను గూర్చుక ఉత్తర దక్షిణాలు యేర్పాటుకు త్రిశంకుధ్రువులనున్ను
చూచి త్రిపురషించి శంఖుస్థాపనముజేసి తూర్పుపడమరలకున్ను త్రిపుర
15 షించి శంఖుక్కులు స్థాపించి వాస్తుపురుషుని షోడశమణువులు
యెత్తు బంగారున శేయించిచేవకంభమున ప్రతిష్ఠించి, ఆ స్తంభము
శిరస్సుపానానకు జలాంతరముగా త్రవ్వి, సుముహూర్తమందు మేము
శంఖనాదము చేసినారము ఆ సమయమందు స్థాపించమనేటట్టుగా శిష్యు
లతో పంకరించి, అంపించి లగ్నముతప్పకుండ నిరీక్షించుకొని వుండగా,
20 ఆసమయమందువొక్కజంగమువాడుభిక్షాటనమునకు వచ్చిశంఖనాదముచేసిన
వినిగురువులవారుశంఖం పూరించినారనేటట్టుగాయెంచివాస్తుపురుషునినిక్షే
పించిరిగనక ఆవెంబడినే ఆగురువులవారున్ను శంఖనాదము చేశినది విని
రెండోతేప శంఖం పూరించినదియేమో అని సందేహించి గురువులవారి
వద్దకి వచ్చి శిష్యులు అడిగినందులకు, లగ్నం తప్పి స్థాపిస్తిరో అని
25 జ్ఞానదృష్టిని జూచి జంగమువాండు శంఖనాదము చేసినట్టుగా దెలిసి
చలనము వచ్చెనని విద్యారణ్యులు జూచి బాలా కస్తిబడి (శిష్యులు)

జేసిన దోషమువల్ల మూడువేలున్ను ఆర్నూరేండ్లకు ఖ్యాతిగలిగి వుండ
వలె నని యత్నము జేశినందుకు మున్నూట అరవై యేండ్లుగా నిలిచెను.
వ్యాసుల వాక్యం తప్పక నిలిచెను అని యెంచి వా స్తుపురుషుని స్థాపించి
నారు గనుక ఆదారభ్యం యీవరకు యిరవై తొమ్మిది నృపతులకు
మున్నూరు యేండ్లాయెను. ఇంక అరువైయేండ్లు పట్టణమున్ను సింహా 5
సనమున్ను నిలిచియుండును.

## కృష్ణరాయల పట్టాభిషేకము

అని విన్నపంజేశి...యీ రాజ్యపట్టం కృష్ణరాయలవారికి కట్ట
వలెనని దళనాయకులతో పలకరించి, నందు ..కృష్ణరాయలవారు తాము
పెద్దలమైతిమి తమ మర్యాదాగా రాజ్యపరిపాలనం జేశేటందులకు పట్టాభి 10
షేకం అధిష్ఠానకర్తలు శేయమని మంచి వేళజూచి ముద్దుటుంగర మిచ్చి
నారు గనక దళనాయకులు అయ్యమరసు కొండమరసు బాచరసు యల్లమ
రసు వీరమరసు అప్పాజి లక్కణదళనాకులు యెల్లనదళనాయకులు అప్పర
పిళ్ళ మన్నారుపిళ్ళ రాయసం రామచంద్రయ్య బొక్కసం భాస్కరయ్య
అవసరం వెంకటయ్య త్రియంబకయ్య లక్ష్మీపతి ప్రధాని తిప్పరుసు దళవా 15
యిలింగరసుసాళువనారా....... కాడు ఆర్వీటిబుక్కరాజు సాళువమేకరాజు
శ్రీపతివారు బూదహల్లీవారు నంద్యాలవారు అవుకువారు... తొరగెంటి
వారు రాచూరి తిమ్మరాజు సంగరాజు వెలుకొంటివారు.......... పెద్దసాని
అక్కప్పనాయుడు కమ్మదొరలు తుళువదొరలు మొదలయినవార లందరు
న్ను, నగరివిద్వాంసులు చతుర్వేది రామాదీక్షితులు అష్టభాషాకవిత కృష్ణావ 20
ధానులు శాబ్దికం పాండిత్యం వెంకటరామశాస్త్రుల్లు సహస్రావధాని ప్రభా
కరశాస్త్రుల్లు జోస్యులు కవీశ్వరులు మరిన్ని గలిగిన పిన్న పెద్దలు
అందరున్ను శాస్త్రోక్తముగ శుభముహూర్తమందలి కృష్ణరాయలవారికి
మంగళస్నానం శేయించి, కళ్యాణ వేదికయందు బంగారుపీఠమున
కూర్చుండనియమించి, దశదానములు షోడశమహాదానములున్ను శేయించి 25

స్వర్ణతుల రజితతుల రత్నతుల మౌక్తికతుల మేషవులు కోటిగోదానాలు
సహస్రకుటుంబ ప్రతిష్ఠలు మొదలైన దానధర్మములు శేయించి చతు
స్సముద్రములనుంచిన్ని బంగారు కలశముల వుదకములు తెప్పించి
మరిన్ని గంగాయమునా సరస్వతీ గోదావరీ నర్మదా సింధు కావేరి
5 తామ్రపర్ణి మొదలయిన మహానదుల వుదకములున్ను తెప్పించి అష్టాదశ
వాద్య ఘోషములున్ను మ్రోయగా, సుముహూర్తమందు బ్రాంహ్మలచేత
మంత్రోక్తముగ అభిషేకము శేయించి, అపింమ్మట కనకాభిషేకం నవ
రత్నాభిషేకం శేయించి చలువల తళ్లొత్తి, పీతాంబరం ధరియించి, చందన
అగరు కస్తూరి తట్టుపునుగు మొదలైన సుగంధాదుల ధరియించి, వారల
10 సందరినిన్ని విడిదీల కంపించి, అపింమ్మట అల్లుండ్లు కొమాళ్ళు బంధు
పరిజనులనున్ను స్నేహితులనున్ను పంక్తిని పెట్టుక ప్రసాపడి, సుగంధ
జలముల హస్తప్రక్షాళనము చేశి, ఆచమనీయ్యము జేశి, గిలుకుపావాలు
మెట్టీ, సంక్షేపరామాయణం చదువుతాను, శతపదాలు నడిచి, రత్నకంబళి
మీద కూర్చుండుకొని, అప్పాజీ మొదలైన వార్లనున్ను దళనాయకుల
15 నున్ను ప్రధానులనున్ను పిలువనంపించి వారలతోను కృష్ణరాయ్లవారు
ఆనతిచ్చినది।

"వీరనృసింహ్మరాయలవారు సింహాసన పరభారకం వహించ్చి
నడిపించ్చిన దారభ్యం యీవరకు అచ్యుతరాయలు - చంద్రమౌళిన్ని
మేమున్ను కూర్చుండక వుంట్టిమి, యిప్పుడు మమ్మున రాజ్యపరభారకం
20 వహించమన్నారు గనక తమకు... సింహాసనస్థులు నడిచేదేరీతు, ప్రజ
లను రక్షించే దేరీతు, పరిజనులకు నడిపించ్చేదేరీతు, ధర్మము ఆర్జించే
దేరీతు, వ్రయించేసే దేరీతు, శత్రువుల జయించ్చే దేరీతు, మిత్రువుల
పోషించే దేరీతు, ఆ ప్రజనులు పాలించ్చే దేరీతు, ఆశ్రితుల కొలిచినవారిని
ఆదరించ్చే దేరీతు, ఆత్మసంరక్షణకు అర్హమైన హెచ్చరిక, అర్థచింత
25 వుపాయం అర్థవ్యయం సకలమున్ను తెలిశే దేరీతు, శాశ్వతమైన కీర్తి
ఖ్యాతులుగలిగే దేరీతు, ఇవి మొదలైన రాజనీతులన్నియు తాముదెలిసిన

మాణిక్య వజ్రవైడూర్య గోమేధిక పుష్యరాగ నీలప్రవాళ మరక-
తంబులను నవరత్న పరిక్షితుండై, పద్మం మహాపద్మం శంఖ మకర
కచ్ఛప ముకుంద కుంద నీలవరయను నిధానంబులను గల్గి, ననయమ
భరతజలను అష్టగణ లక్షణంబుల నెరింగి, స్వరవడి ప్లుతవడి ఉభయ
వడి హ్రృద్యను స్వరవికల్ప ప్రాగ్భవ సంశయ ప్రభు విభాగంబుల కాకు 5
ఆదేశ నిత్య ఆర్య అఖండ వర్గ తక్కటి యొక్కటి సరసలాట వకుళ
లను ఇరవై వళ్ళభేదముల నెరింగి, ఋతు నాయక అభ్యుదయ వన గిరి
రతికేళి జలప్రమాణ రతమధుపాన క్షితిపతి పురసుత మంత్రదూత పరిణ
యాదు లనంబరిగిన అష్టాదశ వర్ణనములును దెలిశి, సంస్కృత
ప్రాకృత శూరసేన మాగధ పైశాచిక చూళిక అపభ్రంశ తెనుగులను 10
అష్టభాషాప్రవీణుండయి, యతిభంగ ఛందోభంగ పునరుక్తి సంశయ
ప్రక్రమ వృధలావర్త నిరూపిత శబ్దవిరోధంబు గ్రామ్యంబులను దశ
విధ అపశబ్దముల జొరనియ్యక, నవరసాలంకారయుండై ఛందోబద్ధమై,
మృదువర్ణన వాక్యంబులు గలిగి, వాక్యం దశ పీఠాభావవైభవంబుల
నెరింగి, లక్షణ లక్ష్యంబుల కావ్య నాటకాలంకారంబుల జెప్పనేర్చిన 15
సుకవుల నరసి రక్షింపుచు, చూచుట చింతించుట వగచుట ఉస్సురనుట
కొనియాడుట సిగ్గు నెరుంగక యుండుట అన్నం బరోచకమగుట
జ్వరము వచ్చుట నాలుక తొట్రుపడుట జీవం తొలగజూచుట అనియెడు
దశావస్థల మర్మముల నెరింగి, వణకుట నొప్పివచ్చుట గరిగరిక
విడుచుట కలహియగుట చింతనొందుట దైన్యము నొందుట దుఃఖి 20
యగుట వోర్పుల వీగలుట వున్నచోట కెలసుట ఆత్మ మరచుట
నిరాహారియగుట క్రాగుట మౌనంబు దాల్చుట అరజీవం తొలగుట
పంచత్వమనంబరిగిన షోడశావస్థల భేదంబులెరింగి, అంగుష్టం అర
కాలు మడిమె మోకాలు జిహ్వా ఉరం నాభి కుక్షి కుచవక్ష గళ అధర
కపోల నేత్ర ఫాల మస్తకంబులను షోడశకలాస్థాన మర్మంబుల దెలిశి, 25
వెలిదంమి కలువ విరిశము మామిడి జాజి పొన్న పొగడ అశోకము
విరువాజి మల్లె మొల్ల గేదంగి వావిలి కలువ సురపొన్న కదళికాపుష్పం

బులను షోడశ బాణంబుల నెరింగి, చిగురు విల్లు చెరుకువిల్లు తీగెవిల్లు పూవిల్లు నాల్గువిధంబుల విండ్లునుదెలియుటయు తేటినారి కురివేలునారి చిగురునారి తీగెనారి యనంబరిగిన నాలుగు విధంబుల నారులను నాలుగు విండ్లును ఎక్కుబెట్టి షోడశ బాణములున్ను షోడశ కళాస్థానంబుల
5 గురిజేశి యేయుమరునకు లోనుగాక, చౌషష్టి విద్యాప్రవీణుల అరశీ రక్షింపుచు, దుష్టజననిగ్రహంబును శిష్టజన పరిపాలనంబును జేయవలయు' ఇంకా రాజనీతులు అనేకములు గలవు అందున కించిత్ విన్నపం జేసితిమి." అని అప్పాజి అయ్యమరసు కొండమరసు బాచరసు మొద లయిన వారు విన్నపం జేశినందులకు, కృష్ణరాయలవారు వార్లంజూచి
10 "మీకు భూత భవిష్యద్వర్తమానములున్ను దూరదృష్టి కార్యములున్ను ఆగత అనాగతములున్ను తెలిసినవారలు గనుక రాజనీతులన్నిన్ని కరతలామలకముగా పలికితిరి. భ్రమరము వాయువుచేత పువ్వులవాసన నెరింగినట్లు భ్రమరకీట న్యాయముగా నన్ను నగరికి ఆదాయమున్ను అయ్యేటందులకు యేరీతు"నని అడిగినందులకు సామాజికులు "ధర్మం
15 తప్పక నడిస్తే నెలమూడు వానలున్ను గురుసును. భూమిన్ని బహువుగా ఫలించును. నగరివారు న్యాయము తప్పక కలిగిన అప్పనం తీస్తేను నగరివారికి అధిక శ్రేయస్సున్ను గలుగును. అందు నుంచి బొక్కస భాండారములకు రొక్క రూసాయిలు బహువుగా వచ్చును," అని రాజనీతి చెప్పినందులకు — పద్యం

20 న్యాయము ప్రజపెక్కువకు ను
పాయము ప్రజకలిమి సిరికుపాయం బగుటన్
న్యాయము భండారము నర
నాయకులకును నంద్రు కీర్తి నారాయణుఁడా.

అని నీతి చదివి వినిపించి సాధువులైన వార్లకున్ను, సాధు జంతువుల
25 కున్ను, బాధజేశేవారిని శిక్షింపక పరాకు జేస్తేను రాజధర్మత్వమున్ను,

ఐశ్వర్యమున్ను, జేశిన పుణ్యమున్ను క్షీణమైపోవు నని సిద్ధాంతం. ఇది గాక ద్వాపరయుగమందు కలియుగాదిని పరీక్షిత్తు మహారాజు రాజ్యాభిషిక్తుండై మీవలెనే ధర్మశాస్త్రములున్ను, కృతయుగమందు నాలుగు పాదములున్ను, త్రేతాయుగమందు మూడు పాదములున్ను, ద్వాపర యుగమందు రెండు పాదములున్ను, కలియుగమందు వొక్క- 5 పాదము కనక ధర్మదేవత ధేన్వాకారమై ధర్మరాజు ధర్మపరిపాలనము శేయంగా యిన్నాళ్ళు సుఖాన వుంటిమి; యిప్పుడు కలి ప్రవేశమాయెను. మూడు పాదాలు అధర్మమున్ను, వొక్క పాదం ధర్మము గనుక కాలు నిలువరాదని వొఖ పాదం నేలమోపలేక దుఃఖాక్రాంతయై యుండగా, పరీక్షిత్తు మహారాజు నగరుశోధనకు ఏకదేశాన బయలుదేరి రాగా ధేను 10 వును గని కాలు నిలువలేక కన్నీరు తోడట్టు చింతింపుతావుండగా జూచి, సాధువులైన వార్లను యెవరు బాధజేశిరో అని రాజు కామధేను వును అడిగినందులకు — "నీవు నన్నడుగ కారణమేమి? నిన్నుండి అయ్యే ప్రయోజనము లేమియున్నది?" అని మందలించినందులకు "మీనిమిత్యముగా అడిగినానింతే గాని వూరకే అడిగినవాడను గాను" 15 అనిపలుకరించగా," మమ్మునుంచి నీకు అయ్యే ప్రయోజనమున్ను శ్రేయస్సును పరామర్శించక వున్నట్టయితే హానికద్దా" యని అడుగగాను, అప్పుడు పరీక్షిత్తు చెప్పిన పద్యం.

క సాధువులగు జంతువులకు
బాధలు కల్పించు ఖలుల భంజింపని రా 20
జాధము నాయుస్స్వర్గ
శ్రీధనములు విడచిపోవు సిద్ధము తల్లీ.

అను నీతి చదివి తాను అర్జున పౌత్రుఁడు, అభిమన్యు పుత్రుండు, పరీక్షిత్తుండనువాడను అభిధానం చెప్పగా అప్పుడు కామధేనువు తాను ధర్మ

దేవతను అని తన నిజ స్వరూపము కనిపించి నీ యాజ్ఞలో సకలమైన
వారున్ను నడుచుకోవలెను. కలి దోషంబు తన్ను బొరయకుండా నీవు
రాజ్యముచేసే దినాలున్ను నాలుగు పాదములతోడట్టు సంచరించేటందుకు
ధర్మం పరిపాలనం శేయవలెను. అని ఆశీర్వాదముజేశి అంతర్ధానము
5 బొందె. గనుక ఆ పరీక్షిత్తు కలి దోషమునకు వుండతగిన స్థలము
లున్ను వుండేటందుకు నియమముజేశి రామరాజ్యమువలెను ప్రజలకు
మృత్యువు వలన తస్కరుల వలన అనావృష్టి దోషమునకు భయము
లేకుండా ధన ధాన్యముల పరిమితముగా కట్టడి శేయించి సమర్థులై శతా
యువు పరిపూర్ణులయి సుఖాన వుండిరి. గనక ఆ రీతివలెను స్వామి
10 వారున్ను ధర్మపరిపాలనం జేసుక రాజ్యం యేలవలెనని తెలిపినారు,
గనక ఆ నీతులంతా అప్పాజీ మొదలయిన వారలచేత లెస్సగా విని
రాయలవారు యీ వరకున్ను యీశ్వర నాయకుడున్ను, నరసింహ్మా
నాయకుడున్ను, వీరనృసింహ్మా రాయలవారు రాజ్యపరిపాలనం గావించి
నారు. గనక యిప్పుడు ఆ రాజ్యములున్ను, దుర్గములున్ను దేశము
15 లున్ను, కోటకొత్తళములున్ను, విష్ణు స్థలములున్ను, పుణ్యభూము
లున్ను, సామంత సరదు రాజ్యములున్ను, జూచిరావలెనని పలకరించి
వందులకు స్వామివారు ఆనతిచ్చిన కార్యం.

ఉచితమేసరి, పెద్దలు ఏలిన రాజ్యములు తొక్కి చూడవలెను.
ఉన్న తావున్నె యున్నట్లయితె యే కార్యమున్ను తెలియదు. అటు
20 గనక రాజ్యములోగల ప్రజలున్ను స్వామివారిని పొగడగనవలెను.
శత్రుజనులకున్ను, సామంతరాజులకున్ను, పరభీకరమగునట్టుగాను

## లోక వార్తలు తెచ్చుటకు వేగర్ల నియమించుట

చతురంగబలములతోడట్టు అష్టదిక్కులున్ను తొక్కిజూచి కీర్తి వెలయ
జేసి రావలెను. అని విన్నపం జేసినారు గనక కృష్ణరాయలవారు
25 ఆనందముబొంది భూవిస్తారమున్ను రాజ్యములున్ను జూడవలెను అవి

నిశ్చయించి మునుకలుగా చారులవలన ఆ యా దేశములున్ను, ఆ యా దిక్కులనుండే దొరలు, మన్నెరికముల నడతలున్ను, వారివారి కలిమి బలములున్ను, గ్రామాదులున్ను, పల్లెలు, పట్టములున్ను, పండిత పామర జనులు ఆడుకొనే వార్తలున్ను, కోటకొత్తళముల యందలి నడవడికెలు తెలిశి నానాటి ప్రవర్తకములున్ను గోప్యముగా వచ్చి పలక 5
రించేటట్టుగా, కాలు వేగం గలిగి బుద్ధివిచక్షణులై బహుభాషాంతర ములు దెలిసి బహురూపములుగానున్ను సంచరించి అంతరంగ వార్త లరశి వచ్చేటట్టుగా విజయాపురం, అహముదానగరం, పెదదకోట, రాజ మహేంద్రం, ఆరంగం, చెన్నపట్టం, శ్రీరంగపట్టం, చదరంగపట్టం, శ్రీరంగం, మధుర, రామేశ్వరం, వుమ్మత్తూరు, శివసముద్రం, పెను 10
కొండ, గోలకొండ, గుర్రంకొండ, మేల్నాడు, మొరసునాడు, ఘట్టం శీమ, అరవరాజ్యం, మళయాళం, కొచ్చి, కొంకణం, కేరళం, విరాట పురం, వరాటదేశం, మగధ దేశం, మత్స్యదేశం, విదర్భదేశం, కాం భోజ నగరం, కాశ్మీరఖండం, ఢిల్లీనగరం, ఇవి మొదలయిన తావుల కున్ను, తులువ హైమ మొదలయిన దక్షిణ రాజ్యములకున్ను, చంద్ర 15
గిరి, గండికోట, కడప, నంద్యాల, బెల్లంకొండ, రాచూరు, ముదు గల్లు, నిడిగల్లు, మైసూరు, మొదలయిన స్థలములకున్ను వేగుర్లున్ను నియమించి అంపించి పట్టణముల సంచరించంగా అహంకరించినారనిన్ని పరులత్రోవ పోయినారని వినినానున్ను వారిని ఆజ్ఞశేయమని కట్టడ చేసినారమని మీరందరున్ను నగరి ఆజ్ఞ మీరక నడచుకొమ్మని ఆనతిచ్చి 20
నారు.

## కృష్ణరాయని నిత్యకృత్య వివరణము

కనుక అవి మొదలు సమస్తమైన వార్లున్ను భయస్థులై పట్టములో నున్న. వీధులయందున్ను, మార్గములయందున్ను యెవరు యెదురు తాకినా యేమని తలంచేవారు లేక సుఖముగా సంసారము జేసే రీతికి నడి పించి రాయలవారు నిత్యకృత్యములున్ను రాత్రి కొలువుతీరిన తర్వాత 25

నగరు శోధనకు విచ్చేశి సకల కార్యములున్ను తెలుసుక, అరుణోదయా
నికి నగరికి వచ్చి కొంతతడవు పవ్వళించి యుదయాననేలేచి దంతధావన,
ముఖమజ్జన, నామ తీర్థపు కొలువుజేసుకొని పెద్దకొలువునకు వచ్చి తాము
రాత్రి నగరు శోధనకు బయలమెరశినవేళ గనుకొన్న కార్యములు విన్న
5 కార్యములన్నియు మనస్సుకు దెచ్చుకొని, తలారి జంగయ్యను జూచి
రాత్రి పట్ణములోని ప్రవర్తమానములేమి అని అడుగగా సకల కార్యము
లున్ను విన్నపం జేసును గనక తాము జూచినందులకును సమరసముగా
వున్నట్టాయన విని వూరకేవుందురు. నడచిన కార్యములలో బలదుర్బల
ములు తెలుపకపోతే యీ పాళ్యాన యిటువంటి వీధిని యీయిాశ్రేణిలో
10 ఇంన్నో యింటివద్ద రాత్రి నడచిన న్యాయములు తెలిసినవాడవుగావు
నిన్ను న నేరములేమి నీవు తలారికం జేసేదిన్ని మేము రాజ్యపరిపాలనం
జేశేదిన్ని లెస్సాయనని ఆగ్రహపడగా తలారి భీతిజెంద తాను రాత్రి
పగలు నిద్రాహారములేక వీధులను మనుష్యుల నుంచుక క్షణేక్షణే నడుచు
వార్తలు పరామర్శించి రమ్మని భద్రపరచి రాయలవారికి యెవ్వరు
15 మరుగుపడ విన్నవించినారో అని పరామర్శించగా రాయలవారు నగరు
శోధనకు వెళ్ళి పరామర్శించగా కన్న కార్యమింతేగాని విన్న కార్యము
గాదు అని యెంచి ఆనారభ్యం పట్ణములో కాపెలికట్ల వారితోను జతన
ముగా కాచి నడచు కార్యములు వచ్చి తెలుపుమని దిట్టపరచి రాయలదేవుని
వారు రాత్రి నగరుశోధనకు వెళ్ళుదురని ఏవ్వరిని అడుగక వీధులలో
20 దుడుకులు రానియ్యక హెచ్చరికతో నుండుమని పలికి తానున్ను తనకు
ఆప్తులయిన వార్లున్ను తన్ను కొలిచిన వార్ల తోడట్టు రాయలదేవుని
వారు కొలువుదీరి నగరిలోపలికి పోయిన క్షణమే హజారమువద్ద కాచి
వుండి నగరు బీగముద్రలయిన రెండు ఘడియలకు రాయలవారు లీలావ
తారముగా బయలుదేరే జాడజూచి కనుపించుకోగా, అంతటంతట
25 హెచ్చరికగా రాగా రాయలదేవుని వారు జూచి తలారి జంగయ్యను
బిలిచి "మేము నిత్యకృత్యమున్ను నగరు శోధనకు బయలుమెరశి
వత్తుము నీవున్ను నీతిగలవారున్ను దూరాన కనుపట్టక రమ్మని" అవ

తిచ్చినారు గనక తలారి జంగయ్య ఆదారభ్యం భయము గలిగి రాయలవారు నగరు శోధనజేశి తిరుగా నగరు ప్రవేశం అయ్యేవరకున్ను వీధివీధుల వెంబడినే తిరిగి మరిగి తన విడిది కొంపకు పోవును. యీ వర్తమానములు అప్పాజిగారు మొదలైన సామాజికులు విన్నవార్లయి వారు వారు ఆలోచనాపరులై తమ తమ యిండ్లలోను రాత్రిపగళ్ళు 5
మాట పలుకులాడుకొనేటప్పుడు యాది హెచ్చరికలు గలిగి ఆప్తాలోచనలు నడుపుతావుందురు. యీరీతిని వుండగా కృష్ణరాయలవారు నిత్యకృత్యమున్ను ప్రాతఃకాలమందు పద్యనీతిచదువమని వింట్టావుందురు. గనుక వకనాడు పద్యనీతి చంద్రయ్య తనకు రాకూడక తన కుమారుని నగరికి అంపగా ఆయన వచ్చి సంజయనీతి, విదురనీతి, చాణుక్యనీతి, భర్తృ 10
హరి నీతిశతకము, ఇవి మొదలయిన నీతి చదివినాడు. గనక వకపద్యమైనా తప్పక చదవగా రాయలవారు సావధానచిత్తులై వినేయెడల పద్య శతకమున వక నీతి పద్యము.

క. బలవర్గము సామంతుల
బలమున కగ్గలముగల నృపాలున కొదవే 15
బలిమె పెఋనృపతి కాజ్ఞా
బలసంపద కెంత దప్పు బద్దె నరేంద్రా.

అని నీతి పద్యము చదువగా రాయలవారు ఆ పద్యము ఇనుమారు ముమ్మారు చదువమని మనస్సునకు తెచ్చుక వకనాడు కొలువులోపలను కరణీకుల పిలువనంపి వారలతోను కర్నాటక సింహాసనమునకు ఎన్ని 20
లక్షల రాజ్యములు ? ఆ రాజ్యములో గిరిదుర్గ, స్థలదుర్గ, వనదుర్గ, జలదుర్గములు యెన్ని ? కోటలు యెన్ని ? నగరములు గ్రామభూములు యెన్ని ? యేయేదుర్గాలకు యెంత నగరి బొక్కసాన వుందె? బొక్కరూపాయలకున్ను, నవరత్న భూషణములకున్ను: స్థాపించివుంచిన నిక్షేపములకున్ను, శీమమణియగార్లమీద చెల్లునిలువకున్ను, నగరికై 25
జీతం, యేనుగ, గుఱ్ఱం, పరిజనాలకున్ను, వివరముగా లెక్కవ్రాసి

తెచ్చి చదువమని తొంమ్మిది సంప్రతులనున్ను పిలుపించి ఆనతిచ్చిరి,
గనక చిన్నభండారం అల్లాలనాథుండు విన్నపం జేశినది. "యీ వర
కున్ను వీర నృసింహరాయలవారు లెఖ్ఖపఖ్ఖలు అడిగి పరామరిశించిన
వారు కారు. ఇప్పుడు స్వామివారు లెఖ్ఖలు పరామరిక జేస్తున్నారు
5 గనక యేయే లెఖ్ఖలు విన్నపం వ్రాయమన్నారో ఆయా లెఖ్ఖలు

## కోశాది వివరణము

శేకరించి వ్రాసి నేట మర్నాటను అన్నియు విన్నపం జేశేమని లెఖ్ఖ
పఖ్ఖలు జాగ్రత్తగా రేయుపగలు వ్రాసి శేకరించి ఆ మరునాడు లెఖ్ఖ
విన్నపం జేశినది. విద్యారణ్యస్వాములవారు యీ పట్టం గాపించే
10 టప్పుడు సింహాసనస్థునికి నిక్షేపించినది తొంబైతొమ్మిది కోట్లు యాబై
యారు లక్షల ద్రవ్యంగాక భూషణములు నాలుగు కోట్లున్ను, నవరత్న
ముల ఆరు కోట్లున్ను, వున్నది. అవిగాక యీ వరకున్ను సింహాస
నస్థులు సింహాసనమున్ను నడుపుకొని శెలవు శిద్దాయాలు పోగా బొక్క
సాన వుంచినది పందొమ్మిది కోట్ల యాబైయారు లక్షలద్రవ్యం.
15 ఇదిగాక కర్ణాటక రాజ్యం పదికోట్లు యెనబైనాలుగు లక్షలున్ను,
దేవాదాయం, బ్రహ్మాదాయం, సర్వమాన్యం, మఠపరములకు అరవై
లక్షలు పోగా నిలిచినది పదికోట్లున్ను, ఇరవైనాలుగు లక్షల రాజ్యాన
జీరాసంజ్ఞోక గుర్రములకు, రోజు గుర్రం వొఖ్ఖటికి నూరేశి ఘెట్ల
లెక్క గుర్రములు వెయ్యింటికి లక్ష ఘట్ల వంతున గుర్రాలు యిరువై
20 నాలుగు వేలింటికి, యిరువైనాలుగు లక్షలున్ను, యేనుగ వఖ్ఖంటికి
రోజు వెయ్యేశిఘెట్ల లెక్క, యేనుగలు నూట యిరువైయింటికి
పంన్రెండు లక్షలకున్ను యేనుగలు వెయ్యిన్నేన్నూరు. బంటు ఒక్కిం
టికి నెలకు ఘట్టీ రెండేశి వరాలలెక్క, బంట్లు వెయ్యింటికి రెండు వేల
వంతున రెండులక్షల బంట్లకు రోజు నాలుగు లక్షలున్ను, యీ లెక్క
25 ప్రకారాన అమరనాయకం, గుర్రాలు యేనుగలున్ను, పంన్రెండు
వేలున్ను, కాల్బలములు రెండు లక్షలున్ను, ఇందుకు రోజుకున్ను

ఆయకం, ఆదవని, చెయ్యేటి దుర్గం, గుత్తి, గండికోట, చంద్రగిరి, గుర్రం కొండ, మద్దూరు, సోమగిరి, త్రిశిరపురం, కున్నత్తూరు, పెను కొండ, ముస్తీదులయిన దుర్గములున్ను, నంద్యాల, శ్రీరంగపట్టం, వుమ్మత్తూరు, దళనాయకుల కోట్లావల్లంకోట, మధుర, పాళ్యం కోట, దిండికల్లు మెదలైన సత్యవేడు, కొట్టికల్లు, డంకినీకోట, నారణవనం 5
మొదలైన వనదుర్గములు దేశములు గల రాజ్యమున్ను యేలుకొని కొలుస్తావున్నారు. లెఖ్ఖ క్రమానికి శీమలు కొని యేనుగు, గుర్ర ములు, బంటు బయదలు, ఆబద్ధతికి కొలువక వున్నారు. గనక చిత్తానకు తే నవధరించేటట్టు వ్రాయవలెను. అని విన్నపం వ్రాయంగా రాయ లవారు కరణాలతోను అమరనాయకానకు నగరికవిలె కావలిప్రకారానకు 10
యేనుగు, గుర్రంబంటు బయదలకు వివరముగా లెఖ్ఖ వ్రాసితెమ్మని ఆనతిచ్చిన తర్వాత నగరికై జీతం, యేనుగు, గుర్రం, రాణువకు లెఖ్ఖ యేమిన్ని చదువలే దని మనస్సున యెంచి అప్పాజి అయ్యామరసు మొద లైన వారిని జూచి ముందర నడిపించతగ్గ కార్యములకు ఆలోచన యేమని ఆడిగినందులకు, అందరున్ను వూరకే వుండగా సాళువ తిమ్మరసు గారు 15
ఆలోచనపరుడై ఏమిన్ని ఏలకరించక స్వామివారు చిత్తానకు సరిపోయి నట్టు నడిపింతామని సంబుద్ధిగా విన్నపంజేశినాడు గనక రాయలవారు తమచిత్తాన సింహాసన పరభారమునకు కర్తల జేసినమాత్రం ఇంత్తే గాని సకల ప్రపంచమున్ను సామాజికులు ముఖాంతరముగానే నడుస్తా వున్నది తమమాట పలుకులు యెవ్వరు వినేరు అధికారతరుణమందు 20
స్వాతంత్ర్యముగా నడిపిస్తే మంత్రభిన్నమై కార్యములు కొనసాగదు. కాబట్టి వాకిటి పిన్నపెద్దలు తమర్థ్యౌ తెలుసుకొని ఒక కార్యం నడిపిస్తే అప్పుడు తమకు స్వతంత్రముగా నడుచును. అనుచు, మనస్సున దూర యోచన యెంచి ఒకనాటి రాత్రి నగరు శోధనకు బయలుదేరినట్టు నగరు వెడలి పట్ణానకు రెండామడదూరాన ఉత్తరపుదిక్కున వొఖ దేవళము 25

## కృష్ణరాయలు పట్టణ శోధనకుంబోవుట

ఉండగా అక్కడికిపోయి నిలిచి నంబివాణ్ని నీళ్ళు తెమ్మని దంతధావన
ముఖమజ్జన నామతీర్థమై స్వామి నివేదనమైన ప్రసాద పణ్యారములు తెప్పి
ంచుక ఆరగించి కూర్చుండగా అంతట పట్టంలో యెప్పటివలెనే సాళువ
తిమ్మరసుగారు నగరికి వచ్చి రాయలవారు పుష్పోదయమైనారో అని వరా
5 మరశించగా అచ్చట కాచియుండే దాదులు హెగ్గడికత్యలు బోస
కత్తెలు అణ్నాగర్లు నిన్న రాత్రి రాయలవారు నగర శోధనకు
పోయినట్టే యింకా రాలేదు అని పలికినారు. గనక వారలతోను యికను
యెవరు వచ్చి అడిగినా గాని రాయలవారు శిరోభారమై ఇంకా పుష్పో
దయం శాయలేదు అని చెప్పేటట్టు నియమించి హజారముఖానకు వచ్చి
10 కూర్చుండి గూఢచారులను అష్టదిక్కుల మాగణములనున్ను పరిశోధించి
యేకాంతముగ వచ్చి పలుకరించమని అంపగా, ఆచారులు యెనిమిది
దిక్కులకున్ను బోయి విచారించిరి గనక వారిలో పరిశోధకుండైన గూఢ
చారుడు వచ్చి సాళువ తిమ్మరుసుగారితో పట్ణానకు రెండామడ దూరానకు
ఉత్తరముగాను పళ్ళికొండరంగనాథస్వామి సన్నిధికి ఏకాంతముగా విచ్చేశి
15 కూచుండుక పట్టణము దిక్కు ముఖము చూస్తావున్నారని రహస్యముగా
పిలువగా అప్పాజీ దొరమన్నీలకు, అమరనాయకుల కందరికిన్ని
రాయలవారు వేటబోవుతావున్నారు మీ స్తోమముల తోడట్టు శీఘ్ర
గతిగా రమ్మని అందరికి చీట్లువ్రాయించి అంపించి తాము మునకలుగా
తరలిబోయినారు గనక పట్టణములోగల రౌతులు, మా వుత్తులు, బంట్లు,
20 పరివారములున్ను, దొరలు మన్నెరికములున్ను అందరున్ను ఆ క్షణమే
కదిలి పోయినారు. అందుకు మునుకలుగా తిమ్మరసయ్యగారు కూడాను
విల్లుబెట్టు మేరకు అందలముదిగ్గి బంటు బయిదలన్ను, యేనుగ గుఱ్ఱము
లనున్ను, బారుదీరివుండేటట్టు కట్టడజేశి మితపరిజనము తోడట్టు కొంత
దూరముబోయి అచ్చట అందరినిన్ని నిలువమని యేకదేశాన తాము
25 వక్కరే కోట వెలపట వొంటిగా పోగా రాయలవారు తిమ్మరసయ్య
వచ్చేదిగని పచ్చడము నిండారుగాగప్పుకొని నిద్రపొయ్యేరీతిగా వుండగా

అప్పాజి రాయలవారి వద్ద చేతులు కట్టుకొని నిలుచుండి వుండగా కొంత
సేపునకు కనుపించుకోక ఆ తర్వాత రాయలవారు నిదుర మేలుగాంచిన
రీతిగా లేచి అప్పాజిని జూచినవారై మీరు యిచ్చటికి యాల వస్తిరి అని
అడుగగా తిమ్మరసయ్య అడ్డిబడివిన్నపంజేశినది-స్వామివారు నిన్నరాత్రి
నగరు శోధనకు బయలుమెరిసినట్టే యిచ్చటికి విచ్చేశిన మార్గము తెలియక 5
యధావత్తుగానే నగరికిపోయి పుష్పోదయమైనారో అని అడుగగ హెగ్గడి

## తిమ్మరుసు రాయలవారిని మందలించుట

కత్తెలున్ను అణ్ణగళులున్ను రాయలవారు నగరు శోధనకు పోయి
నట్టే వచ్చినవారు గారని చెప్పగా మనస్సుకు చాలా విచారమై ఆయా
దిక్కులకు చారుల నంపగా అచ్చట విచ్చేశి వున్నారని చెప్పగా విని యీ
వార్త ప్రకటించరాదు అని మనసున యెంచి రాయలయారు వేట మార్గ 10
ముగా సాగిపోయినారు గనక దొరమన్నీల అందరినిన్ని తమతమ
స్తోమములతోడట్లు శీఘ్రగతిగా సాగి రమ్మని చీట్లు అంపించి వద్దనున్న
వారితోను రాయలవారు వేటమార్గముగా సాగిపొయ్యేటప్పుడు రమ్మని
ఆనతిచ్చి అంపినారు గనక పోవలశివున్నది అని వార్లతో మందలించి
కదలి వస్తిని. స్వామివారు యీ రీతిని రావచ్చునా? యీ వార్తలు 15
లోకులకు తెలిసితేను పట్టమున్ను కోలుపోవును. దునేదారులు విన్నామన్న
అపకీర్తి, గనక యింతటి కార్యము జేశేది అనుచితము. స్వామివారి
చిత్తాన యింత కార్యమెంచి రావచ్చునా అని నీతి మార్గముగా నున్న
భయోత్పాతములుగనున్న తెలిపినందులకు రాయలవారు, "సింహాసన
పరభారకం వహించే మీ వంటి పెద్దలువుండగా అట్టి కార్యములు యాల 20
వచ్చీని మీరు తృణాన్ని బట్టితే మేరువు శాయగలరు. ఆ మేరువునే
తృణముగా నడిపించగలరు. ఆ ఘటనఘటనా సామర్ధ్యములు మీకే
గలవు", అని వ్యంగ్యోక్తులుగా ఆనతిచ్చినందులకు సాళువతిమ్మరసయ్య
పలికినది, "ఆరీతే అవును. అవి యేమియంటేను స్వామివారు సకల
కార్య భారములున్న మామీద పూనికె జేసి నడిపించంగా ఆరీతున 25

నడుస్తా వున్నది. చిత్తానకు రాకుంటే మేమనగా తృణమాత్రం. తృణ
గ్రాహి యయిన యింద్రనీలము ఖ్యాతిబొందును. తృణమని యెంచి
గ్రహించక వున్నట్టాయెనా జాతి నీలము గాదని వెల తరుగును. అటు
గనక యేలిన స్వామివారి ప్రతాపమువల్ల నేగదా కొలిచినవారు ఘనమౌట
5 కొలిచినవార్లను ఘనముగా నడపగానే యేలినవారికి కీర్తి ఖ్యాతులు
గలుగుట," అని ద్వంద్వార్థముగా విన్నపముచేశి పట్టానకు విచ్చేయుడా
అని తెలిపినందులకు రాయలవారు తన ధొరతన మేమి అనంగా యేండి
తన అంక్కవంక్కలకు యెవర్లు వచ్చేరు, రాని వారిని మేము యేమి
జెప్పేము, దండించనర్హులముగాము దండనాయకత్వం లేనివారికి ధరణి
10 యేలేదెట్లు, ధర్మపరిపాలనం చేసేదేరీతు, దుష్టనిగ్రహం శిష్టపరిపాల
నం శేయవలెనని చెప్పి తిరుగా అందుకు ప్రతిచింత కట్టివచ్చేము లేనప్ప
టికి రాకూడదని నాలుగారు ఘడియలు ఆలోచనశేయగా, సాళువ తిమ్మర
సయ్యా స్వామివారు ఆనతిచ్చిన యంతమట్టున్ను యథార్థమున్ను కార్య
పరవిన్ని అవును. అందులకు యిది బుద్ధియని ఆనతిచ్చినట్టయితే స్వామి
15 వారి ప్రతాపమువల్ల అన్ని కార్యములున్ను అమరిక అయ్యీని. అని
తెలిపినందులకు రాయల దేవుని వారు తంపున స్వతంత్రులు తెచ్చిరిగా
ఆ రీతున్నే నడిపించుడా అని ఆనతిచ్చి యిన్నాళ్ళున్ను నీతిపద్యము
విందుము పళనాటియంద్దున విశేషమైన బుద్ధిమార్గములుగా పళ నీతి
పద్యము వింటిమి గనుక అది మొదలుగా ఆ రీతున నడిపించుకోవలెనని
20 బుద్ధిబొడమి సామంత బలముకన్నా అధికమైన బలాల సంతరించి
తురకలమట్టుబెట్టవలెననియెంచినారము. యింద్దుకు యేమంట్టేకై జీతము
శేక యే కార్యములున్ను కొనసాగదు గనక యిప్పుడు కై జీతము,
యేనుగు, గుర్రము, బంటు, బయదలు సహితముగా గట్టి ఆముస్తీదు
లోడట్టు పట్ణప్రవేశం గావలెనని ఆనతిచ్చినారు, గనుక సాళువ తిమ్మర
25 సయ్యా యీ కార్యానకు స్వామివారు యీరీతునరావచ్చునా యీ క్షణాన్నె
దేవర వారి చిత్తానకు వచ్చేటట్టు యేనుగు గుర్రాలు బంట్లునందరినిన్ని
సంతరించేను. మరి వెనుకను చతురంగ బలములతోడట్టు పట్ణానకు

విజయం శేయండా అని విన్నపం జేశినందులకు యీ క్షణాన్నె నగరికి యేనుగ గుఱ్ఱము బంటు సహితముగా అమరికజేసేను, అని విన్నపము జేశి తోడుతోనే దొరమన్నెవార్లను అమరనాయకంవార్లను రవుతు రాఋవును డెభ్భై రెండు వినియోగాల వారున్ను కొలువునకు రమ్మని కందాచారం కరణాలపిలిపించి వారితోను సింహాసనాన అమరనాయకం యేనుగులెన్ని, గుఱ్ఱాలెన్ని, కాల్బలమెంత అని అడిగినందులకు గణికులు పలుకరించిన వివరం.

## రాయల సేన వివరణము

గుఱ్ఱాలు యిరువై నాలుగు వేలు, యేనుగ ఘట్టాలు నూటయిరువై, కాల్బలము రెండు లక్షలు. ఇందులకుస్థితి నెలవొఖంటికి నలభై లక్షలు వంతున సంవత్సరానికి నాలుగుకోట్లు యెనభై లక్షలకు అమరనాయకానకు శీమలు ఏలుచున్నారు. అని గణికులు విన్నపంచేశినందులకు వారలతోను రాయలవారు అమరం యేనుగు గుఱ్ఱాలకున్ను, బంట్లకున్ను, నేడు నాలుగారు ఘడియలలోగా గణుతిబెట్టి గణుతికి లేనియేనుగు, గుఱ్ఱాలు, కాల్బలమునకున్ను వీరనరసింహ్మారాయలవారు యేలుకొన్నదారభ్యం యీ వరకున్ను పది సంవత్సరాలాయెను గనక వారివారిమీది రొక్క నిలువలు లెఖ్కజూచి తోడుతోనె నిలువదూకలు హరువుశాయమని నిరుత్తరువుగా ఆనతిచ్చిరి గనక అదే రీతికి కరణాలు వెలపటికి వచ్చి గుఱ్ఱం రాఋవ, గణుతిపెట్టంగా వఖటికి సగమున్ను నాలుగింటికి వఖ పాలున్ను గణుతికి తక్కువబడె గనక అమరగార్లమీది నిలువ రొఖ్కమునకు ఆక్షణమందేవొప్పుజెప్పమనగా వార్లుబహుదినాలనుంచిన్ని ప్రఖ్యాతిగా తిన్నవారు కాబట్టి తమమీది నేరం తప్పిపోతే చాలునని తమ మీది మోపాది అయిన రొక్కానకు యియ్యవెరవు లేదుగనక శీమల యెప్పటివలెనే నడిపితేను యిప్పుడు వుండే యేనుగ గుఱ్ఱాలను నగరికి నెలకట్టి యిచ్చి ఆపింమ్మాట తాము సంతరించుకొనేము, అని విన్నపం శేయగా మంచిదే యని అమరగార్లమీది నిలువలకు యేనుగ గుఱ్ఱాలను

వెలకట్టుకోగా యేనుగలున్ను పంౘ్రెండు వేల గుఱ్ఱాలున్ను లక్షబంట్లు
యేలే దొరలనున్ను నగరిశరబడి ఆయనుగనక ఆయేనుగ, గుఱ్ఱాలు,
కాల్బలము రాయలవారి సముఖానకు తెచ్చివిడిచి చిత్తం వచ్చిన వారికి
వెచ్చపెట్టండా యని విన్నపం శేయంగా రాయలవారు ఆశ్చర్యబడి
5 అప్పాజిగారితో అఘటనఘటనాసామర్థ్యము మీకె కలదు అని ఉచిత
సప్తాంగము, కుళ్లాయి, కబాయ, తాళి, చౌకట్లు, పీతాంబరం, గంధ
కస్తూరి తాంబూలాదిగాయిచ్చి కైజీతం యేనుగలకు తుళువమావటీలున్ను,
కైజీతం గుఱ్ఱాలకు కబ్బిలిరౌతులున్ను, మొరస రౌతులునన్ను,
తుళువర్ తునున్ను యేలికబంట్లను వ్రాయించి ఆ పిమ్మటను రాయలవారు
10 బంగారు చౌదోలుముస్తీపు అయిన మాస్తి మదహస్తియనే యేనుగను
ఎక్కుకొని సాళువతిమ్మరసయ్యను తమవెనుకనుకూర్చుండమనిచతురంగ
బలముతోడట్టు విద్యానగరపట్ణం ప్రవేశమై తర్వాత అప్పాజి తిమ్మరసు
మొదలైన వార్లను యిండ్లకుపంపించి తమ ఆప్తులతోను అప్పాజి సాళువ
తిమ్మరసయ్యలవలె నియ్యోగులుకద్దా అటువంటి నియ్యోగులు వుండగా
15 వళనాటనే కైజీతం కట్టవలెనని న్ని, లేకుంటే పట్ణానకు రామనిన్ని
దుష్కరవచనంగా పలకరించినందుకు తాలిమి గలిగి ఆ తీరున్నె అమ
రిక జేశేను, అని యేనూరుయేనుగలున్ను, పంౘ్రెండువేల గుఱ్ఱాలున్ను,
లక్ష మనిషి బంట్లనున్ను, నిమిషమాత్రాన సముఖానకు రప్పించి చిత్తం
వచ్చిన వారికి శెలవు శాయమనగా, చూచి ఆశ్చర్యబడి ముందర తుర
20 కాణ్యం మెద కార్యం శేశేవారమై కర్నాటక రౌతుల మావుతుల సంత
రించవలెనని దృష్టిచేత కబ్బలిరౌతులకున్ను, తుళువరౌతులకున్ను,
మొరస రౌతులకున్ను, పంౘ్రెండు వేల గుఱ్ఱాలకున్ను, యేలికబంట్లగా
వ్రాయిస్తిమి అని మాటిమాటికి కొనియాడుతా పలకరించి మరి వెనక
గుఱ్ఱాలు పంౘ్రెండు వేలున్ను, యేనుగలు యేనూరు, రౌతులు మావ
25 టీలు వెచ్చపెట్టి ఆయా గుఱ్ఱాల రౌతులకు మావటీలకున్ను సంబళం
సారికెలు కట్టడజేశి ఆయాలాయం గుఱ్ఱాలకు కడ్డికవళములు పరామర
శించేటట్టు నలుగురు పారుబత్త్యగార్లను ఆరుగురు కరణాలనున్ను పడా

రుగురు అంగజాదులనున్ను ఆరుగురు కుడుపు గొల్లలనున్ను కట్టడజేశి,
నానాటి చెల్లువెచ్చానకు బొక్కసాన యిమ్మనేటట్టుగా నిరుత్తరువుజేశి
సల్లప్రజలు లక్షకున్ను నెలనెలకు తప్పక సంబళం దిద్దుమని వొఖ కర్ణీ
కం యేర్పాటుజేశి మరివెనుక నేడుగదా దొరతనమున్ను ప్రభుత్వమున్ను
యేర్పాటు ఆయను అని సంతసించి, మరిన్ని అమరగార్లకు యేనూరు 5
యేనుగలు, పండ్రెండువేల గుర్రాలున్ను క్రయంగట్టి యిచ్చేటప్పుడు
వకరైనా అన్యాయమనకుండా వారువార్ల సమ్మతి మీదనే క్రయంగట్టి
యిచ్చిరి గనక ఆ యేనుగుల క్రయం విన్నప్పటికిన్ని సగటున యేనుగ
వొక్కంటికి ఆరేశివేల లెక్క యేనుగలు యిరువై యింటికిన్ని లక్ష
యిరవై వేల వంతున యేనుగ ఘట్టముయ్యాభై యింటికి ముప్ఫై లక్షలున్ను 10
గుర్రాలక్రయం గుర్రంవక్కంటికి యేనూరు వరాల వంతున గుర్రాలు
వెయ్యింటికి రెండు లక్షల లెఖ్ఖను గుర్రాలు పండ్రెడు వేలకు యిరువై
నాలుగు లక్షలున్ను, నిమిషమాత్రములోగా యేనుగ గుర్రాలవల్ల
నగరికి ఆ యాభైనాలుగు లక్షలకు ఆదాయం జేసేను.

## సాళువ తిమ్మరసు ప్రశంస

"అపూర్వమైనమనుష్యులు దొరికితేను సకలమున్ను సంతరించ్చ 15
వచ్చును." అని రాయలదేవుండు పలకరించగా అయ్య మరసుగారు
విన్నపం జేశినది—"సింహాసనస్థునకు స్త్రీలున్ను రత్నములున్ను కలిగి
నది అయితే అంతకన్నా అధికం మహీపతుల కనగా- సీపతిద్యం.

క. పత్ని ధరిత్రియుఁ బురుషులె
రత్నము లెప్పుడుఁ బురంధ్రిరత్నములు శిలా
రత్నము లవనీపతులకుఁ
బత్నులె రత్నములు వగవ బద్దెనరేంద్రా.

అని అన్నారు గనుక రాజులైన వారలు అనువైన పురుష
రత్నాన్ని సంతరిస్తే ఆయనా నవరత్నములున్ను చతురంగ బలమూ

లనున్ను సంతరించ్చగలడు. అటు గనక అప్పాజి సాధారణ నియ్యో గిగా యెంచవద్దు. ఆయన అసాధారణ నియ్యోగి. అఘటనఘటనా సామ ర్థ్యం ఆయనకే గలదు. అవి యేలాగంటేను— అందరున్ను మను ష్యులు. అందరికిన్ని అవయవాలు సరి. ఇందులో ఉత్తములు మధ్య 5 ములు అధములు అని యెరిగి యేర్పరచవలెను. అది యేలాగంటేను— గుణాధిక్యము వల్లను యెక్కువ. మరిన్ని పంచలోహములున్ను అన్ని యు సరి. అందున బంగారు హెచ్చింది యేంది అంటే వ్యాయకకు రాంగా వన్నె హెచ్చించినట్లు గుణాధిక్యంవల్ల మనుష్యులలోనున్ను అప్పాజిని అధికుడని యెరుగవలెను. అది యేలాగంటేను—

10 శ్లో. శతేషుజాయతే శూరః సహస్రేషుచ పండితః,
వక్తాశతసహస్రేషు దాతాభవతి నా నవ.

అనే నీతి ప్రకారానకు నూటికి వక బంటును వెయ్యింటికి వఖ పండితు డున్ను లక్షకు వఖడు వక్తుండై సభాస్థలిని మాటపలుకులాడును. శీమలో వఖడు దాత అనేది కలండో లేదో అన్నట్టు వొఖరు గాక అందరికిన్ని 15 ఆగుణములు యేాల వచ్చీని", అని అయ్యె మరను విన్నపంజేసి ఆప్తా లోచనగా వార్తలాడుతా వుండగా విజయాపురానసుండి వేగర్లు వచ్చినారని మారీచి రామయ్య వచ్చి కృష్ణరాయలవారితోను విన్నపంజేశిన వివరం.

## విజయాపుర వృత్తాంతము

విజయాపురానకు బోయిపట్టం వెళిపాళ్యములు, కోటకొత్తళములు, రవు 20 తులు, మావుత్తులు, యేనుగ గుర్రాలు, కాల్బలం, అమరనాయకం వార్లను అందరిని్ని జూచి నగరివాకిటికిపోయి, దాదిమహలు ముందుగా ముందర దివాణంలో ముందర ఆయావజీర్లు దొరలు దొండో పండితులు మొదలయిన వారు నియ్యోగులు వారివద్ద కుతపనఘలక వారి హేజీబులు ముకుంద పండితులు మొదలయినవారు కూర్చుండి

ఆలోచన జేశినది:—కర్నాటకం సింహాసనానకు వడవంగా కృష్ణరాయల వారిని అధిష్టాన కర్తల జేశిన దారభ్యం తురకల మీద కార్యం శాయవలెనని ఆలోచనజేశి అందుకైన యత్నములు శేస్తావున్నారు. అన్ని వివరాలకు విజయనగరానుండిన్ని కాకితములు వ్రాశివచ్చెను.

## అశ్వపతి గజపతి నరపతుల తారతమ్యము

అశ్వపతి గజపతి నరపతులలో నరపతిసింహాసనమే అధికము. కడమ రెండు సింహాసనములున్ను వారి వెనకను అని పిన్న పెద్దలు ఆలోచనగా చెప్పినందులకు గోలకొండ వారి ముద్దాపండితులు "సింహాసనాలంటె మూడున్ను సరి. ఇందులో సింహాసనాధిక్యములు కలవా" అని ఆగ్రహపడగా నిజాం రవుతులు మావుత్తులు లశికరీతనాన సరిగదా ద్రవ్యసామగ్రియందు దుర్గముల యందు కొదవ; అట్టి పట్ల అధికమని జెప్పవలశిన కారణమెంద్ది. అన్నందులకు గోలకొండవారి ముద్దా పండితులు వ్యంగ్యోక్తముగా కాక యేమి మరేమి యిందులలో న్యూనాధిక్యములు యెంచ అవకాశమేమివున్నది? వొకరికొకరు యేకవాక్యముగా ఆడుకొన్నందులకు బాహుబలేంద్రునివారి బ్రంహ్మపంత్తులు వారలతోను యీమూడు సింహాసనము లనగా బ్రంహ్మ విష్ణు మహేశ్వరుల అంశలుగా వుండును. అందున తారతమ్యములు యేరీతో ఆరీతు వలెనే అశ్వపతి గుర్రాలకున్ను, గజపతి యేనుగలకున్ను, నరపతి కర్నాటక సింహాసనానకున్ను గనక నరపతియే హెచ్చు, అవి యేలాగంటేను — భగవద్వాక్యం 'నరాణాంచ నరాధిపం' అనే వచనము వల్లనున్ను ఆ రాజ్యములోను దేవాదాయం బ్రంహ్మదాయం పుణ్యతీర్థములు నదులు పుష్కరిణులు గలిగి వున్నది, ఇదిగాక విష్ణుప్రత్యక్షమై వెంకటాచలాన వున్నారు, ఆ రాజ్యములో వుండే స్వామికి కడమ రాజ్యములో పెద్దలు బుద్ధిశాలులు బ్రాంహ్మలు యతీశ్వరులు మఠాధిపతులు రాజులు మొదలైన వారలందరున్ను కానుక కప్పములు కొంచు

బోయి స్వామికి సమర్పించి వస్తావున్నారు గనక కర్నాటకం సింహ్మా
సనాధిపతులు పుణ్యశ్లోకులు, ఆ పిమ్మట గజపతి సింహ్మాసనమందు
జగన్నాయకులు వేంచేశి వున్నారు గనక రెండోపర్యాయము అశ్వపతి
వారున్ను గంగాతీరాన విశ్వనాథుల రాజ్యములో వున్నారు, వారి తెగల
5 వారి యెదులసాహు, కుతుపనమలక, నిజాంశాహు, యీ మూడు తెగల
వారున్ను కర్నాటకం సరదున వున్నారు. మీరు కర్నాటకాధిపతు
లతో సరి యన నగునె, అని మధ్యస్థభావముగా అన్నందులకు దొండ్డో
పండితులు, ముద్దో పండితులు, దాదో పండితులు ముగ్గురున్ను దొడ్డ
నియ్యోగులు గనక తెలుసుకొని తమ దొరలు మద్యపానులు. దేవబ్రాం
10 హ్మణ విశ్వాసము లేవు. మ్లేచ్ఛులు గోహింసకులు, వారిని గొలిచిన
వారము గనక దూరదృష్టి విచారించుకొన అవకాశ మంత లేక అహం
కార గుణమువల్ల అనవలశిన దంటిమి. బ్రంహ్మపంతులవారు
పలకరించినది యదార్థ మని యెంచినవారై ఆ తర్వాత మంత్రాలోచనగా
వార్త లాడినవి. కర్నాటకం వారు సరదు బలమించ్చి వచ్చే గజపతి
15 వారికిన్ని మనకున్ను మున్నెరికగా వుండగా వుండును. ఆ రీతు
గాకుండ అందునకైన యత్నంగని సరుదు దుర్గాలను రస్తుసామగ్రీలు
వేయించి బలపంతముగా యేనుగ గుఱ్ఱాలు కాల్బలములు వుంచవలెను.
అని ఆలోచన జేశినవారై యెదుల శాహువారితోను యీ పర్యాయములు
యెరుకశాయగా ఆగ్రహబడి "కర్నాటకం వారు తుంగభద్ర దాటి
20 వచ్చిరా యీవరకున్ను యీశ్వరనాయకుండున్ను నరసనాయకుండున్ను
వీరనరసింహ్మరాయలవారున్ను యేలినందు కన్నా కృష్ణరాయలవారు
యేలేది యేమున్నది" అని అన్నందులకు దొండో పండితులు మొద
లైనవారు "రాజనీతి అది మొనకురాదు. గనక వుండే యత్నములు
వుండగా దైవసహాయం యేతీరో తెలియదు గనక నిజాం శాహువారు
25 న్ను, కుతుపనమలకవారున్ను విజయనగరాన నుండి కాకితములు
వ్రాసి వచ్చినది విని ఆలోచనపరులై యిక్కడికి కాకితములు అంప్పి
తమతమ సరుదు స్థలములు పదిలపరుచుకొని యాది హెచ్చరికలతో

వున్నారు, బాహుబలేంద్రునివారి బ్రంహ్మపంతులువారి వారి సరదు గిరి
దుర్గములయందు రస్తుసామగ్రీలు వేయించి బలవంతముగా వుండేటట్టుగా
యేనుగ గుర్రాలున్ను, రవుతున్ను అంపించేవారై వున్నారు. మన
మున్ను ఇక్కేరి బసవాపట్ణం శంకరనాయడు అది కొమాళ్ల బోయి రామ
ప్పగారి సరదు స్థలాలకున్ను రస్తుసామగ్రీలున్ను మూకస్తోమాదులున్ను 5
అంపించవలె" ననగా ఆ తీరున్నె అంప్పించ మని విజయాపురం కోట
కొత్తళములున్ను లెస్సగా తీర్చి రస్తుసామగ్రీలు వేయించమని మందలిం
చగా, వాకిటి పారుబత్యగార్లు యెనిమిది దినాలనుండిన్ని ఫిరంగి, జవురు
జంగులు, గుంట్టుకోవులు, దంతెన రాళ్ళు, యెత్తు రాళ్ళు, గశికలు,
పులితలలు, కోట వెలుపట గుర్రాలు జొచ్చిరాకుండా గుర్రపు నిలుపు 10
రాళ్ళు, వేయించేదిన్ని, దిక్కులకు వేగుర్లను అంప్పి నానాటి సమాచార
ములు తోడుతోనే వచ్చి తమతో దెలుప మని అరవై వేగుర్లను విద్యా
నగరపట్ణానకు అంపించినారు విజయాపుర దేశములో గల ప్రజ లంద
రున్ను అలోచనపరులై వున్నారు. సరుదుల ఉండేవార్లు యీవార్త
విని చీటిపాటి చిక్కు చిల్హానములు విజయాపురానకు అంపుతావున్నారు, 15
అవిన్ని ఆపట్ణములో వారువారు ఆడుకొనే వార్తలున్ను కన్న విన్నది
యంతాను విన్నపము శేయగా, రాయలవారున్ను అప్పాజి అయ్యమరసు
కొండమరసుగారు విని, విజయాపురం అహముదానగరం గోలకొండవారికి
యిక్కడవుండే వారి స్థానాపతులు నడిచిన ప్రవర్తమానములకు వ్రాశి
అంప్పిన కార్యానికి యాది హెచ్చరికలు కలిగి, యింత అలోచనజేశి 20
యదులశాహుకున్ను తెలిపి ఆయనాను సరుదుస్థలాలకు రస్తుసామగ్రీలు
అంప్పించినారు గనుక వారి యాది హెచ్చరికలున్ను కలిమిబలుముల
కున్ను సరి వున్నందా అని వేగుల వారికి వుడుగరల యిచ్చి విజయా
పురాన్నె వుండి నానాటివర్తమానములున్ను లెస్సగా తెలిసిరమ్మని అంపి,
వద్దమున్న వూడిగాలవార్లను కడకు పొమ్మని అప్పాజి మొదలైన 25
సామాజికులున్ను రాయలవారున్ను ఆలోచనగా మాటలాడుకొన్న
వివరం:— రాయలవారు అప్పాజి మొదలైన వారి తోను "మేము ఏక

దేశాన ఏకవదంతిగా తురకాణ్యంమీద కార్యం శేయవలెనని యెంచిన ఆలోచనకు యిప్పుడే నడిపిస్తా వున్నారు. యీకార్యం ధైర్యంమీద నడిపేదో భీతిచేత హెచ్చరికపడేదో" అని అడిగినందులకు అప్పాజీ ప్రభృతులైనవారు దిక్కులవార్తల విందును, విన్న వేళకు ఆ ప్రసంగములు తలపక నాలుగార్లు దినములు వెనుక సరుదు స్థలాలు చూచేనిమిత్యముగా ఆశిమాధిపతి వస్తున్నాడని వదంతి పుట్టించి ఆయా స్థలముల వుండేవారికి కోటకొత్తళములున్ను రస్తుసామగ్రీలున్ను పైచి యాది హెచ్చరికలతో వుండవలె నని సమదళం వారు సంతరించేటట్టు నడిపించేది గంహారమున్ను ధైర్యమున్నుగాక యీరీతి నడిపించేదెల్లా బుద్ధిచంచలత్వాన నడిపించే ప్రయోజన మని అన్నందులకు, అయ్యామరసు కొండమరసుగారు తురక లనగా మద్యపాయులు, మందుతినేవారు,

## తురుష్కుల శీలము

లాలారిపురుషులు గనక వార్లకు చాలా భీతి గలిగి యుండును. పానము జేసినంత పొద్దున్ను తమ దేహములు తాము యెరుగరు గనుక ఆసమయమందు స్మరణ యెరుగరు. అప్పుడు యెవ్వరు అడ్డమైన నరుకుదురు. కలియుగరాక్షసుల తీరై వుందురు. స్మరణ తెలిశిన తర్వాత తమ జాతి స్వభావం యిటువలెగదా అని విచారపడుదురు. బ్రాహ్మలు పప్పు పులుసుతో అన్నం పరిసాపడుదురు గనక వారలకు మదమాత్సర్యములు లేవు. అని యెంచి వాకిటిపారుపత్యమంతా వారిసే శేయమని తమ ఆజ్ఞలో నడుచక వారి పాట మీద నామజాదులు అంపుతా వాచు తీశి వచ్చేటట్టు యేర్పాటుచేసి తామున్ను వారి బుద్ధిమతులలో నడుచుక వత్తురు. అటుగనుక నియ్యోగులు యేరీతిని నడిపిస్తే ఆరీతున నడుచును. నియ్యోగులతో ద్వివిధమైతే దొరనుండి తమ ప్రాణాలకు హానియై దొరతనమునకున్ను చలనం వచ్చును, అటుగనక యేకగ్రీవపై ఆ మూడు తెగల నియ్యోగులున్ను ఆలోచన శేసుక నడిపించే కార్య

మని తెలిపి "వారు స్వాయత్తులు గారు, పరాయత్తులుగాని స్వామివారు ఉభయాయత్తులు కాబట్టి దేవరవారి ఆలోచనకు సరిలేదు. తురకలు మూడు తెగలవారున్ను యేకాలోచనపరులై కార్యముఖానకు నడిపిస్తే లక్షయాభైవేల గుర్రాలున్ను వెయ్యింన్నూరు మదహత్తుల్ను మూడు లక్షలపాయుదళములున్ను వార్లనుజయించేటందుకు అంతకన్నా ద్విగుణమైన బలముచేత జయించవలెను; కర్నాటకాన అన్ని గుర్రములున్ను సంతరించేమా కాదు. చతురంగబలాలున్ను వుండవలెననేటందులకు కైజీతం గుర్రాలు పన్నెండువేలున్ను, అమరనాయకం గుర్రాలు యిరువైనాలుగువేలున్ను, కైజీతం యేనుగులు యాభైఘట్టాలున్ను, అమరపు యేనుగలు నూటయిరువైఘట్టాలు, కైజీతం రాణువ నూతనం సహాగా మూడులక్షలున్ను, అమరం పగను అయిదులక్షలున్ను, బలం బంట్లున్ను యీ మట్టుబలముతోనున్ను వివరం మీద సమరమిస్తేను తురకల కార్యమనగా యెంత" అని విన్నపం శేయగా రాయలవారు సామాజికుల లోను ధైర్యమువల్లనున్ను లక్ష్మీకటాక్షమువల్లనున్ను దైవసహాయము వల్లనున్ను జయంగలుగును, అందుకు—

శ్లో॥ యతో ధైర్య స్తతో లక్ష్మీః యతో లక్ష్మీ స్తతో హరిః
యతో హరి స్తతో ధర్మః యతో ధర్మ స్తతో జయః॥

అని పెద్దలు చెప్పుదురు గనక అన్నిటికిన్ని ధైర్యము ముఖ్యము గనక మీరు ధైర్యశాలులు మీరు పూనిన కార్యము లన్నిన్ని చేకూడును. యేనుగలున్ను గుర్రాలున్ను కాల్బలమున్ను కారణం గాదు. దైవసహాయమువల్లనే రాజ్యములు దీవులు పరిపాలించవలెను. తొల్లి ఆర్గురు చక్రవర్తులు తాము వున్న తావున్నే వుండిగదా ఆజ్ఞాచక్రము చేత సప్తద్వీపములున్ను యేలిరి. ఆ పిమ్మట పదార్గురు రాజులున్ను భూమి పరిపాలించిరి. ఆరీతినే స్వామివారికి వేంకటేశ్వరుల సహాయం గలదు" అని తెలుపగా విన్నవారై "ముందరి కార్యాలోచనకు అనుసారిగా

నడిపించుడా" అని అప్పాజీ మొదలైనవారితో ఆనతిచ్చి ఆయా దిక్కుల
నుండి వేగర్లుకమ్మ కాకితములు తెచ్చినారా అని పరామరిశించగా
అహముదా నగరాననుండ్డిన్ని వేగుల రామున్ను గోలకొండనుండ్డిన్ని
వేగుం గోపోజిన్ని వచ్చినారని తెలుపగా వద్దనున్న వార్లను కడకు
5 నంపించి వేగర్లను రప్పించుక అచ్చటి సమాచారములు అడుగగా వారు
విజయనగరమున నుండిన్ని తరలిన దారభ్యం అహముదానగరం గోల

## అహమదాబాదు గోలకొండల వృత్తాంతము
## పరదేశుల శోధనము

కొండ ప్రవేశమయ్యేపర్యంత్యం నిత్యపయనగతుల వూళ్లున్ను పట్టణ
ములున్ను దాటి ఆయాసరుదులున్ను పరస్థలం శీమవారినిన్ని పరదేసుల
నున్ను మరిన్ని మార్గస్థులుగా వచ్చేవారినిన్ని శోధించేదిన్ని కమ్మకాకిత
10 ములు లేనివార్లను యెక్కడి నుండి వస్తున్నావు, యెవరి తెగల వారు
అని బెదరించి అడిగేదిన్ని, ఆ తర్వాత పొమ్మనేదిన్ని, ఆపట్ణంలోనికి
పోయి పెలిపాళ్యములు జూచి కోటలోనికి పొయ్యేటప్పుడు యెరుకగల
వారు వచ్చి వీరు తమ వారనిన్ని వీరినుండి వక కార్యములు వస్తే
మేమే నేరస్తులమనిన్ని భరవసముగా చెప్పిన తర్వాత శిఖామీద శిఖా
15 వేసి కోటలోపలికి అంపుదురు. కడమ జనులవారికి ఆ శిఖా జూపితేను
కోటలోనికి విడుతురు కొత్తవాలు అనే తలారికి ఆ ముద్రజూపి పట్ణ
ములో సంచరించవలెను. కోటలో వుండే దినాలెల్లా తిరిగి తమ శీమకు
వచ్చేటప్పుడు మొదటి పారుబత్యగానితో యెరుకజేసి పారుబత్యగాని
శిఖా చేతికిచ్చి శిఖా వేయించుకొని కొత్తవాలు అనే తలారకి జూపి కోట
20 వాకిళ్ళకు వచ్చి వాకిటివార్లకున్ను అముద్రజూపిన తర్వాత అంపుదురు.
అటువంటి దుర్ఘటనముల నన్నిన్ని నేర్పున గడచి దివాణం ముందర

## తురుష్కరాజ్యములో దండన విధము

దిన మొక్కంటికి ఆజ్ఞలు జేశేదిన్ని, నడిమికి తెగవేశేదిన్ని, రంపాన

మనుష్యుల గోసేదిన్ని, గోనెలో మనుష్యుల వేసిగట్టి యినుపగుదియల గొట్టేదిన్ని, చౌలకు శింగ్గాణికొావలనారుల తగిలించేదిన్ని, రెండుతులాల బరువుగల రాళ్ళు కాళ్ళకుగట్టి పాడుగోడలకు యిరుగడల దిగవేశే దిన్ని, మూటకట్లుగా కట్టి యెండ్డలో దొల్లించేదిన్ని, కాలు చేయి కర్న నాశిక ఛేదనం జేశేదిన్ని, ఇదిగాక శీమ మణియగార్లను అనేకవిధముగా 5
బాధలు బెట్టేదిన్ని, యేనుగ కాలగట్టి దొర్లించేదిన్ని, యీరీతిగా అనేక విధములుగా చూడ భీకరమైన బాధలకు వెరచి నగరికి పైకం ఇస్తే ప్రాణాలతో విడుతురు. యిచ్చేటందుకు అవకాశం లేకుంటే హింస చేతనే నడివీధిలోనే చంపుదురు. యీరీతి యానబెట్టే బాధలు చూస్తూ వుండి వెంబడినే ఆయాధిపత్యము నగరి మహాలుకు ముందర యెదు 10
రుగానె కట్టివుందురు. గనక అందుండ్డి ఆయాచావిళ్ళ వారు సలాము శేయంగ్గా మొదటిదొర మితపరిజనములతో మహాలుమీద కొలువై యుండ్డి కొలువుదీరి నగరికి వొయ్యేటప్పుడు వున్నతమైన మార్గములు గానె కట్టివుండ్డును గనక ఆ వున్నతస్థానమందు నిలిచి వెలిచావళ్ళలో వుండేవార్లకును జూచి వారివార్లకు నిత్యకట్టడ బహుమానము సన్మా 15
నంబులు నడిపించ్చే క్రమానికి నడిపించ్చమని ఉత్తరువు ఇయ్యగానే ఆయాపనులవారు రొక్కంవుడుగరలు దట్టికబాయి తలపాగ పట్టీలు యివి అన్నింన్ని ఆయాచావిళ్ళలోనే వుండ్డును గనక తోడుతోనె తెచ్చి మొదటిదొర ముంద్దుగానె వారివార్లకు ఇయ్యగా నకలమైన వార్లున్ను కొలువుజేశి వుంద్దురు గనక యెంద్దరు వచ్చినా వార్లకు గ్రాసం 20
కట్టడజేశి వుండ్డును గనక వారలకు గ్రాసం యిప్పించ్చి మరి వెనక నగళ్లోనికి పోదురు నియ్యోగులు దిక్కులనుండ్డి వచ్చిన కమ్మకాగి తములు చదివించ్చుక విని యేనుగలున్ను కొంత్తపాయదళమున్ను నామజాదులు ఆలోచనశేయగా విన్నవివరం:- విజయాపురం అహముదా నగరం గోలకొండ్డమీద కార్యం శేయ మని మూడులక్షల గుర్రాలున్ను 25
వెయ్యి యేనుగలున్ను కొంత్త పాయదళమున్ను నామజాదుల జేశినారు వారువచ్చి దిగితే వారలతో పోరాడేది దుర్ఘటమై వుండ్డును. ఉత్తరాన

అఘపురం వారున్ను దక్షిణాన కర్నాటకం వారున్ను తూర్పున గజ
పతివారున్ను కనిపించుకొనేటట్టు వున్నది. అశ్వపతి గజపతి నరపతు
లలో యీమూడు సింహాసనాలవారినిన్ని విరుద్ధమైనవారి యెవ్వరినిన్ని
కనమని కొలిచేవారము కాము. మూడు సింహాసనములకున్ను గురి
లేక వుండ్డగాను మూడుతెగల రాజ్యములోను యేలుబడియైన గడీస్థలాలు
ఆక్రమించ్చుకొని మెడబలిమిని దినాలు క్రమిస్తావుంటిమి. వారితోవారు
అన్యోన్యమై కార్యం శేయమని తమ తమ సరదులవుండ్డె వాళ్లను
కనుపించ్చుకొమ్మని నామజాదులు అంప్పితే వారితో పోరాడేది శక్యము
గాదు తాము జేసిన అదృష్టమువల్లనున్ను తమ దొరల పాలిటి కర్తారు
వల్లనున్ను అంత్తరమస్నీలమై అపహై యేండ్లుబట్టిన్ని, అవనికి అధిప
తులు లేకుండ్డగ యెదులశాహు కుతుపనమలక నిజాంశాహు అనేపేరు
గలిగి వుంన్నది. సింధు దేశము నుండి గోదావరీ పర్యంతమున్ను

## మూఁడు దక్షిణ హిందూరాజ్యములు

అఘుపురంవారున్ను కేరళం మొదలు కృష్ణవేణిపర్యంతమును కర్నా
టకం వారున్ను జగన్నాధమున నుండి బెడదకోట పర్యంత్తం గజపతి
వారున్ను యేలుదురు. యీమూడు సింహాసనాలవారికి అంద్దుబడిగాక
అసాధ్యమైన దుర్గాలున్ను చేపట్టి త్రిపురాలవలె వుంన్నది గనక
భయము లేదని తమలో తాము ఆలోచన జేసుకవుండ్డంగా తాత్కాలిక
మతి అనే ఆయన వారితోను మీరు జేసిన ఆలోచన యథార్థమౌను
త్రిపురాలలోనున్న రాక్షసులు మహాబలవంత్తులు యీశ్వరవరప్రసాదము
వల్ల కామగమనం గలిగి సురలు అసురలు మొదలైన వారలచేత
వొక్కరిచేత నయినా లయం లేకుండ్డా వరమడుక్కొని పంన్రెండ్డు
యేండ్లకు వొకసారి మూడుం ముక్కాలుఘడియ త్రిపురులు ముగ్గురున్ను
కూడివుండ్డి ఆలోచన జేసుకొని యెప్పటివలె యధాయధలై సంచరింపు
దురు. ఆటువంటి త్రిపురాధిపతులకు కాలం కూడేటప్పుడు భూదేవి
బ్రహ్మదేవునితోను విష్ణుదేవునితోనున్ను అధర్మపతులైన త్రిపురులను

మోయలేనని మొరబెట్టగా బ్రహ్మదేవుడు త్రిపురాలవారిని వకరిచేత నిగ్ర
హించ శక్యముగాదు, నీవు రధమై వేదములు గుర్రాలై మేరుపర్వతము
విల్లై. ఆదిశేషుడు నారియై క్షీరాబ్ధిశాయి నారాయణాస్త్రమై ఫాలలోచనుండు
రధికుండై త్రిపురాలను నేల గూలిస్తే అప్పుడు ఆ దానవులు నాశమై
పోవుదురు అని అనుగ్రహించిరి. ఆరీతిగాను విజయాపురం అహముదా 5
నగరం గోలకొండ్డ అనే త్రిపురాలకు మూడు సింహ్మాసనాలవారున్ను
యెప్పుడు కనిపించ్చుకొంటా వున్నారో అప్పుడు అపాయం వచ్చేది
నిశ్చయమని తాత్కాలికమతి తెలుపగా ఆ నియ్యోగులు అందరున్ను
"ఆనీతు అవును అయినా పుంన్నదినాలకు రాజలక్షణములున్ను మంత్రా
లోచనలున్ను నడపవలె గనక వూరకే వుండరాదు యిప్పుడు కన్నాఁ 10
టక సింహాసనానకు కృష్ణరాయలవారిని అధిష్టానకర్తల జేశినదారభ్యం
తురకలమిద కార్యంజేశే ఆలోచన అక్కడవుండే ముఖాములు కాకిత
ములు అంప్పినారు. అది నిమిత్యం ఆలోచనపరులై హానివృద్ధులకు
లోనై యెదులసాహువారికి వ్రాయించ్చి అంప్పించినారుగనక వారున్ను
తమతమ కాగితములు సరదుస్థలాలకు రస్తుసామగ్రీలు అంప్పించి గడి 15
స్థలాలకు బలవంతముగా వుండ్డేటట్టుగా ఠాణ్యములకు నామజాదులు
అంప్పించి మొదటి స్థలానికిన్ని యాదిహెచ్చరికలతో వున్నారని వ్రాశి
వచ్చెను. మన రెండు తెగలవారున్ను శీమసరుదులు వున్నదుర్గాములు
కోటస్థలములకు అంప్పతగినవార్లఁను అంప్పించి కన్నాఁటకంవారు
దళము కూర్చుకొని స్థళము తర్లి సరుదులకు వచ్చేవారై వక్కప్రదేశాన 20
దిగినారని కమ్మకాగితములు వస్తే యిప్పుడు అందుకు తగిన ఆలోచన
జేశి నడిపించ్చుకొంద్దాము. ఇప్పుడు నా నాటి ప్రవర్తకములు తెలిశివచ్చి
చెప్పమని నూటయిరువై వేగుల్లఁను పయనంశేశి అహముదానగరం
వారున్ను గోలకొండ్డ వారున్ను అంప్పుగా విద్యానగరానకు బహువేష
భాషల బహురూపాలుగా వచ్చి వారు వేగుల్లఁను అంప్పించి మరింన్ని 25
ఆలోచనశేశేవివరం- కృష్ణరాయలవారు తురకారణ్యం మీద దళమెత్తి
వచ్చి అనిమొనల కార్యం పూని నడిపించే యడల జయాపజయములు

యెవరికని దైవజ్ఞులయిన బ్రాంహ్మలనున్ను ముల్లాశాస్త్ర ప్రవీణులయిన
పకీ్కరులనున్ను భూత భవిష్య ద్వర్తమానములు తెలిశిన శకునజ్ఞుల
నున్ను పిలుపించ్చి అడుగగా వాల్లు కర్నాటకమున విష్ణు అంశగా
నృపతి ఉద్భవించి యీ రాజ్యమున్ను అశ్వపతి రాజ్యమున్ను గజపతీ
5 రాజ్యమున్ను అంత్తా జయించిజయస్తంభము వేయించ్చి మగుడి బోయ్యే
టప్పుడు కల్యాణ వేంకటేశ్వరుల దర్శించ్చి నూటయెనిమిది దివ్య
తిరుపతులనున్ను డెబ్బైరెండ్లు దేవస్థానములున్ను పదునెనిమిది శక్తుల
నున్ను సేవించ్చి సేతువుకుబోయి రామనాధుల దర్శించ్చి ధనుష్కోటిలో
ఖడ్గము కడిగి కర్నాటకం సింహాసనాన అరువై నాలుగు యేండ్లు
10 యెదురులేక యేకచక్రముగాను రాజ్యమేలేటట్టు వున్నది అని చెప్పినారు
గనుక పిన్న పెద్దలు అతీరే అవుగాబోలు మ్లేఛులు అధర్మానకున్ను నిర్దయ
త్వమునకున్ను రాక్షసకృత్యమునకున్ను వెరవరు గనక భూదేవి
తాళునా, త్రిపురాలకు వచ్చినట్టు వచ్చునేమో తెలియదు అని అంద్దరున్ను
ఆలోచన శేసుక తమ తమ ఇండ్లకు పోగా వారితో కూడావుండ్డీ నగరు
15 వెడలి పకీ్కరులతోకూడా పట్ణము వెళ్ళివచ్చి భాగీరధినుండ్డిన్ని రామధను
ష్కోటికి వచ్చి వచ్చేవారి వెంబ్బడి నీళ్లుదాటి కర్నాటకమునకు వచ్చి
యెప్పటి వేషముదాల్చి బట్ణమునకు వస్తిమి. అహముదానగరం గోల
కొండ్డలో కన్న విన్న వార్తలు వేగుల అరవరాముడున్ను పకీ్కరి
గోపోజీ యిద్దరు తెలియ విన్నపము శేయగా రాయలవారితోను అప్పాజి
20 అయ్యమరసు కొండమరసుగారున్ను తురకారణ్య మనగా యెముని
రాజ్యమువంట్టిది ఆ పట్ణము అటువంట్టిది ఆ వూరిలో వుండ్డేవారు యమ
దూతలు అనేటంద్దులకు సంద్దేహంలేదు అటువంట్టి దిక్కులకు బోయి
సకలవార్తలున్ను పరామరిక శేసుక స్వామివారి ప్రతాపమువల్ల మ్లేఛు
లయినవారి నగళ్ళున్ను రాజ్యములున్ను నూరుభాషల భూములున్ను
25 మహారాష్ట్రి గుజ్జెరి గర్జోజి యిటువంట్టి గాయకులతో కలహస్థులై కష్ట
బడక సంచ్చరించ్చి పట్ణానకు వచ్చినారంత్తేగాని అరపేద కాలుపేద్ద
మనుష్యులయిన వారికి పోనురాను శక్యమా అని నగరు వేగులర్ను

కొనియాడగా రాయలవారు చాలా సంతోషబడితలా యేనూరేశిఘట్లున్ను
ఉడగరులు యిచ్చి యెప్పటివలెనే ఆయాపట్ణముల సంచ్చరించి నానాటి
సమాచారములువచ్చి విన్నపంశాయమని అంప్పించ్చి వద్దనున్న వాలఱను
కడకు పోంమ్మని రాయలవారు సామాజికులతో విజయాపురం వర్తమా
నాలున్ను అహముదానగరం గోలకొండ్డవార్తలున్ను వింట్టిరేగా ఆ 5
రెండ్డు ఇండ్ల వారికిన్ని చాలా ఆలోచనపుట్టి యింత్తే శివార్త్తలకు హేతువు
యెంద్ది అని అడుగగా సామాజికులు యీ వరకున్ను తురకాణ్యము
మీద కార్యం శేయవలెనని వదంత్తి పుట్టింద్ది లేదు గనక యీ సింహా
సనస్థులనుండి విచారం లేక వుండ్డగా వూరకె వుండ్డిరి యిప్పుడు స్వామి
వారు సింహాసనానకు కర్త్తలై దానక్షాత్రములు కనుపించ్చు వార్త్తా 10
లుగా అనతి స్తిరి గనక అరిజనులైనవార్లకు ఆలోచన పుట్టకవుండ్డునా
మీరు దినమున్ను ఆ మూడు తెగలవారి ముఖాములతోను వినయమైన
వార్త్తలు అనతిస్తేను వారు బుద్ధిశాలులు గనక తమ యేలిన వారిని
స్వామివారనిన్ని అట్టి పట్టగతాన సింహాసనస్థులైనవారు శేశిన సంబ్బళం
సారికెలు యిప్పించ్చి దిక్కుల స్థానాపతులతోడట్టు కొలువుకువస్తే కమ్మ 15
కాకితములు గలిగితేను మాట పలుకులు నడిపించ్చినట్టయితే ఇప్పుడున్ను
నడుచుకవచ్చే మర్యాద వక్కలాకులు యిచ్చి అంప్పుదురు. ఆరీతిగ
స్వామివారు పట్టాభిషిక్తులైన దారభ్యం నిలిచిన వారి కేమి రౌతురాణువ
కేమి బొక్కసానవే రొక్కరూపాయలు ఇమ్మని కట్టడజేశి కైజీతం
నిలిపి గతం అమరపు దొరతనములవారి శీమ సంబంధ్దాలున్ను నడిపి 20
నగరి నియ్యోగులకు వరస్థళం నియ్యోగులకు బహుమాన సంప్మాన
ములున్ను ఉచితముగా రొఖ్కరూపాయి లున్ను యిచ్చి మూడు తెగల
వారిపట్ల లియ్యమైన మాటలున్ను అడుతూ ఉన్నారు గాబట్టి ఆ మూడు
తెగల నియ్యోగులున్ను కన్నాటకాంన్నె బహుదినాలుగా వున్నారు
యిదిగాక వాలుఱ నీతిప్రబంధములు చదివి వుండ్దురు కాబట్టి ఆలోచన 25
పరులై వ్రాశి అంప్పించ్చినారు అనినంద్దులకు రాయలవారు మేము
ఆగ్రహబడి ఆ రీతిని యీ రీతిని అనతిచ్చినవారముగాము వారికి వారి

యేలినవారి మర్యాదగా బహుమాన సన్మానములుగా వినయమైన సరస సల్లాపములుగా అందుము అని నంద్దులకు అయ్యమరసు స్వామివారు వినయపూర్వకముగా యెప్పుడు ఆనతిచ్చినారో. అదే విపరీతమని యెంచ్చ వచ్చును అదెట్లంటిరా అందుకు నీతిపద్యం.

క. ఘనుఁడా వినయం బాడిన
వినయంబా మీఁద నదియు విపరీత మగుం
గొనసుండి విల్లు వంగుట
వినయంబా యెదుటివాని వేగమె త్రుంచుఁ.

ఆనే అర్థము గనక కన్న కార్యములున్ను విన్న వార్తలున్ను
10 హృదయాలోచన అనుమానముగానున్న నియోగులు వ్రాసేది చాణుక్య నీతి గనక ఆ రీతిని వ్రాతురు అక్కడివారు ఆ కాకితములు జూచుక ఆ వార్త ఆలోచన నడపతగినదే ఆ వార్తలు పరిశోధించి చెప్పినారని సామాజికులు విన్నపం శేశినారు గనక మనముంద్దర నడిపించ్చే కార్యములకు హేతువుతోస్తుంన్నది అని పలుకరించ్చి అప్పాజి మొదలయిన
15 వారిఁ అంప్పించుకో వచ్చిన తర్వాత అయ్యనమలక అంకుశఖా నుండ్డు రాణాజగదేవు గణుతి తిమ్మప్పనాయడు రాచూరి రామినాయడ్డు పెమ్మసాని రామలింగమనాయడు హండ్డే మల్లారావు బోయి రామప్పహాశి వాణం కొమాళ్ళయిన పదునెనిమిది కప్పణాలవారున్ను దళనాయకులు అప్పరపిళ్ళ కుప్పరపిళ్ళ సాళువనాయడు కొమార తిమ్మప్ప వంగ్గరాజు
20 చెర్వుప్రధాని తిప్పరమ అయ్యప్పనాయడు కొటికం విశ్వనాథనాయడు చెవ్వప్ప నాయడు అక్కప్ప నాయడు కృష్ణప్పనాయడు వెలిగోటి యాచమనాయడు కన్నడ బసవప్పనాయడు సాళువ మేకరాజు మట్ల అనంతరాజు తిమ్మరాజు వీరమరాజు మొదలయిన వారుంన్ను బొంమ్మి రెడ్డి నాగారెడ్డి బసువారెడ్డి మొదలయిన రెడ్డి కొమాళ్ళుంన్ను కమ్మ
25 నాయకులు విఠలప్పనాయడు అల్లుండ్లు కొమాళ్ళు రాచశికం మొదలైన

అమర్ధనాయకం వాల్లుగాంన్ను రప్పించ్చి వారి వారి యోగక్షేమాదులు
అడిగి మీవద్ద యేనుగ గుర్రాలు బంట్లు పరిజనాలు యెంత్త వున్నదని
అడిగినందులకు విఠలప్ప నాయనిస్థానాపతులున్ను పరశురామనాయడితె
గాను అమరగాల్లుగా స్థానాపతులలో వీరభద్రయ్య అనే ఆయనాను దళ
పతి రాయడున్ను రాయలవారితోను స్వామివారు కైతీతం కట్టిన వెనక 5
అమరపుశీమలకు నగరి లెఖ్ఖ్యలప్రకారానకు కుంద్దకం లేకుండా వారు
వాల్లుగా యేనుగ గుర్రాలు రావుత్తులు మావుత్తులు బంట్లు పరిజనము
లున్ను సంత్తరించ్చినారు యిన్నాళ్ళవలె కాదు స్వామి వారు యేవ్యాళ
రాచకార్యానకు ఉద్యుక్తులై కదుబుదురు అనిన్ని చిత్తం వచ్చినప్పుడు
గణితిబెట్ట కరణీకులకు ఉత్తరవు యిచ్చి వారువచ్చి గణితిపెట్టినప్పటి 10
కిన్ని నగరి లెఖ్ఖ్యకన్నా పదేశి యేనుగలున్ను నూరేశి గుర్రాలున్ను
వెయ్యి మనిషి బంట్లున్ను అధికముగా వుండవలెనని సంత్తసించ్చినారు,
స్వామి వారి సొమ్ము ఇన్నాళ్లు ప్రసాదిడ్డంద్దుకు నగరి అవసరకార్యా
లకు చిత్తం రా నడిచే వారై యున్నారు—అని విన్నపం శేశినంద్దులకు
రాయలవారు చాలా సంతోషపరులై అమరగార్లతోను నిండ్డుకొలువై 15
వుండ్దగా అయ్యనమలక అంకుశరావుతోను మీరు విజయాపురాన బహు
దినాలు వుంట్టిరి గనక యెదులసాహువారి దొరతనముకన్నా మీ దొర
తనం పూర్వమైనది అని విండ్దుము వారి పూర్వోత్తరములున్ను నిజాం
శాహం కుతుపనమలక వారి వర్త్తగా మానము లున్ను మీరు దెలిశి
వుండ్దురు గనక వీరలకు దొరతనం వచ్చేదేరీతు అని అడిగినంధ్దులకు 20
అయ్యనమలక రాయలదేవునితోను విన్నపం శేశిన వివరం— అశ్వపతి
గజపతి నరపతి యీ మూడు సింహాసనాలకు గల రాజ్యములో ఢిల్లి
సురధాణికిన్ని వోరగంటి ప్రతాపరుద్రునికిన్ని గాక పదిహేను సంవ్వ
త్సరములు పోరాదెను అంతట దుర్గాలలోనున్ను కోటలోనున్ను రస్తు
సామగ్రీలు సరిపోయగనక ప్రతాపరుద్రుండ్దు ప్రజలను వూరకే నంప్పేది 25
ధర్మం కాదని వెలుబడి సమరం శేయగా దైవగతిని ఢిల్లి సురధాణిచా
తను ప్రతాపరుద్రుండ్దు తగిలెను గనక జయభేరి వేయించ్చి ఢిల్లికి

## ఢిల్లిలోనున్న ప్రతాపరుద్రుని వృత్తాంతము

కొంచ్చుపొయనని ఆసమాచారము విని సురధాణితల్లిగారు ప్రతాపరుద్రుణ్ణి
చూడవలెనని కొడుకున అడుగగా ఆయన వొఖనాడు నిద్రవొయ్యే
టప్పుడు చూడమని చెప్పినాడు గనక ఆ తీరుంన్నె ఆయమ్మ రాత్రివేళ
నిద్రవొయ్యే సమయాన వొరగంట్టి ప్రతాపరుద్రుండ్డు మనుష్యశక్తిగాదు
5 రుద్రాంశ త్రిశూల ఢమరులతోడట్టు వుంన్నాడు అటువంట్టి రాజును
నీవుపట్టుకరావచ్చునా అని అన్నందులకు సురధాణి నవ్వి ప్రతాపరుద్రుండ్డు
నిద్రవోగా చూస్తే మీకు యీశ్వరాంశమై కనుపట్టెగదా నేను నిద్ర
వొయ్యేటప్పుడు చూడుమూ అని చెప్పి అంప్పె గనక ఆ తెరంగ్గుననె
సురధాణి నిద్రవొయ్యేటప్పుడు చూడ్గండా శేషశాయిగా శంఖచక్రగదా
10 యుధములతో లక్ష్మిసమేతుడై శ్రీవత్స కౌస్తుభముతోడట్టు విష్ణుస్వరూ
పమై కనుపట్టె గాబట్టి ఆయమ్మ జూచి ఆశ్చర్యబడి యింత్తటి వాడవు
వుంట్టే ప్రతాపరుద్రుంణ్ణి తోడుకవచ్చునా అని మనన్సున యెంచి
మర్నాడు ఢిల్లిసురధాణితోను మీ మహిమలు మీకె తెలుసును ప్రతాప
రుద్రుంణ్ణి పంత్తిబెట్టుక ప్రసాదబడి బహుమాన సన్మానములు శేశి వారి
15 గింట్టికి అంప్పితె నీకీర్తి శాశ్వతముగా వుండ్డును అని తల్లిగారు
చెప్పగా ఆ తీరుగానె మంజ్జన భోజనాదుల ప్రతాపరుద్రుంణ్ణి తృప్తి
శేయించే బహుమాన సన్మానములు శేశి వోరగంటికి అంప్పిరి గనక ఆ
వార్తలు విని వుండ్డురేగదా.

## అహమ్మదానగర, విజాపుర, గోలకొండ రాజ్యవృత్తాంతము

ఒడదకోట బిరుదు అనే ఆయన కొంత్త రాజ్యమున్ను కొంత్త దుర్గా
లున్ను ఆక్రమించ్చుక బలవంతుండై రాజ్యం శేస్తావుండ్డును ఆయన
వద్ద గిండ్డిబెట్టుకవుండ్డగా ఆతగానికి యెదులశాహా అనే పేరు వచ్చెను,
కుక్కల కాపాడేటందులకు చేర్వగాడై యుండ్డగా కుతుపనమలక అనే

పేరు వచ్చెను, యీ ముగ్గిరిలో యెదులశాహు అనే ఆయన విజయాపుర
మున్ను నిజాంశాహు అనే ఆయన అహముదానగరమున్ను కుతుపన
మలక అనే అనే ఆయన గోలకొండ్డానున్ను యీ మూడు సంస్థానాలున్ను
యేలుతావుంద్దురు- బెడదకోట బరీదు వారు వీరల దొరతనము లనంగా
నూరేండ్లదనిన్ని వారిలో నిజాంశాహు పెద్దలు ఆ తర్వాత యెదుల 5
శాహు ఆ పిమ్మట కుతుపనమలక యీ క్రమాన సింహాసనాలను
ఉడుగర బహుమానం వక్కలాకులున్ను నడుపుచు యీ మూడు యింట్ల
మున్ను మంచ్చి గుర్రాలుగా లక్ష గుర్రాలున్ను నూరు యేనుగ ఘట్టా
లన్ను గలవు. కాల్బలంయేలే రాజ్యముగాదు కొలిచే తురకలు లేరు.
కర్నాటకాన చతురంగ్గబలమ్ముంన్ను కలదు గనక యిక్కడి జగ 10
డాల నేపు ఆ దేశమువారు యెరుగరు, అటుగనక కర్నాటకంవారి
ముంద్దర కడమ దొరతనాల వారు నిలువలేరు- అని కన్న కార్యములు
తెలిపినంద్దులకు అంక్కుశరావు జగదేవరావు పలకరించ్చినది సరే అని
మలకరావు జెప్పినది- అని మొనలను తారశిల్లినప్పుడు తురకలు
యెదురు బలమున్ను తనబలమున్ను జూచుక జగడం శేశేదిలేదు- 15
ముష్కరముగా నడవగా యెదటివారు విరిగినట్టాయనా యెంద్దుబోయినా
విడువక నరుకుదురు- యెదటివారు హన్మత్తుగా నిల్చినట్టాయనా వెనక
బతిమాలుదురు- ఆ వర్తమానములు యెరిగి వాకిటి పిన్నపెద్దలు
నియ్యోగులు జగడం శేశేది కార్యంగాదు, తీశరమ్మంట్టే ఆ క్షణమె
తీశవచ్చే దింత్తేగాని అని మొనలకు వచ్చి వెనక తీశివచ్చినట్లు అయితే 20
ప్రభుత్వానకు కొదవగా అనే అభిమానం యెంచ్చి నిలిచేది లేదు, అటు
గనక కర్నాటకం వారు విచక్షణులై కార్యాకార్యములు తెలిశి
జగడ మిచ్చి పోరాని కార్యమైతే యెదురెక్కి నడచి ఉత్తరింతురు
కాబట్టి ప్రభుశక్తి గలదు గనక బంట్లు బయిదళాలున్ను అంద్దరున్ను
పనికివత్తురు అని దెలుపగా వద్దనున్న అమరనాయకం వారలు అంద్ద 25
రున్ను ఆ తీరున్నె అవునని విన్నపం శేశినారు గనక రాయలవారు
ముంద్దువెనకలు జగడాలు జంక్కెలు శేశి జయాపజయములలో వుండ్డిన

మీకు లెస్సాయగా తెలుసును గనక  తురకల మీది కార్యం శేయ
వలసివున్నది. అందరున్ను తలలు కడుక్కొని పయనములై
వుండుడా ప్రత్యేకంగ్గా ఉడుగర వక్కలాకులు యిచ్చి పంపినవారై
అప్పాజి మొదలయిన ఆప్తులతో మాటలాడుతా వుండ్డంగా గజపతి
5 వారల రాజ్యంబు శ్రీపురుషోత్తమాన నుండ్డింద్ది వేగులవాయువేగి
హనుమంత్తంయ్యాను మనోవేగి పురుషామృగమయ్యాను వచ్చి నిలిచి
రాయలదేవునితో విన్నపం శేశినారు గనక రాయలవారనిన వివరం-
విద్యానగరమంద్దునుండ్డి పయనగతుల తలిఙ్ఞ గజపతి రాజ్యంబ్బు శీమ
భూములున్ను చూస్తా రాజమహేంద్రిం వారు కటకము మొదలయినవి
10 వీక్షించ్చి ముకుంద్ద బాహుబలేంద్రులు జగన్నాధాన నుండ్డగా పురుషో
త్తమానాకు పోతిమి. శ్రీకృష్ణదేవుని పట్టం శృంగారమునకు పద్యం-

సి. ఏవంకఁజూచిన హేమకుంభప్రభా
మండితోజ్జ్వల సభామంటపములు
నేవీధిఁజూచిన నిభ్రరంభా సంభ
దర్పణాంచితగృహద్వారభూమి
యేచాయఁజూచిన నిభతురంగానేక
రాహుత్త సుభటవిరాజితంబు
నేదిక్కుఁజూచిన నేణనేత్రాకుచ
ఘనసారమృగమదగంధలహరి

యెచటఁగనుఁగొన్న నవరత్నఖచిత రచిత
హాటకోన్నతవివిధశృంగారవనము
గలిగి చూపట్టు దేదీప్యకలితమగుచు
శుభకరంబగు పట్టనశోభితంబు.

యిట్టి శృంగార శేఖరమయిన పట్ణమంద్దు జగన్నాయకులు మహోత్సవ
మునకు దిగ్దేశములనుండి వచ్చిన గృహస్తులు యతీశ్వరులు వానప్రస్థు
లు బ్రంహ్మచారులు బాహ్మణోత్తములు పుణ్యాంగనలుంన్న క్షత్రి

యులు వైశ్యులు శూద్రులు తక్కిన పదునెనిమిది జాతులవారున్ను
వచ్చి స్వామిని దర్శించ్చి స్వామి యొక్క ప్రిసాదం పుచు వారనక
స్వామి దేవళములో సృష్టిదోషం దృష్టిదోషం వర్ణాశ్రమ ధర్మా
సీత శుచి అశుచి కలియుగ వైకుంఠమై వొప్పుతావుండ్డే ఆ యొక్క 5
శ్రీతారకబ్రంహ్మమైన జగన్నాధుల మహిమాను అస్తలం వర్తమాన
ములున్ను ప్రిసాద ప్రభావములున్ను వర్ణింప వెయ్యి శిరస్సులున్ను
రెండువేల జింహ్మలున్ను గల ఆదిశేషునకైన లెక్కింప నలవిగావు
అన్నట్టు తోచును- ముకుంద్ద గజపతివారు బ్రాహ్మిముహూర్తాన
నిదుర మేల్కాంచిన వారై విప్రివర్యద్వయదర్శనం శేశి షోడశపాత్రు
లున్ను తామున్ను నిత్యాసారిగా రెండ్డామడ మూడామడ దూరంపోయి 10
తిరుగావచ్చి ముఖమజ్జన నామతీర్థమై గ్రిహారాధనశేశి జగన్నాధులకు
పూజావిధాన ప్రికారాన షోడశోపచార పూజలున్ను సహస్రనామార్చన
నైవేద్యాలుశేశి దీపారాధన పుష్పాంజలి శేశి ప్రదక్షిణ నమస్కారములు
శేశి పురము గృహం వెలువడి వచ్చేసమయాన పరదునేదాల్లా స్థానాపతు
లయిన అఘుపురం వారి అనంత్తోజి పంత్తులున్ను మానశింగ్గువారి 15
మాధవయ్యాను చాందువారి చెంన్నగిరయ్యాను కటకంవారి కరుణా
కరయ్యాను వోరగంట్టివారి వోబళయ్యాను ఢిల్లి సురతాణివారి థాకోజి
పంత్తులున్ను బెడదకోట వారి బేకోజి పంత్తులున్ను గోలకొండ్డ వారి
గోపోజీపంత్తులున్ను అహముదానగరం పయ్యపరాజున్ను విజయాపురం
వీరమరాజున్ను పురాణపురం పురంద్దరయ్యాను బాగానగరం భాభోజీ 20
పంత్తులున్ను మొదలుగాగల ముఖాములైన స్థానాపతులు అంద్దరున్ను
ప్రాతఃకాలమంద్దు స్నానసంధ్యావందనాదులు ఆచరించ్చి తెల్లనిపట్టు
ధోవతులు కట్టుకొని చలువలు భయిరవాసలుగా వేసుకొని శుచిరుచి
తోడట్టు దేవతార్చన సమయానకు వచ్చినవారై దేవపూజా గృహం
ముంద్దర లక్ష్మిచావడిలో కూర్చుండ్డగాను గజపతివారువచ్చి నవరత్న 25
ఖచితమైన బంగ్గారు పీటమీద కూచుండి వారివారి పురాణీకులున్ను
పిలుపించ్చుక పురాణశ్రవణమైన తర్వాత ఆశ్రుతులైన విద్వజ్జనులుం

న్ను ఆశీర్వచనపూర్వకముగా యిచ్చిన విభూతిగంధాక్షత నారికేళ లకుచ
ఫలాదులు గజపతివారు రెండ్డు చేతులా అంద్దుకొని శిరసావహించి వారల
కున్ను స్థానాపతులకున్ను జగన్నాయక ప్రసాద పణ్యారములు వక్క-
లాకులున్ను యిప్పించ్చి వాలకాను విడిదీలకు పంప్పినవారై వేరొ
5 క్క బ్రాహ్మని బిలిచి పాదప్రక్షాళనం శేశి గంధాక్షిత పుష్పములచేత
లెస్సగా పాదపూజశేశి నూరు ఘెట్లున్ను వక్కలాకులున్ను యిప్పించ్చి
ఆపాదతీర్థమున్ను పుచ్చుకొని ఆపాదరేణువు శిరసావహించి తర్వాత
తాము పాదప్రక్షాళనం చేసుకొని ఆచమనం శేశినవారై బంధుజనుల
తోడట్టు బంగ్గారుపళ్ళెరములు వుంచ్చమని ప్రసాపాటుకు కూర్చుంన్న
10 తావున వఖపదార్థమున్ను కొదవబడకుండ్డా సకలమున్ను పడ్డించ్చమని
ఆపంజ్తిని వొఖతావున తెరగట్టి ఆ తెరలో నవరత్న స్థాపితమైన పీఠ
మున సుఖాసీనులై కూచుకాండ్డగా పదివన్నె బంగ్గారున నూరుశేసుల
శేయించ్చిన పళ్ళెరమున్ను ఆ పళ్లెరం మధ్య వెల హెచ్చు గోమేధిక
ముంచ్చి పళ్ళెరములో వడ్డించ్చి ప్రసాపడేపట్ల వఖతేప కలుపుకొన్న
15 కూర మరి వొఖతేప కలుపుకోకుండ్డా భక్ష్యాలలో వొఖసారి భక్షించినది
రెండ్డోతేప భక్షించ్చకుండ్డా బానిశెలు హెచ్చరికలుగా చూస్తావుండ్టి
పరాకున ముట్టినప్పటికింన్ని బెత్తపుకోలచేత హస్తముమీద స్పరిశించ్చి
ముట్టవలదు గనక ఆరీతె తిరుగా అంట్టక ఆరోహణం శేశి యీ రీతున
సకలవస్తువులున్ను భుజియించ్చి లేచిన పిమ్మట చేతులు గట్టుకొని శత
20 పదాలు నడుస్తుంన్ను సంక్షేప రామాయణం పారాయణం అయిన తర్వాత
వస్త్రాభరణాలంకారులై పేరోలగంబై సకలమయిన వాయన్ను నగరి
వాకిట కూర్చుండ్డివుండ్డగా గజపతివారు వఖఅంతస్తు చావళ్ళోనికి వచ్చి
కూర్చుండి రెండ్డు వినియోగముల వారున్ను పిలుపించ్చి వారు వారు
వుండతగిన పునుకులు కూర్చుండ్డనియమించ్చి ప్రస్తావోచితముగా షోడశ
25 పాత్రులతోనున్ను పరస్థలపునియ్యోగులతోనున్ను సంభాషణ శేయగా
నిజాంశాహూవారి నీలాద్రిపంత్తులు వారుంన్ను యెదులశాహు కుతుపన
మలక వారి స్థానాపతులున్ను అంప్పించ్చిన కాకితములున్ను కన్నాక

టకాధీశ్వరులు కార్యముఖానకు నడిచే వారై చతురంగబలమున్ను జత శేసుక బైలుమెరసి సరదులకు వచ్చి కనుపించ్చుకునేవారై వున్నారు, యీవరకు ఉత్తరందక్షిణం దొరలకార్యాలకు హాని వృద్ధులకు సహాయం సంపత్తి నడుపుదురు. ప్రబలమైన కార్యాలయితే అంద్దరున్ను ఏక గ్రీవమై ఉత్తరం అఘుపురం వారి కార్యాలకున్ను నిర్వహింత్తురుగా- యిప్పుడు అంతేశి కార్యాలు యేమివున్నది, సరదున వుండ్డేవారు గనుక యితరం గాదు గదా, యెదులశాహున్ను నిజాంశాహున్ను కుతుపనమలక వారున్ను సరదుస్థలాలు స్థోమశుద్ధిగా యోచనశాయగా పనిలేదు అంద్దుకు మించ్చిన కార్యాలయితే అహముదు నగరం పర్యంత్తం వత్తురు, అని ఘనంగ్గా వ్రాశి అంప్పినారు- మనుష్యయత్నమున అపజయమని 10 యెంచ్చరాదు- కన్నాటకం వారికి జయం నిశ్చయం అయినప్పటి కిన్ని సరదుల మూడు తెగలవారున్ను విరిగినట్టయితే మీ శీమలన్నిన్ని కోలుబోయి మీకున్ను అవధి వచ్చును, కాబట్టి దీర్ఘయోచన విచారించ్చు కొని యాది హెచ్చరికలు గలిగి నడిపించ్చుకోవలెను, అని మంత్రాలో చనగా అన్నంద్దులకు గజపతివారు అంన్నింటికిన్ని మన పాలిటి జగ 15 న్నాయకులు వున్నారు అని మంద్దలించ్చినందులకు మూడు తెగలవారి నియ్యోగులున్ను మీకు జగన్నాయకులున్ను తమ దొరలకు కర్తరున్ను వున్నారుకా. కన్నాటకంవారు యేరుదాటి రాకుండా తమ మూడుతెగల కలిమిబలములున్ను కృష్ణదాటి రాకుండా పాళ్యం దిగి వుండ్డేటట్టు అంపు తున్నారు. మీ తెగ నాముజాదులుంన్ను సరదు స్థలాలబలవంత్తులై 20 యుండేటట్టు కట్టడశేయండా అని తెలుపగా గజపతి వారున్ను ఆరీతి అమరిక శేశే మని కొండ్డవీడు, ఉదయగిరి, బెల్లంకొండ్డ, నాగార్జునం కొండ్డ, కందూరు మొదలైన స్థలాదులకు యాది హెచ్చరికలు కలిగి వుండ్డ దగ్గదనేటట్టుగా నాముజాదులు పంపినవారై షోడశపాత్రులతో నున్ను యాది హెచ్చరికలు గలిగి వుండ్డమని మంద్దలించ్చగా వారు 25 వాల్లూ సరదులకున్ను దుర్గాలకున్ను రస్తుసామగ్రీలు అంప్పినారు. యిదిగాక ముకుంద్దగజపతి వారు షోడశపాత్రులుంన్ను తామున్ను దిన

ప్రతింన్ని గోదావరీస్నానానకు పోయి నదీస్నానం జేశి జగన్నాయకులకు
పూజానమస్కారములు శేశి బైలు మెరశి పట్ణానకు వచ్చేటందుకు
రెండు ఝాములు చెల్లును గనక తాము దిగిన స్థానఘట్టానకు చుట్టున్ను
ఘడియత్రోవకు మనిషి సంచారము లేకుండ్డా శేశి శబ్దమున్ను వినరా
కుండ్డా శేయుడా అని షోడశపాత్రులతో చెప్పి దిట్టపరచివుండ్దురు గనక
కాపుకడలు ఆయా ప్రాంత్యాదులున్ను సద్దుశేయక వుంన్న తావులనె
వుంద్దురు- గోదావరీనదికి వుత్తరపు భాగానకు యెనిమిది గుఱ్ఱాల
వారున్ను గొండ్దారంణ్యం సమీపం గనక ఆ దిక్కులనుండి మొగలాయి
గుఱ్ఱాలువచ్చి వీరువారని యెరుగరు గనక వళ కార్యంవస్తే మోసం
వచ్చునని యెంచి అవిమొనలు నాలుగు గుఱ్ఱాల వారున్ను చుట్టు రెండు
ఘడియల మేరకు మనిషి సంచారము లేక తిరుగాడుతా వుండేటంద్దులకు
రెండు గుఱ్ఱాలవారున్ను గజపతివారి సమీపాన యేటికట్టున రెండు
గుఱ్ఱాలవారున్ను యీ రీతున పదహారు గుఱ్ఱాలవారున్ను జాగ్రత్తగా
కాచుకవుందురు, గనక గజపతివారి స్థానసంధ్యావంద్దనాది కృత్యము
లున్ను జగన్నాయకుల పూజాపునస్కారములున్ను అయిన తోడుతోనె
వూరికి వత్తురు, యీరీతిని వుండగా వళనాడు గజపతివారు స్థానానకు
వచ్చి షోడశపాత్రులను యెప్పటిక్రమం చుట్టుపట్ల జాగ్రత్తగా కాచి
వుండమని పలుకరించి తాము స్నానము శేసి తమకృత్యముతోవుండ్డిరి.
యీ పదహారు గుఱ్ఱాలవారున్ను నాటిదినం యెప్పటివలెనె స్నాన
ఘట్టానకు రెండు గుఱ్ఱాలవారున్ను గొండ్దారణ్యం చాయల నాలుగు
గుఱ్ఱాలవారున్ను యీరీతున తిరుగుతావుండ్డగా అట్టిపట్ల కొండ్డలో
వుంన్న దొరలు గజపతివారు గుఱ్ఱాలతోడట్టు గోదావరీస్నానానకు
వచ్చినాడని వేగంగ్గా యీసమయమంద్దలి తురకలు నాలుగువేలగుఱ్ఱాల
వారున్ను చుట్టుకొండ్దామని యోచనచేశి నాలుగు దొరతనాలవారున్ను
వాలుకమామి లోకించ్చగా తప్పు మార్గములుగాను గుఱ్ఱాలున్ను యేను
గులున్ను రవుతులున్ను షూవుతులున్ను వచ్చేరభసం విని షోడశపాత్రు
లతో ఆ దిక్కున తిరుగుతావుంచ్దే నాలుగు గుఱ్ఱాలవారున్ను యెదు

షగా వోయి సమర మిచ్చినారు గనక నాలుగు తెగలవారున్ను నాలుగు
వేలగుఱ్ఱాలవారున్ను యీ నాలుగు గుఱ్ఱాల వారికిన్ని చుట్టుకొని
వుండ్డగా ఆ నలుగురున్ను తమ తమ గుఱ్ఱాలతోడట్టు నాలుగువేల
గుఱ్ఱాలతోడట్టున్ను తారశిల్లి నాలుగుతోవలా తరుమగా రెండుతులా
నరుకుతాపోగా వేటారుతునకలుగా గుఱ్ఱాలున్ను రవుతులున్ను వీధికి 5
నన్నూరు యేనూరు లెఖ్ఖపడసారి యీరీతి నాలుగు వీధులను వేయి
గుఱ్ఱాలున్ను అంన్ని రౌతులుంన్ను చాపకట్టుగా బడగా యధాయధలుగా
చెడి విరిగి పారిపోయి వఖతట్టు నిలిచివుండ్టగా నాలుగు గుఱ్ఱాలవారున్ను
అలశి నిలిచిరి గనక యీలోగా సరాళము పోయిన యెనిమిది గుఱ్ఱాల
వారున్ను తిరుగా వచ్చే వేళ తురకలు గుఱ్ఱాలనుగని సమరముయ్యగా 10
నిలుపలేక పటాపంచ్చలై పారిపోయినవారున్ను రణమందు మడిశిపోయి
నవారున్ను యీరీతున బహుగుఱ్ఱాలవారు మడిశి పారిపోయిరి. అని
అలశి నిలిచి నాలుగు గుఱ్ఱాలవారున్ను సరాళంపోయివచ్చిన యెనిమిది
గుఱ్ఱాలవారున్ను అంతు పంఁడ్రెండు గుఱ్ఱాలవారుంన్ను గూడి గజపతి
పార్శ్వద్దికిరాగా తురకలు తిరుగా శేఖరించ్చుకొని వెంట్టాడిరి గనక చుట్టు 15
సరాళము పోయిన రెండు గుఱ్ఱాలున్ను తూర్పు దిక్కునవుండ్డి వచ్చెను.
అంత్తలో ఆ మొగలాయిగుఱ్ఱాలు ఆ మట్టున నిలువక వెంబడించ్చుక
రాంగా గజపతివారు జూచి గుఱ్ఱాలు మించి వచ్చెను యిఖను ఇక్కడ
వుంఢ్టే మోసం వచ్చును. అవి యెంచి గుఱ్ఱాలమీది దృష్టిచేత జగన్నా
యక్షలును మరచి బహువేగాన గుఱ్ఱాంన్ని యెక్కుకొని షోడశపాత్రు 20
లతోడట్టు యేరు దాటి కొంత్తతడవువచ్చి జగన్నాయకులను మరచి
యెత్తకవస్తిమిగదా అని తలంచుకొని తిరిగి జూచే యడల గుఱ్ఱాల
వారు ఉత్తరపుగట్టుకువచ్చి సమరమందు అలశిన గుఱ్ఱాలు గనక నీళ్ళు
జూపుతావుండ్డగా వారలజూచి దేవపూజ పెట్ట్యెంతలో స్వామిని వేంచ్చేపు
శేయమరచి వుత్తపెట్ట్యె యెత్తుకవచ్చినారము అని ఆచ్చట నిల్వబడి గజ 25
పతివారు చాలా విచారబడగా షోడశపాత్రులలో వొకడు చూచి యింత
మాత్రానకు దేవరవారు విచారపడ పనిలేదు. తాను పోయి యెత్తుకో

వచ్చే నని చెప్పి అంప్పించుకొని వచ్చి నదిలో దేవతార్చన శేశినదిక్కున
చూడంగా అచ్చట జగంన్నాయకులు వేంచ్చేశివుండ్దగా జూచి యెప్పటి
వలెనే దేవపూజపెట్ట్యెలో వేంచ్చేపు చేసుకొని రాగా గుఱ్ఱాల రౌతుగని
వెంట్టాడిరాంగా వార్లను తెగవేశి యేరుదాంటి గజపతి వారివద్దికి తెచ్చి
5 యియ్యగా గజపతివారు చాలా సంతోషబడి నేడు నిదురలేచిన వ్యాళ
యెటువంట్టిదో వృధాకలహ మాయను అనిన్ని జగడము శేశినవారు
తమతో యెదుక శేయక నయ్యేకయ్యము నుంచి బహుగుఱ్ఱాలున్ను
రౌతులనున్ను నొప్పిస్తిమి అని సమర మిచ్చిన పంన్రెండు గుఱ్ఱాల
వారికిన్ని జగన్నాయకులు వేంచ్చేపు శేసుక వచ్చినరవుతులకున్ను
10 ఉడుగర వక్కలాకులు యిచ్చినారు గనక తక్కినముగ్గురుంన్ను తమకు
జగడం యెత్తుకపాయనని విచారమున వస్తావుండ్దంగా అంద్దులో నొఖ
పాత్రుడు గజపతివారి ముంద్దర రాంగా వఖవనప్రదేశమున వచ్చేటప్పుడు
వొకమాని కొంమ్మ గుఱ్ఱం మీద వుండ్డేరవుతు అడ్డబడివుండ్డె గనక
ఆమానికొమ్మను తనచేతి మర్త్యాఖండాన తెగవేశె గనక గజపతివారు
15 జూచి సంతోషబడి ఆపాత్రునికిన్ని వుడుగరలు యిచ్చెను. కడమ
రెండుగుఱ్ఱాలవారుంన్ను తమకు యేమిన్ని లేకపాయనని రాంగా
మార్గం మధ్యే నాలుగు మనుష్యుల నిలువున వొఖ చింత్తమాని కొంమ్మ
అడ్డముగా వుండ్టగా తన గుఱ్ఱాంన్ని కాలాడించ్చి గుఱ్ఱమున్ను తానున్ను
హరిణిపుటంగ్గా యెగశి చింతమానుకొమ్మ రెండుచేతులా పట్టుకొని నిండు
20 సంజ్ఞోకం గుఱ్ఱాని తొడల నిడుకొని గుఱ్ఱమున్ను తానున్ను అంత
రిక్షమున వ్రేలాడుతావుండ్దిగా ఆవర్తమానం గజపతివారు జూచి చాలా
సంత్తోషబడి ఆ సమయాన కత్తి కట్టలాలు యిరువై ముప్పై
తెప్పించి వేశి గుఱ్ఱమున్ను రౌతున్ను దించ్చి వారికిన్ని ఉడుగరలు
యిచ్చిరి. వఖగుఱ్ఱం పాత్రునికి బహుమానం లేక వుండగా గోదావరి
గెట్టున వఖకాలువ రెండు మనిషి నిలువున అరువై న నాలుగు అడుగుల
25 వెడల్పున అడ్డమై వుండ్దగా తన గుఱ్ఱాంన్ని చబుకునవేశి కాలువ
దాటించ్చగా గజపతి వారు జూచి ఆ రౌతునకున్ను వుడుగరలు యిచ్చి
అందరికిన్ని యేకముగా సంత్తోషబడశేశి మరి వేడుకగా పట్టానకు

పోయిరి గనక యివి యల్లా మేమున్ను జూచినవారమై పట్టణములోనికి
వచ్చి గజపతి వారి నగళ్ళున్ను షోడశపాత్రుల యిండ్లున్ను వాళ్ల
గరిడిన్ని ఆగరిడిలో సాధన శేశేవాళ్లనున్ను చూస్తిమి వారు శేశే
సాధన మెరవళ్ళు దేవదానవులు పహా శేయలేరు. శీమాంత్రరం జగజెట్లు
జేసే సాధనమెరవళ్ళు చూచివుందురు. ఆ తీరుగాదు. బారలేయెత్త 5
వలెను, అటువంట్టి సంగ్గడాలు యెత్తేదిగాక అడ్డముగా యెత్తుతున్నారు,
తొంమ్మిది పద్దెల గోతాం మానిసి చెయ్యెత్తుపొడుగు వాడిని యెత్తేదిన్ని
పైబడ తోసుకొనేదిన్ని గాక గోతాం తొడల నిడుము యెత్తుకొని అడ్డ
దూలానను వేలాడుతావున్నారు, అది యేలాగంట్టేను- జగడములో రౌతు
రౌతున చంకక్రనిడుకొని అమాంత్యముగా గొంచ్చుపోదురు. అదిగాక 10
గుర్రాలు విడువక పోరాడితె శక్యముగాదని విడిపోదురు. జీనాసజ్జోకం
గుర్రాలవారికి పోటువాటు తాకిన అందుకు వెరవరు. అటువంటి రవు
తును చంకక్ర వేసుకబొయ్యే మని చూతురు. ఆ సమయానకు తెలివి
గలిగి కడకతోడ బలిమిగలిగి వుండ్డేటందుకు యీ రీతున సాధనలు
శేతురు. సుమ్మి మత్తెఖండం వఖమనిషి తలమోపుకదు అమర్త్యా 15
ఖండంతీసుక నూరుగజాల గోడలు యేమిన్ని లేకుండా నరకుతావున్నారు.
చింతచేవకంబాలు ఆ ఖడ్గంచేత అరిటిబొంద్దె నరికినట్టు నరకుతావున్నారు.
గెడ్డపారలు రెండొకటికా నాటి తెగపో నరకుతా వున్నారు. వారలు
లాలావు బిల్లలు గెంప్పనిండ్డా తెచ్చి పెట్టుక నాలుగు అయిదు
తాళాలు వఖటిగా మెలిపెట్టివేస్తే కరమల వాండ్లు వాటిని విడిపించ్చలేక 20
సమ్మెటతో గట్టి విడిపించి చక్కగా కొట్టి మరుచునాటికి తెచ్చి యిస్తా
వున్నారు. మరిన్ని యినుపగుదియలు గురిపెట్టి విరువమన్న దిక్కుంన్నే
విరుస్తావున్నారు. యీ శీమజెట్లు ఆడకు వచ్చిజూచి సాధన మెరవళ్ళు
తమకు అసాధ్యమని వత్తురు. అచ్చట కలిమి బలములున్ను యెక్కడా
జూచిందిలేదు- అదిగాక గజపతివారి యెవ్వరికి త్యాగమిచ్చినా యేనుగ, 25
గుర్రం, తాళి, చౌకట్లు, దట్టీ, కుళ్లాఇ, కబాయి, వక్కలాకులు యిచ్చే
దింత్తేగాని యీ దేశంవలె వుడుగరల వక్కలాకులు మాత్రం యిచ్చి

అంపేది లేదు. అనిన్ని మరిన్ని కన్నవిన్న వార్తలు ఆలోచ
నలు మొదలుగా విన్నపంశాయగా రాయలవారితోను అప్పాజీగారు
పలుకరిచ్చిన వివరం. గజపతివారనంగ్గా పుణ్య శ్లోకుండ్డు; తురకల
వలె గాదు; దేవబ్రాహ్మణ విశ్వాసం కద్దు, అదెట్లంట్టేను- ముకుంద్ద
5 బాహుబలేంద్ర గజపతివారలకు శత్రువులైనవారు. జగన్నాయకులను
పూజించ్చే అర్చకులకు వెయ్యారులు లంచ్చమిచ్చి వొద్దికశేసుక నిత్య

## గజపతివారికి విరోధులు విషప్రయోగము చేయించుట

కృత్యమున్ను జగన్నాయకులను శేవించ్చి తీర్థప్రసాదములున్ను పుచ్చు
కొనిగాని ప్రసాబడేది లేదు. గనక వళునాటికి తీర్థములో వత్సనాభము
కలిపి యిమ్మని నియమించ్చగా ఆ అర్చకులు ఆద్రోహానకు లోనై ఆ
10 తీపనసే తీర్థములో వత్సనాభము కలిపి స్వామి సన్నిధిని గజపతివారికి
తీర్థం ప్రసాదించ్చే వ్యేళ నంబివానికి చేతులు వణకసాగెను. అప్పుడు
గజపతివారు చూచి చెయ్యి వణక నిమిత్యమేమి అని అడుగగా భయ
స్థుడై చెప్ప వెరచి వుండ్డె గనక గజపతివారు జూచి యేలవెరచేరు
కలిగిన అర్ధం నిలువరముగా చెప్పమనంగా ఆరినృపాలులు శేయించ్చిన
15 కార్యం సవిస్తరముగా చెప్పెను. గనక ఆ విషోదకము తెమ్మని చేత
తీసుకొని అప్పుడు చెప్పిన శ్లోకం—

> ఆరిర్మిత్రం విషం పథ్య మధర్మో ధర్మతాంవ్రజేత్
> అనుకూలే జగన్నాథే విపరీతే విపర్యయమ్.

అనే శ్లోకం చదివి తీర్థం పుచ్చుకోగా ఆ విషం జీర్ణానకు వచ్చెను.
ఆ వార్త లోకప్రసిద్ధమాయెను. వారు అటువంటి దైవజ్ఞులని గజపతి
వారి గుణాతిశయములు యెంచ్చినవారై వేగురులకు వుడుగర వక్కలా
20 కులున్ను వెయ్యేశిపట్లున్ను యిచ్చి యింకా ఆయాదేశములకు పోయి

నానాటి వార్తలు దెలిసివచ్చి చెప్పుమని వాయువేగి హనుమంతయ్యను
మనోవేగి పురుషామృగయ్యనున్ను అంప్పించ్చి రాయలవారున్ను
అప్పాజివారున్ను ఆప్తాలోచనగా దిక్కుల వార్తలు విన్నారేకా ముందర
తురకలమీదికి కదలి పొయ్యేకార్యములకు ఆలోచన యెంది అని అడు
గగా అప్పుడు అమరపు దొరలనున్ను ఆయిత్తపాటుతో వున్నారు, 5
దండ్డు యాత్రలకు లగ్నం వుంచ్చేటందుకు జోస్యులను పిలుపించ్చి

## రాయలు తురకల మీఁదికి యుద్ధమునకు వెడలుట

ముహూర్తం వుంచమని ఆనతియ్యగా ఆ తీరుననె అప్పాజిగారు జోస్యుల
రప్పించ్చి సుదినం సుముహూర్తం సులగ్నం కూడినవేళ వెలిగుడారము
వేశేటట్టుగానున్ను పాళ్యం కదలిపొయ్యేటంద్దులకున్ను ప్రవేశానకున్ను
లగ్నం నిశ్చయించ్చిక రాయలవారికి యెరుక శేయగా ఆ తీరువనె, 10
వెలిగుడారం వేయించ్చమని ఆనతిచ్చినారు. గనక ఆదేరీతికి అప్పాజి
రాయలవారితోను తురకాణ్యంమీద దళమెత్తేటప్పుడు బోయదొరలంద్దరి
నిన్ని రప్పించ్చి పదునెనిమిది కప్పణాలవారినిన్ని నగరవిందు బెట్టించ్చి
హరిబాణం కొమాళ్ళతోను కార్యముఖానకు తురకాణ్యం శీమలోను
ము నకలుగా బోయి దిగి మూడేశి ఆమడదూరం పారిసరాళఁపోయి మను 15
ష్యుల, పసలం, ప్రాయలు, గొర్రెలు, మేకల, గుర్రాల వుండ్డకుండా
కొళ్ళబెట్ట మనింన్ని యెదిరితోడట్టు సకల సన్నాహములతోడట్టు బయలు
మెరశి వెలిగుడారమునకు వచ్చి నిలిచి దొరమన్నీలనున్ను, రవుతుల,
మావతులనున్ను, వినియోగం పైకంవాల్లనున్ను, మునుపటివారు
వెనకటివారు, యెడవంక్కంవారలనున్ను అందరినింన్ని రప్పించుక 20
వారివాల్లతో మాటపలుకులు ఆడి మీమీస్తోమములతో ఆయత్తపాటుతో
రమ్మని బలవంక్కం అమరనాయకం వాల్లతోనున్ను నగరికై జీతం
వారితోనున్ను నగరి తొంమ్మిది సంప్రతుల వారితోనున్ను నగరి లెఖ్క
ప్రకారానకు యేనుగ, గుర్రాలు, రౌతురాణువ, గలట్టుపైదళం వారినింన్ని
గణితి తీసుకొని కన్నాటకానదం స్వతంత్రస్వామ్యం కావలికట్లు 25

గుంపుల వారినింన్ని పాళ్యగాల్లనుంన్ను నగరిలెక్క ప్రకారానకు
అంద్దరినిన్ని రప్పించ్చి పయనం తర్లడా అని కరణీకులతోనుంన్ను,
రాయసం, కటికం, దినసరి, అవసరం, వినియోగపైకం వాల్లతో
నున్ను ఆనతిచ్చి కొంత్త గుర్రం రాణువనున్ను విజయనగర పట్టణము
నకు రక్షణియ్యముగా సాళువ తిమ్మరసయ్యగారినింన్ని పట్ణమంధ్దువుంచ్చి
దండ్డుయాత్రకు జయధ్వనిగా దిక్కులు పిక్కటిల్లేటందుకు భేరితాడనము
శేశి డమామి టోకించమని ఉత్తరవు శేశి రౌతులకు మావుత్తులకు అమర
నాయకంవార్లను, ఆళ్లుండ్లు, కొమాళ్ళకు, రాజులకు, జట్లకు, కంమ్మ
నాయకులకు అందర్లినిన్ని పయనం జెప్పి రంమ్మని కటికాలవారికి వుత్త
రవుయిచ్చి తాముంన్ను భోజనం జేసుకొని మూడో నగరా టోకింంచ్చమని
ఆనతిచ్చి గుర్రం యెక్కికొని పయనంగతుల కడలి వుమ్మత్తూరు శివ
సముద్రానకు వచ్చి గంగారావు వూడెముమీంద కార్యముశేశి వుదరదోలి
ఆస్థలాలు వక్కనాటనె సాధించ్చి అక్కడ వూడిగాలవాల్లను వుంచ్చి
అందునుండి శ్రీరంగపట్టం కోటకై చీని కోటకొత్తళములు జూచి మీద
ఆదిరంగనాయకుల శేవించ్చి యిక్కెరి ఆ రంగ్గానకు వచ్చి సుక్కల
నాయడికి నాయడిమూకలను జూచి విజయాపురం సరుదుల నడవమనంగ్గా
సరుదుస్థలాలవుండ్డి గురిమనుష్యులనుంన్ను దుర్గాలవుండ్డేరాణువనుంన్ను
నిర్వహించ్చలేక విడిచి పారిపోసాగిరి. గనక అందుండ్డి రాచూరి,
ముదికల్లు, అద్దంకి, ఆదవని ఇవి మొదలైన స్థలాదులకు ఠాణ్యములు
వుంచ్చి దినమొక్కటిగా సారినడవగా స్థలముల వుండేవారు మునుకలు
గానె వచ్చేదళాన్ని జూచి పారిపోయిరి. గనక సాధించ్చిన స్థలములకు
ఠాణ్యమువుంచ్చి గోలకొండ్డవారి సరదుస్థలాలకై నడవంగా అక్కడ
మూడు తెగాల రౌతులుంన్ను యెదురించ్చి యేరుదాటి వచ్చి మోర్చావేశి
పాళ్యముదిగినారు గనక ఆ వర్తమానం తెలిశిన వేగర్లు వచ్చి రాయల
దేవునితోను తురకలు లక్ష గుర్రాలుతోడట్టున్ను వెయ్యియేనుగులతో
డట్టున్ను కృష్ణదాటివచ్చి పాళ్యందిగినా రని వారి కలిమి బలములున్ను
వారి పృధుతలున్ను పలుకరించ్చి వారి శీమలో మన తెగలవార్లు

లోజొచ్చి మూడామడకు మూడామడ వుండ్డే గ్రామాదులు కొళ్ళబెట్టే
దిన్ని పాతరలు శోధించి ధాన్యదపసములు యెత్తేదిన్ని గ్రహస్థుల
ఇండ్లలో జొచ్చిపోయి ముండ్డువెనక దాంచియుంచ్చిన చంద్దాన నిక్షేపములు
యెత్తేదిన్ని పూళ్ళుపల్లెలు కాల్చేదిన్ని పసలం, బ్రాయలు, మేకలు,
గొఱ్ఱెలు, గుఱ్ఱాలున్ను పట్టుకవచ్చి కాసుకు వకటిగా అమ్మేది యీరీతిగా 5
నిర్నామం శేశేదిన్ని దుర్గములలో వుండే వార్లెల్లా జతనమైవున్నార
నిన్ని విన్నపం శేయంగా రాయలవారు విని తురకలు కృష్ణవేణిదాంటి
వచ్చి దెరిజావేశి దిగేట్టా అని ఆగ్రహించుకొని అమరనాయకం వారలలో
పెంమ్మసాని రామలింగ్గమనాయణ్ణి బిలిచి తురకలు కృష్ణవేణిదాంటి వచ్చి
దెరిజావేశి పాళ్యం దిగినారట యిందులకు యేరీతున నడవవలెనో అని 10
అడిగినందులకు - తురకలకార్యమనంగా యెంత్తమాత్రం - దేవరవారి
ప్రతాపమువల్ల దెరిజాతాళ్ళు తెగకోశను. అప్పుడు భేరితాడనంశేశి నడి
స్తేను తురకలు మూడుతెగలవారున్ను పటాపంచ్చలై విరిగి యధాయధలై
తమతమస్థలాదులుకు పొయ్యేటట్టు శేశెను. యిదిగాక యీ గ్రీష్మకాలాన
దగదప్పులకు తాళి వాండ్లు నిలువలేరు. అని విన్నపం శాయగా తనకు 15
శెలవులకు యిమ్మనగా రాయలవారు చాలా సంత్తోషబడి రామలింగ్గమ
నాయనికి పట్టీలు ఇచ్చి అంప్పగా రామలింగ్గమనాయుడు వెలువడిని వచ్చి
తన తెగకమ్మ దొరతనాలవారి నంద్దరిని రప్పించుక వారలకున్ను
చెయ్యెత్తిమ్రొక్కి యిన్నాళ్ళున్ను రాయలవారి సంబ్బళములు బ్రసాదబడి
బ్రతికితిమి. యేలినవారికి యిప్పుడు కార్యసరవికలిగి అని మొనకువచ్చి 20
యెదటివారిమీదికి నడువమని బహుమానం వక్కలాకులు ఇచ్చి పంప్పగా
వస్తిమి. యీ బహుమానం మీది గవక మిమ్మునసుండి మానుషము
లున్ను ముంద్దరికి కంమ్మకులం వారికి బ్రతుకలున్ను బ్రతిష్టలున్ను
కీర్తిమాటవాసులు కలుగశేశేటంద్దులకున్ను స్వర్గాదిభోగములు అనుభ
వించేటందులకున్ను తనతోకూడ నడచేవారెల్లా నడువండ్డా తక్కినవారె 25
ల్లా భారులో నిలువుడా అని తొక్కి నడువగా ఆయన నంతరించ్చిన యెన
భైవేల చివ్వలవారున్ను రణపెండ్లికొడుకులై యిక్కడి ఆళపాళలు

విడిచి కయ్య మండ్దేదే వియ్యమండ్దేదిగా యెంచ్చి అని మీది దృష్టిచేత
రామలింగమనాయని వెంబ్బడిని నడువంగా తురకలు యీవార్తలువిని
డెరిజావద్ద జీరాసంజ్జోగంతో విత్సుకత్తుల రౌతులు అరవై వేలున్ను వారిని
చుట్టుక నిండుసంజ్జోకం గుర్రాలు పదివేలకున్ను వాల్లగాను అనుభవిం
5 చ్చుక యుండ్డె మదహత్తులు వెయ్యింటికిన్ని యీరీతిని డెరిజావద్దవుంచ్చి
మూడు తెగల తురకలున్ను తమ తమ పాళ్యములో ఆయత్తపాటుతో
జాగ్రతగలిగి యుండగా రామలింగమ నాయుడు తురకల పాళ్యంవారి
పమీపానకు పోగానే గుర్రాన్ని కత్తికేడం తీసుకొని యేనుగల బారుమీద
శైలతటమునకు లంఘించ్చు సింహ్వాపుపిల్లల చందాన తొక్కినడిచి
10 మదహత్తిల తొండముల ఖండములుగా నరికి మావటీలను యీటెలచేత
కుమ్మి తోయగా యేనుగలవారి మీందికి నడవగలవారు గుర్రాల పక్కెర
లెత్తికురుచ యీటెలతోనున్ను పిడి యీటలతోనున్ను పంద్దిబల్లెములతో
నున్ను గుచ్చి తోశేదిన్ని దోసకాయల చంద్దాన వేటారుతునకలుగా
నరికేదిన్ని యీరీతు నొప్పించగా గుర్రాలవారు వెనకముందై పార
15 సాగెను. అప్పుడు నాలుగువేల గుర్రం చాపకట్టుగా బడగా ఆటువెనక
విచ్చుకత్తుల రవుతులమీద నడిచి జగడమియ్యగా సరిచావులుగా ఆరు
వేలకు నాలుగువేల రవుతులు పడిరి. అంతట రామలింగమనాయుడు
జిరీజుతాళ్ళు తెగకోఇంచ్చగా డెరిజా నేల కూలిన క్షణాన్నె కృష్ణరాయల
వారు భేరితాడనం శేయించి మదహత్తి నెక్కుకొని ఉభయచ్చత్రము
20 లతోనున్ను మకలటెక్కెములతో నూటయిరువై ఘట్టములు యేనుగ
లున్ను ఆరవై వేల గుర్రాలున్ను అఇదులక్షల పాయదళమున్ను పోట్ల
ముగా నడిచిరి, గనక ఆ క్షణాంన్నె కృష్ణవేణి వుభయతీరాలున్ను
ప్రవాహం నిండి రాసాగెను, జగడముఖానకు తురకల యేనుగల మొన
చేస్తే గ్రీష్మకాలం యెండ్డచేతను డస్సిన యేనుగలు గనక దగదప్పి
25 పుట్టి చల్లగాలిచేత కాలుజారి కృష్ణవేణిలో బోయిపడెను. గుర్రాల
రౌతులు యేరు నీళ్ళు వచ్చెను యివతలనుండ్డి కార్యం కాదని గుర్రాల
వారు యేనుగుల వెంబ్బడినె తిరిగి మొదటి దొరలు ముగ్గురున్ను

దై వీకంగా పెదతలపోటుగా ప్రవాహంవచ్చె గనక యిక్కడను పాళ్యం
దిగి జగడమిచ్చేమంట్టే రస్తుసామగ్రీలున్ను అమరదు. అని దొరలు
ముగ్గురున్ను నియ్యోగులతో ఆలోచనగా వారి అన్నిటికిన్ని యేరు
దాంటి ఆవలనిల్చి సరిపోయినట్టు నడిపించ్చుకొందాము శీమకు తిరుగగానె
యేరు నిండ్దారుగా వచ్చెను రాయలవారున్ను వెంబ్బడించ్చి నడిచి జగడం 5
శేయగా అందరున్ను విరిగి పారిపోయిరి. కొందఱు యేట్లో బడిరి గనక
సగం రెండ్డుపాళ్ళు యేటివరద పోయిరి. వఖపాలు దక్షణపు గట్టున నిలి
చెను. ఏనుగ లన్నింన్ని నీళ్ళ విడిచి గట్టుకు రాకపాయను. గనక
మావటీలు యిఖను నిలువకూడదని దిగి ప్రాణాలతోడట్టు తప్పి పారి
పోయిరి, మూడుతెగల తురకలున్ను అంతట యేనుగుల మీదనుంచిన్ని
వోడలమీదికి దిగి వుత్తరపుగెట్టు యెక్కి ఆలోచనపరులై యీనమయాన
నిలిచేది కార్యం కాదని తమతమ స్థలాదులకు హత శేషులైనవారి
గూర్చుక గట్టెక్కిన గుర్రాలతోడట్టు విజయాపురం, గోలకొండ్డ, అహ
ముదానగరం చేరబోయినారు. గనక కృష్ణరాయలవారు కృష్ణవేణి
వొడ్డుకువచ్చి మూడు తెగల తురకల యేనుగ గుర్రాలున్ను నగర కట్టి 15
పెట్టమనిన్ని గుడారాలు నిశానులు నగారా మొదలైనది మొదట
జగడాన దొరికిండ్డి గనక అదంత్తానగరకట్టమని అప్పాజి మొదలయిన
నియ్యోగులతోనున్ను ముక్కుతిమ్మన్న మొదలయిన కవీశ్వరుల
దిక్కుజూచి నేటిజయం యేరీతు అని అడిగినందులకు ముక్కు తిమ్మన్న
చెప్పిన పద్యం-

క. నరసింహకృష్ణరాయా
దురమున నీపేరు పేరఁ దురకలఁ ద్రుంచెన్
గరిరాజవరదుఁ డవనీ
కరిఘటములు నిన్నుఁజూచి గ్రక్కునఁ దిరిగెన్.

అని ముక్కు తిమ్మయ్య అలసాని పెద్దన్న మాదనగారి మల్లయ్య
మొదలైనవారు విన్నపం శేశినంద్దులకు అప్పాజి, అయ్యమరసు, కొండ

మరను, బాచరనుగారున్ను అనేక స్తుత్యములుగా విన్నపంజేశి కృష్ణవేణి యీసమయాన నిండ్డేరు వచ్చినందువల్ల మ్లేఛులకు అపజయమై నిలువ లేక తమతమస్థలాలకు పోయినట్లాయను. యేరు నీళ్ళు వడిసి కాలినడ అయినతోడుతోనే ముంద్దరకార్యము ఖానకు నడవవలెను. యీ ఆషాఢ 5 శ్రావణాలు రెండు నెలలున్ను యేటికి దక్షిణముగానున్నె తురకల దుర్గాలున్ను కోటస్థలాలున్ను గజపతిదుర్గములున్ను స్థలములున్ను చేకూచుక ఆ తర్వాత అహముదానగరం పర్యంతమున్ను పోయి రావలెను. అని విన్నపం శేశినంద్దులకు కృష్ణరాయలవారు మీరు చెప్పి నది కార్యసరవి అవును. మునుకలుగా యేరుదాపిటి మ్లేచ్ఛులరాజ్యా 10 నకు కదలిపొయ్యి నట్టాయనా గజపతివారి శీమలోనుంన్ను ఉదయగిరి, కంద్దూరు, కొండ్డవీడు, బెల్లంకొండ్డ, వాగార్జునం కొండ్డ, వినుకొండ మొదలైన దుర్గాలలో వున్నవారు మనదండ్డుకు రస్తుసామగ్రీలు రానీకుండ్డా అరికట్టుదురు. ఆ రీతిగాకుండా మునకలుగా ఆయాస్థలాలు సాధించి ఆయా దుర్గాలను మనతెగ తాంణ్యములు వుంస్తే రస్తుసామ 15 గ్రీలు నడుచును. అని ఆనతిచ్చినారు గనక వద్దనున్న పిన్నపెద్దలు కార్యముగా యెంచి ముంద్దరతరలే యత్నం గనవలెనన్నారు. కాబట్టి రాయలవారు రవుతు రాణువ దొరమన్నీలకు అంద్దరికిన్నీ పయనం చెప్పించ్చి భేరీ ఢమామి కాహాళాలవారిని రప్పించ్చి నగారా కూచి శేయించ్చ మని వారలా భేరిపూజ సేయించ్చి ఠోకించ్చిన జయధ్వనికి 20 పద్యం—

క. ధాత్రీశుఁ డంత దిగ్జయ
యాత్రానంరంభజృంభియటోపగతిఁ
శత్రువుల గుండె లవియఁగ
జైత్రప్రస్థానభేరి సేయించుటయుఁ.

ఉ. భూకంపంబు జనింప రొప్పఁగ మహాంభోరాసు లుప్పొంగఁగా
లోకాలోకము లెల్లఁ బెల్లగిల ముల్లోకంబు ఘూర్ణిల్లన

స్తోకవ్యాప్తి నజాండగోళదళనోద్భూతధ్వనిం బోలె వ
ర్షాకాలాంబుదగర్జితధ్వనిసమారంభంబులై మీఱఁగన్.

వారలున్ను పయనమని దెలిశి ఆయత్తపాటున కాచివుండగా రాయల
వారు బయలుమెరశి గుఱ్ఱంయెక్కి సకలసన్నాహములతోడట్టు సకల

## రాయలవారు ఉదయగిరి మొదలయిన దుర్గముల మీఁదికి దండెత్తుట

దళసమేతుడై గుత్తికండ్డికోటమార్గముగా ఉదయగిరికివచ్చిన హమ్మీరు
అనే దుగ్గణముపై లగ్గయెక్కగా దుగ్గణములలోనివారు తమచేతనై
నట్టు సమరంశేశి మందుగుండ్డు శలపై నిర్వహించ్చ లేక కొలిచ్చినారు
గనక కాలున దించ్చి శత్రుజనాలు వెళ్ళిపోయిన తర్వాత రాయలవారు 10
దుగణంపై నెక్కి జూచి యింత రస్తు వుండ్డగా యేమని కొలిచ్చి వెళ్ళి
పోయిరి. అని ఆశ్చర్యబడి కంప్పన్నను దుగ్గణమందు తాణ్యాం
వుంచ్చి కందూర్కిపోగా ఢమామిధ్వని విన్నక్షణాన్నె ఆ స్థలంవారు
వెళ్ళిపోయిరి. గనక ఆ స్థలం తొక్కిచూచి అచ్చట తాణ్యాం వుంచ్చి
కొండ్డవీటికి కదలిపోగా దుగ్గణములలో నున్న వూడెములవారు సము 15
ద్రం పొంగి వచ్చేరీతిని సేనాసముద్రం కదలివచ్చేదిగని కాలుధూళి
మిన్నుముట్టి సూర్యరశ్మి గప్పినన గని స్థలములు విడిచి పొయ్యేవారు
న్ను కాహాళధ్వని విని పారేవారున్ను యీరీతున కొండపీడుశీమ కోటలు
దుర్గాలలోనున్నవారలు పరాభ్రష్టులై తమతమ దొరలున్ను తావుకు
పోసాగిరి. బోయదొరలు పదునెనిమిది కప్పణాలవారున్ను మూడులక్షల 20
పాయదళమున్ను కొండ్డవీడు, కొండ్డపల్లె, బెల్లంకొండ్డ, వినుకొండ్డ,
నాగార్జునఁకొండ్డ మొదలయిన దుర్గాలకు యేలుబడియైన శీమ లాద్యాం
త్తం నిపాతం శేస్తావున్నారుగనక ఆయాశీమలోగల ప్రజలందరున్ను
సకలమును కొళ్ళయిచ్చి మిక్కిలి అంద్దుపడి అయిన దుగ్గాణాలు జేరినారు-
అవి వేగల్లుగా అక్కడగ్గడ నడుమ యోగక్షేమములు క్షణేక్షణే వచ్చి 25

విన్నపం శాయంగా విన్నవారై తిరుగా వాల్లను ఆయా తావులకు
అంప్పించ్చి కొండ్డవీంటికి పోయి జగడమియ్యగా క్షోనమూకలవారు
విరిగిన మాత్రాన్నె కొండ్డవీండు కోటలోనివారు తీశిబోయినారు గనక
ఆ దుగ్గఽంమీద సమరం శేయంగా దుగ్గఽంలో వున్నవారు తమచాత
5 అయినమట్టు వక టిన్నర దినం పోరాడి రాత్రి దుర్గం విడిచిపోగా మరుచు
నాడు దుగ్గఽమెక్కి జూచి ఆ దుగ్గఽమంద్దు కొండ్డయ్యను తాణ్యం
వుంచ్చి వినికొండ్డకై నడవంగా వారు యీ వార్తలు విని స్థలం నిర్వ
హింపనేరమని యెంచ్చి మునకలుగా వెళ్ళిపోయిరి. అక్కడ భాస్క
రయ్యనువుంచ్చి బెల్లంకొండ్డకై నడవగావారు పిరంగ్గినాదం విని బెల్లం
10 కొండ్డవారు పారిపోయిరి. యిచ్చట వీరభద్రయ్యను తాణ్యముంచ్చి
నాగార్జునఽకొండకై నడవగా వారు నానాప్రయత్నముల నాట మస్నాఽ
ట పోరాడి చేతగాక తమనాటికి పోయిరి. గనక అచ్చట అయ్యలయ్యే
గారిని వుంచ్చి అహమ్ముదానగరానకు నడవగా కొనమూకలవారు వెలి
పాళ్యాలు చొరబడి చెర జోరాబట్టీ చాలా కంపోలం శేయంగా కోటలోని
15 గుర్రాలు వారు వెళ్ళివచ్చి యెదుటనిలిచి జగడమియ్యగా మూడుం
ముక్కాలు ఘడియలలోగా రెండువేలుంన్నెనమంన్నూరు గుర్రాలున్ను
అంన్నియు రౌతులున్ను చాపకట్టుగా మృతంబొంద్దిరి. గనక యీ
సమాచారం కోటలోవున్న మొదటి దొరలయినవారు విని ఇఖను మనం
కోటలో నిలిచి వున్నట్టయితే చేపట్టుగా పట్టుకబోదురు. అంద్దునుంచ్చి
20 చాలా అవమర్యాద అని యెంచ్చి యేమి బోయినా బోని అని కోట విడిచి
పారిపోయిరి. గనక రాయలవారు ఆ కోట యిడియకొట్టించ్చి ఆ పట్నం
యెంత్తమేరో అంతమేరానున్ను వెలిపాళ్యాలుంన్ను దున్నించ్చి ఆమి
దాలు జిల్లేళ్ళు విత్తించ్చి అంద్దుండ్డి గజపతి రాజ్యానకై నడవగా అప్పాజి
రాయలవారితో మూడుతెగల తురకల రాజ్యమంత్రాక పోలం శేశి వారి
25 దుగ్గాఽలున్ను స్థలాలున్ను కట్టుకొని అహమ్ముదానగరం ఆమిద్యాలు
విత్తించ్చి గజపతివారి గిరిదుగ్గఽం జలదుగ్గఽం స్థలదుగ్గఽం వన
దుగ్గఽం యివి అన్నియి ఆక్రమించ్చినట్టాయను, ముంద్దర కదలి

పోయ్యేది కార్యం కాదు. కనమలు దాటిపోవలెను, కనములలోనున్న
గజపతివారి తెగవారు సామగ్రీలు రానియ్యరు. అని మంత్రాలోచనగా
విన్నపం శేశినంద్దులకు ఆ విశదం రాయలవారు చిత్తానవుంచ్చుక ముం
దర కదిలిపోవలెననే దృష్టిని తమకు యెదురు లేదని యెంచ్చి అప్పాజీ
గారు విన్నపం శేశినంద్దులకు అవుగాములు ఉత్తరవియ్యక కదలిపోగా
గజపతివార్రి కనమలనడమ పోయ్యేటప్పుడు చితాపుఖానుడసేవాడు అర
వై వేల శింగ్గాణి రౌతులతోడట్టు కనుమ మార్గామున పోయ్యే రౌతు
రాణువమీద చిత్తవాన గురిశినరీతి అమ్ముల గుర్రియించ్చగా అంమ్ముల
నుండ్డి తప్పించుకొనువారున్ను ఆయంమ్ములకు యెదురై నిలిచినవారున్ను
ముంద్దు వెనక తెలియక నిలిచినవారున్ను ఆడాడ దిగ్భ్రిమ పడివున్న
వారున్ను యీరీతిని వుండ్డగా చితాపుఖానునికి యెదురులేదు గనక జగడం
శేయగా ఆ సమయాన కన్నాఁటకం కై జీతం రౌతులు చితాపుఖానునికి
పెడతలపోటుగా యిరుపార్శ్వాల కనమల పొడుపున నెక్కి చితాపుఖా
నుని వెనకదిక్కులకై వచ్చి శింగ్గాణులనుతనున్ను ఖడ్గములచేతనున్ను
బరిజీలచేతనున్ను వేటారు తునకలుగా నరకగా చితాపుఖానుని తెగలకు
కనుమలో నిలువకూడక విర్రిగి పారగా వెంబ్బడించ్చి తరుముకపోయి
వారిని దుర్గ్గంచార దోలి తిరుగావచ్చిరి. గనక అప్పుడు చితాపుఖానుని
తెగలో యిరువై మూడువేల స్తోమమున్ను నాల్గువేలగుర్రమున్ను వశ
తావున్నె మడిసి అటుతర్వాత నమదళం ఆద్యంతమున్ను ముంద్దరకదలి
పోయిరి. గనక ఆ కనుమల్లో ముప్పైవేల స్తోమాన్ని తాణ్యాం వుంచ్చి
అవతల గజపతివారి సీమాద్యంత్తం నిపాతం శేసుకపోయి పోట్నూరి
సింహాద్రివద్ద పాళ్యం దిగిరి. గనక యీ వర్తమానం గజపతివారు
విని యేదులసాహు, కుతుపనమలక, నిజాంశాహు వారు ముగ్గురున్ను
నిలువలేక తిరిగి స్థలాలువచ్చిరి. గనక ముగ్గురు దునెదాల్లఁనున్ను
పీగతోలిన బలవంత్తులతో తాము ఏకదేశాన పోరాడేది యేరీతు అని
ఆప్తులతో ఆలోచనశేయగా వారు గజపతివారితోను మన సింహాసనా
నకు షోడశపాత్రుల యొక్క భుజబలపరాక్రమాన యీ క్షోణీచక్రం

యేలుబడికి వచ్చును. యీవరకు కన్నాటకంవారు మనశీమలోనికి
వచ్చినవారుగాదు. పెద్దగజపతివారువుండేటప్పుడు వారు సేతుయాత్ర
కొరకై కంచ్చి, కాళహస్తి, అరుణాచలం, చిదంబ్బరం, జంబ్బుకేశ్వ
రం, కుంభకోణం మార్గముగా శేతువుకు పొయ్యేటప్పుడు వెంట్టవచ్చిన
రౌతులు రాణువవారు రాయలవారి శీమలో గల శివస్థలాదులున్ను విష్ణు
స్థలాదులున్ను తటాకాలున్ను అగ్రహారాలున్ను పల్లెలున్ను వనము
లున్ను హానిశేశి వచ్చి వుందురు, అదిగాక వారిశీమలోకొన్ని స్థలాదు
లున్ను అక్రమించి మన్ననమర్యాదలు తప్పించ్చి వుందురు గనక అవి
మనస్సున నుంచ్చి కృష్ణరాయలవారు కారణీక జన్మలైనవారు కాబట్టి
పూడువిప్పే కొరకు మ్లేఛులయిన తురకలను వీగతోలి మనశీమలోనికి
వచ్చి గిరిదుర్గ్గ స్థలదుర్గ్గ జలదుర్గ్గ వనదుర్గ్గములను యేండ్ల
పరువళ్ళు పోరాడిన సాధ్యంకాదు- అట్టి దుర్గ్గాలను కోటకొత్తళాలు
దినమొక్కటిగా సారిమార్గ్గముచేత అక్రమించ్చి తక్కిన కోటలు ధూళి
కోటలుగా సాధించ్చినవారైరి గనక మనిషిమాత్రంవారు గారు. విష్ణు
అంశ, అప్పందులకు గజపతివారు ఆరీతి అవును,తమపెద్దలు కన్నా
టకానకు అపరాధం తలంచ్చి నందువల్ల వారు బలవంత్తులై
మనరాజ్యం పీద దండెత్తి వచ్చినారు. వారిని జయించేటందులకు
జయాపజయం కనవలెనని షోడశపాత్రులను పిలువనంప్పగా- బలభద్ర
పాత్రుడు, దుర్గ్గాపాత్రుడు, భీమాపాత్రుడు, ముకుందపాత్రుడు, భీకర
పాత్రుడు, భైరవపాత్రుడు, రణరంగపాత్రుడు, అఖండపాత్రుడు,
మురారిపాత్రుడు, వజ్రముష్టిపాత్రుడు, తురగరేశంపాత్రుడు, అశనీ
పాత్రుడు, అసహాయపాత్రుడు, గజాంకుశపాత్రుడు, మృగేంద్రపాత్రుడు
మొదలయినవారు పదారుపాత్రులు వచ్చి గజపతివారి పొడగనగా వార
లను కూచ్చుండ నియమించ్చి వారలతో ఇదివరకున్ను నడచిన కార్యా
లన్నింన్ని విన్నారేకా- కన్నాటకంవారు కనముల దాంటి అహ
ముదానగరానకు వచ్చి నిపాతం శేశి పోట్నూరి సింహాద్రివద్ద శిబిరం దిగి
నారు, యిక్కడికి నాలుగు క్రోశములమేర వచ్చివున్నారు; రేపుమర్నాట

దాటిపూర్గణంగా గుఱ్ఱం రాణువ వచ్చును. అప్పుడైనా కనుపించుకో
వలెగాని మొదటిస్థళం విడువరాదు, ఆలోచనగా ఆడిగినందులకు షోడశ
పాత్రులు యీ ఆలోచన మునుపు మూడు తెగల దునేదార్లున్ను కర్నాట
టకం వారికి వెముఖాసరించ్చి నిలువలేక తమతమ స్థలాదులకు పోయి
నందువల్ల యెవ్వరినిన్ని యెంచ్చక తురకారణ్యం శీమలు దాంటి మన 5
గడికనములున్ను జొచ్చి పట్టణం సమీపానకు వచ్చినారు- యీ సమయాన
మనం ఆ మూడు తెగలవారికిన్ని చెప్పి అంప్పించి వారు నరుదులుం
న్ను బలవంతముగా వుండ్డ మని మనమున్ను యిక్కడను కనుపించ్చు
కొంటే యెంద్దుబోనున్నారు- కాళహస్తి ఆరభ్యం జగంన్నాధంపర్యం
తం మనశీమ- ఆట్టిపట్ల యెదురు యెంచ్చక లోతు యెరుగరు గనక 10
లోజొచ్చి వచ్చినారు, మంత్రాలోచనమీద వచ్చిన కార్యం కాదు,హామిక
మీదికార్యం గనక వారికే ముప్పు, మన కార్యం జయమౌను; వారు
యాయులు మనం స్థాయులు. మనశీమప్రజలకు వారలవీంగతోలి స్థలా
లున్ను నిలుపవలెనని ఉత్సాహపుష్టి గనక ఇట్టిపట్ల మనం కనుపించు
కొంట్టేను కర్నాటకంవారు నిలువలేక తమ శీమకు పొయ్యే మని 15
బోదురు. రేపు ఉదయాంన్నె స్వామివారు రౌతురాణువకు వక్కలాకు
లిప్పించ్చి అంద్దరినిన్ని ఆయత్తపడి రమ్మనడా- మీరు వఖప్రదేశాన
రాజచిహ్నాలు పట్టించ్చుక ఉన్నతస్థలానవుండ్డి వేడుకచూస్తేచాలును.
తాము పదారురమున్ను జగడమిచ్చిన కర్నాటకం వారిని పారదోలి
వారి బొక్కసభండారములున్ను యేనుగ గుర్రాలున్ను మొదటిదొరల 20
నున్ను హస్తగతం చేసుకవచ్చి సముఖానవుంచ్చే మని వారువారలు
తమతమకు తోచినట్లు సాహసపరాక్రమములున్ను యుద్ధరంగమంద్దు
వేటారు తునకలుగా నరికేమనిన్ని మదహస్తుల తొండ్డములతో కూడా
కొమ్ములు ఖండ్డించ్చే మనిన్ని చెరుకుల నరికినట్లు కాల్బలములనున్ను
వాల్లచేఖండ్డములనున్ను ఖండ్డించేమనిన్ని వింగ్గి శీమపట్టితే అంద్దరి 25
నిన్ని చెరలు తోలుకవచ్చేమనిన్ని శపథపూర్వకముగా చెప్పినారు,
గనక గజపతివారు చాలా సంతోషపడి మీరువొక్కక్కరే వొక్కక్క

శాసను భీభత్సు శాయగలరు; మీరు పదార్గురున్ను పది దిక్కుల కనిపిం
చ్చక కార్యం శేస్తే ఘాలివానాను వురుములున్ను పిడుగులున్ను బడి
నట్లు భీభత్సుగా పోరుదురు యిదిగాక పూర్వమంద్దు అర్జనుండ్డు ఉత్తర
గోగ్రహణమందు దుర్యోధనాదులమీద నడచి యుద్ధం శేశి ఆవుల
5 త్రిప్పుక వచ్చేటప్పుడు అంద్దరి ఫోగులున్ను శిరోవేష్టనలున్ను వొడశి
వచ్చినట్టుగా గలరు- మీరు రణభీకరానకు కర్నాటకంవారు రణభీతిని
వణకెత్తి యెవ్వరికిన్ని శరీరాలు తెలియక విస్మృతి బొంద్ది కాళ్లుచేతు
లాడక యెక్కడివారక్కడనె నిలిచివుందురు- మీరు అంత్త కార్యం
శేయవలెను—తాము పయడు బియ్యమువారు, మిగిలిన బొక్కపభండా
10 రానవుండ్డె రొక్కరోజనాలు శీమభూములు మొదలుగా గల భాగ్యం మీ
దిన్ని, రవుతులు రాణువ వారిదిన్ని. అటుగనక కీర్తి అపకీర్తులు
విచారించక అనిమొనను యేరీతున నడిపించుకోవలనో ఆరీతి శేయుడా -
అవి షోడశపాత్రులకు ఉచితసప్తాంగ్గంబ్బులున్ను శిరోవేష్టి తాళి చౌకట్లు
కడాయి దిట్టీ కస్తూరి వక్కలాకులు యిచ్చి ప్రియపూర్వకముగా యీ
15 వరకు తమవల్ల నేప్పునేరములున్ను ఆగ్రహనిగ్రహములున్ను వాగ్దోష
ములున్ను యేమి కలిగినా అవియెల్ల మనసున వుంచ్చక యీరీతున
జయానికి ఉపాయం కనపలెనో ఆరీతున కర్నాటకం వారిని విముఖుల
శేశి గజపతి అనే పేరున్ను రాజ్యమున్ను నిలుపవలెను- అని అన్నంద్దు
లకు షోడశపాత్రులు—అన్నింటికిన్ని జగన్నాయకులు వున్నారు, రేపు
20 ఉదయాంన్నే మేమున్ను ఆయత్తబడి వస్తున్నారము మీరున్ను ఆయత్త
బడి రావలెను— అని అన్నందులకు అంద్దరున్ను యేకవాక్యముగా
పలుకరించ్చిరి గనక ఆ వివరం ఆద్యంత్తం కన్నాటకంవారి స్థానా
పతి కమలనాభయ్య కృష్ణరాయలవారి సమక్షమానకు సత్కృచ్ఛ్రముగా
కాకితము వ్రాయించి ముద్రబడిజేశి అతి గోప్యముగా రాయలవారు
25 అంతఃపురాన వుంన్నప్పటికిన్ని ఆయన చేతనే కాకితములు యిమ్మని
చెప్పి అంప్పగా పొద్దుచేర నాలుగు ఘడియలప్పుడు వేగర్లు వచ్చి కాకిత
ములు యిచ్చినారుగా—రాయలవారు తామె కాకితములుచదివి జూచుకొని

కార్యం బినతప్పి తబ్బిబ్బాయను అని చాలా చింత్తనొంద్దినవారై అప్పుడు
అప్పాజిమాటలు వినకవచ్చినందులకు ఇంత్త కార్యం వచ్చెను- అని
తమలో తామే చింత్త చేసుక అంద్దరికిన్ని ప్రాణహానులు వచ్చెను, షోడశ
పాత్రులు చెప్పేదొఖటిన్ని శేశేదొఖటిన్ని కాదు; యెంత్త వెళ్ళవాడినా
అంత్తా నడిపించ్చగలవారు- వారలపరాక్రమానకు యెవరుంనిలువలేరు, 5
అని నిలిచిన దిక్కున నిలువక వున్న దిక్కున వుండ్డక అరిజాలపడి
అందరికిన్ని యింత్త కార్యం వచ్చనని ప్రజలు చింత్త పడుతావుండ్డంగ్గ
పాళ్యములో ఆడాడ గలిబిలి అయ్యేదిన్ని మూకలు గుమిగూడి గుప
గుసలుగా మాట లాడెదిన్ని అందువల్ల కొందరికి భయోత్పాతముగా
తోచేదిన్ని యీరీతిని వుండ్డగా రాయలవారు దీపటికోలువై విచ్చేశి 10
నట్టుగా నడిపించ్చి నగరశోధనగా పాళ్యాలు చూస్తారాగా వారువార్లు ఆడు
కొనే వార్తలు- ఉదయమైతే గజపతివారిపాళ్యం మన పాళ్యం మీద
పడుతావున్నారనిన్ని ఆరీతే అయితే కన్నాటకంవారి బలం నిలువ
దనిన్ని రాయలవారు అప్పాజిమాటలు వినక లోజొచ్చి వచ్చినందువల్ల
అపాయం వచ్చెననిన్ని యిందుకు యిప్పుడైనా అప్పాజి చెప్పినట్టువింటె 15
ఆయన అపాయానకు తగ్గ ఉపాయం చింత్తించ్చగలడనిన్ని ఆక్కడ
క్కడ పిన్నపెద్దలు రౌతులు రాణువవారు ఆ సకలమున్ను ఉత్సాహ
మగ్నులై ఆడుకొనేమాటలున్ను వార్లు భీతిజెంద్దిన వార్లున్ను చూచిన
వారై రాయలవారు అప్పాజి గుడారమునకు పోయినారు- గనక అప్పాజి
రాయలవారు వచ్చేది జూచి తనవద్దనున్నవార్లు యెరుగకుండ్డ అంద్దరి 20
నిన్ని పటకుటీరములకు పొంమ్మని అంప్పించి తాము నగళ్ళోనికి
పోయినట్లు పొయెగనక అంతస్తు గుడారములో రాయలవారిని విచ్చేశితూ
ర్చుండ్డమని రాయలవారితోను ఏకదేశాన విచ్చేశేటంతకార్యం యేంద్ది
అనిన్ని పిలువనంపిస్తే నేను వచ్చి విన్నపం శేయనా అని అన్నందు
లకు రాయలవారు, తాము ఏకదేశాన రాతగ్గ కార్యం గనక వస్తిమి- 25
అది యేమంటె గజపతి దగ్గరమన్న కమలనాభయ్య అంప్పించ్చిన
కాకితం చదువు కొంమ్మని చేతికి యియ్యగా అప్పాజి ఆ కాకితం చదు

వుక రాయలవారితోను అది యేంద్ది స్వామివారి పాదాపద్మ్మములకు కానం
బడ విన్నపంచేస్తిని నా విన్నపము చిత్తానకు తేక కదలి వస్తిరి—
గజపతి శీమలో జొచ్చిరాగానే కనమల్లో వచ్చిన అపకీర్తి చాలదా—అవిం
న్ని విచారించుకోక ముప్పై యామడదూరం గజపతి శీమలో చొచ్చి
5 మొదటిస్థలం వద్ద దిగినందువల్ల వారికిన్ని ఆలోచనబుట్టి యింత్త కార్యా
లకు తెగవేసినారు— యీ రాత్రి అంద్దుకైన కార్యం కంట్టే కంన్నట్టు
కాననప్పటికి అంద్దరికిన్ని యుగంత్ర్యంగ్గినట్టు అవును, అవి విన్నపం
శేశినందులకు రాయలవారు పలుకరించ్చిన నీతివద్యం—

క. ముట్టెడు కార్యముఁ జక్కం
బెట్టెడు మంత్రియును బోర బెదరవిబంటుం
బుట్టరుగా దేవతలకుఁ
బుట్టరె నానావిధైక భోగసహాయుల్.

అని నీతి చదివి మీరుండగా కొదవ బడనీరేగదా. గతావ మీమాట
వినక వచ్చినందువల్ల ఇంత ఆలోచనకు ఆస్పద మాయను. మాగుణ
దోషములు యెంచ్చేటందువల్ల అయ్యే కార్యం యేమి వున్నది. యీ
15 యపాయానకు తగిన ఉపాయం యేరీతు అని అడిగినందులకు అప్పాజి
స్వామివారి హృదయమున్ను ఆలోచనాను యేతీరో అని అడిగినంద్దులకు
రాయలవారు షోడశపాత్రులుంమ్ను గజపతివారు శేశిన ఆలోచనవల్ల
తమకు ప్రాణహానింన్ని మానభంగ్గమున్ను అయిన అవని ప్రజలకు
అవధింన్ని వచ్చును అనింన్ని అష్టైశ్వర్యములు—మ్ను ఆక్రమింత్తురు
20 అనింన్ని మనస్సుకు నిశ్చయముగా తోంచివుంన్నవా అని ఆనతిచ్చి
మరింన్ని అప్పాజితోను యీసమయమందు యేమి వెచ్చబెట్టినా ఉత్తరువు
మాకు యీతీరు బుద్ధిమార్గముగా జెప్పిన ఆ తీరుననె విని నడిచేము,
యింతకు వచ్చినకార్యం ప్రయప్రయాసములకు నిలుచునా అని అన్నం
ద్దులకు అప్పాజీ రాయలవారితో మంత్రనీతులుగా పలుకరింపు శేశిన

పద్యం—

గీ. దండసాధనకృతుల సాధ్యండుగాక
క్రింగఁ బలతెంచు శత్రువు మిత్రుఁజేయు
దానమున నాత్మవశగులు గానివార
లితరులెవ్వార లీజగత్రితయమునను.

క. శత్రుల మిత్రులఁ జేయును
మిత్రుల భృత్యులనుజేయు భృత్యుల నిజస
త్పుత్రులుగఁజేయు నందఱ
ధాత్రీపతి కన్ని యెడల దానమువలదే.

క. ఆయాసదుర్లభమ్ము న
నాయాసమునఁ ఘటించ్చు నరయ నభీష్టో
పాయంబు పతికి భేదో
పాయము కడునిష్ట మగు నుపాయము గాదే.

అని నీతులు విన్నవించ్చి యీ సమయాన భేదోపాయము సంఘటించ్చి జయించ్చే యత్నం గనవలెనని గనక అనర్ఘ్యమైన భూషణములు బహూ వుగా వెచ్చబెట్టి హానికార్యము రాకుండ్డా నడిపించ్చవలెను, అన్నందులకు రాయలవారు సర్వోపాయమ్ములచేతనున్ను యీసారి గడిపిస్తే చాలును– అని అప్పాజితో ఆనతిచ్చి తామున్ను బొక్కసభండారములున్ను యేనుగ గుఱ్ఱాలున్ను రాణువ రాష్ట్రీములున్ను కోట కొత్తళాలున్ను గ్రామ భూములున్ను సకలమున్ను మీయొక్క ఆధీనం గనక మీకు వరిపోయినట్టు నడిపించుకొండ్డా అని త్రికరణత్రివాచకముగా పలకరించ్చి నగరికి వచ్చిరి గనక అప్పాజివారు తోడుతోనె నగరి గుడారమునకువచ్చి తమకు ఆప్తులైన ఆయ్యమరసు కొండమరసు రాయసం వీరమరసు ఆవ సరం లక్ష్మీపతి మొదలయిన నియ్యోగులున్ను రాయకరణీకం తొంమ్మి దినమ్మపతులవారున్ను బొక్కసంగొల్ల కొమారస్వామినిన్ని రప్పిం

చ్చుక యేకాంతమని వదంత్తి పుట్టించ్చుక వాకిటి గొల్లలతోను గజపతి
వారి తెగ సుబుద్ధి మొదలయిన నియ్యోగులు యెవరువచ్చినా యేకాంత
మని చెప్పి లోనికి రానియ్యక తిరుగా వెలి వెళ్ళిపోనియ్యక నిలువక
పుండ్డమని తాకీతుగా పలకరించ్చి రాయసం వారితోను షోడశపాత్రుల
5 కున్ను పేరు వరుసలకున్ను వరుసలాను మేము పలుకరించ్చిన క్రమం
రాయలదేవునివారి సమీపములుగా వ్రాయమని పలుకరించ్చి నిరూప
వక్కాణ చెప్పినక్రమం.... మీరు అంప్పించ్చిన కాకితములు చూచుకొం
టిమి గనక అంద్దలి పయనం గజపతివారు ఆదియందు మన్ముననాడిన
మాటలున్ను నడపించ్చు మర్యాదలున్ను రాష్ట్రదుర్గబహుమానముల
10 కొరకు వారివారితో ఆడుకొన్న వార్త్తలున్ను జన్మజన్మానికిన్ని మరవ
తగ్గదిలే దనిన్ని అందుకు ఉపమానముగా నీతికార్యమునకు పద్యం-

క. తనువున నాటిన యలుగుల
నునువునఁ బుచ్చంగవచ్చు నతినిష్ఠురతఁ
మనమున నాటిన మాటలు
విను మెన్నియుపాయములను వెడలునె యధిపా.

అని నీతిసహితముగా వ్రాసీ యీరాత్రి గజపతివారితో వార్త్తలాడివ స్తిమి
రేపు ఉదయానకు పాళ్యంమీదికి సారి మార్గముగా వచ్చేటట్టు తోడకవచ్చి
చేపట్టుగాపట్టీ ఇచ్చేము- తాము రాయలవారు ధరియించు వెంన్నముద్ద
కంఠమాల నవరత్నపు చిలుకతాళి వైడూర్యతాళి వజ్రాలపరిపెణ మరక
తకంక్కణం హారుమంజ్జి ముత్యాలపచ్చసరం ఇంద్రనీలమకటం వజ్ర
పుబిళ్ళల మొలతాడు కెంప్పులజము దాడీ ముత్యాల కాలిపెండ్యాం
వజ్రాలబాహుపురీ దొడ్డముత్యాల అడ్డకత్తి నవరత్న ఖేడం నవరత్నపు
సింహ్మలలాటం ముత్యాలముంగరంబ్బు యివి మొదలైన పదారు నగ
లున్ను అరువై నాలుగులక్షల ఘట్లక్రయం తాము అంప్పిస్తేను తమ
మనస్సు పద్ధతికి అనుకూలతగానే నడిపించ్చేము అని మాకు వ్రాసి
అంప్పించ్చినక్రమం- యీ పదారు నగలుంన్ను అరువై నాలుగు లక్షల

క్రయం గనక కసుగొంన్న నగలు అంప్పితిమి గనుక తమతమకు
కావలశిన నగలు తీసుకొని మాకు కావలశిన ప్రియోజనం వొసగూర్చి
అంప్పించ్చేది– అని వివరముగా షోడశపాత్రులకున్ను ప్రత్యేక ప్రత్యే
కముగా నిరుపములు వ్రాఇంచ్చి మరిన్ని భూషణములున్ను ఉడుగర
లున్ను పదారుపెట్టెలు గట్టించి పదార్గురు నియ్యోగులకున్ను పయనం 5
శేశి పదారుగురు మనుష్యుల వశాల పెట్టెల యిచ్చి షోడశపాత్రులున్న
యడకుపోయి యిచ్చి రమ్మనేటట్టుగా అంప్పించ్చి నియ్యోగులకు వుడుగర
వక్కలాకులు ఇచ్చి పొయ్యేటప్పుడు మార్గాన యెవరైన అడ్డగించ్చి
రమ్మంంటె అవుగాములనంగ మొదటిదొర వద్దికైనా పోయి వారితోను
కలర్ధం కానుపడ తెలుపమనంగా గజపతివారు యేమని ఆనతిచ్చినా 10
విని రమ్మనేటట్టుగా బుద్ధిమార్గములుగా చెప్పి అంప్పిన పర్యాయములు
పీని గజపతివారికి సుబుద్ధి అనే నియ్యోగి వ్రాశి అంప్పినది. మీరు
కర్నాటకంవారిమీద కార్యం శేశేవారై షోడశపాత్రులను పిలువ
నంప్పించ్చి వారితో యీ సంస్థానం ఆదినుండ్డిన్ని మీవల్లగదా నిర్వాహ
కానకూ వచ్చినది. మేము పయిడు బియ్యమువారము, కడమభాగ్య 15
మంత్రా మీదిన్ని రవుతు రాణువమీదిన్ని అని ఉపచారోక్తులుగానున్ను
గతము మేము నేర్చి నేరక ఆడిన మాటలు యేమైనా గలిగితే మరచి
నిర్వాహమునకు తేవలెను అని మంద్దలింప్చగావారు రేపు ఉదయాంన్నే
అంన్ని కార్యములుంన్ను చూచేరు అని విన్నపంశాయగా మీరు వారి
మాటమీద కార్యముఖానకు వస్తావున్నారు గనక కర్నాటకం పాళ్యాన 20
నుండ్డి మనపాళ్యానకు వచ్చేమార్గాన అప్తులయిన వాల్లు మంచ్చి
నియ్యోగులున్ను పెట్టలున్ను సముఖానకు తెప్పించుక జూడగా విదర్భన
మైతేను అంద్దుకు తగిన ఆలోచన కనేదని వ్రాసి అంప్పుగా అకాశితం
గజపతివారు చదువుకొని ఆ తీరుననే యిక్కడి వారికి వొళవియ్యగా
షోడశపాత్రులకు అనర్ఘ్యమైె భూషణములు పెట్యల కట్టించ్చి నియ్యో 25
గులనున్ను పదారు పెట్ట్యలున్ను చేపట్టుగా పట్టుకపోయి గజపతివారి
ముంద్దర విడిచినారు గనక గజపతివారు పెట్టల విడిపించ్చి వారి వారి

పేరట వ్రాసిన నిరూపములున్ను చదివించ్చుకొని వక్కాణలు విని ఆది
యంద్దు తాము ఆగ్రహపడిన కార్యములుంన్ను వుటంగ్గించి అంద్దుకు
ప్రత్యుత్తరమున్ను అనర్ఘ్యమైన భూషణములున్ను నిదర్శనంగ్గా జూచి
షోడశపాత్రులను నమ్మి జగడాలకు పోతావుంట్టిమి వార్లు ఇంత్త ద్రోహా
5 నకు లోనైరి మనపాలింట్టి జగన్నాధులకృపవల్ల మునుకలుగా హెచ్చ
రిక పడితి. ఇఖను యెవ్వరిని నమ్మరాదు. అని వచ్చిన పదారు
నియ్యోగులునుంన్ను పట్టం విడిచి యెకదేశాన అవ్వలవీధతోలి గజపతి
వారు యేడెనిమిది ఆమడవీడవు ఉత్తరంగా పారిపోయిరి. గనక
మరుచునాడు ఉదయాన షోడశపాత్రులు అఖత్తపడి వచ్చి నగరివాకిట
10 నిలిచి గజపతివారిని బయలుమెరశిరమ్మని ఫణిహారులతో చెప్పి అంప్పగా
గజపతివారు నగరివాకిట పిన్నపెద్దలతో చెప్పిపోయినారు - గనకవారు
వాకిలి వెళ్ళివచ్చి గజపతివారు నడిపించ్చిన కార్యమున్ను ప్రఛన్నవేష
ముగా పోయిన మార్గాలున్ను తెలుపఁగా షోడశపాత్రులు విని ఉత్సాహ
మగ్నులై ఆలోచనకులోనై గజపతివారు వున్నతావుకు పోయినాను
15 అపవాదం, కార్యముఖానకు పోయినప్పటికింన్ని వారు నడపించ్చిన
కార్యం మంత్రిభిన్నం ఆయ గనక తెంపుగా నడిపించ్చిరింత్తేగా నగరికి
హిత వాచరించ్చిన వారుకారు, అని అంద్దుకు తర్వాత తామే తెలుసు
కొనేరు, అని వారువాల్లుఞ తమతమ దుర్గాలకు సాగిపోఇనారు. కాబట్టి
కృష్ణరాయలవారు యీ వర్త్తమానములువిని జయభేరిలాయంగా మొదటి
20 స్థలానకువచ్చి నిలిచి యెవ్వరున్ను నగరు చేరకుండ సుబుద్ధిగారి మను
ష్యుల కోటవాకిళ్ళనుంన్ను పట్టణములోనున్ను నగరిమహాలునున్ను జత
నంగా మనుష్యుల వుండ్డమని నియమించ్చి పోట్లూరి సింహాద్రివద్ద
జయస్తంభము శేయించ్చి సుబుద్ధిని బిలువనంప్పి ఆయనతోను మేము
ప్రతాపముకొరకు వచ్చినవార మింత్తే కాని రాజ్యాపేక్షకొరకు వచ్చినవా
25 రముగాము, గజపతివారి రాజ్యం గజపతికే నడిపించ్చేము, మేమున్ను
మాశీమకు సాగిపొయ్యేము, అని ఆనతియ్యగా సుబుద్ధి ఆ వివరములకు
గజపతివారికి అనుపూర్వకముగా కాకితం వ్రాసి పంప్పినారు. గనక

బుద్ధిశాలి యైనటువంట్టి గజపతివారు ఆకాకితము చదువుక చాలా సంతో
షపరులై తిరుగా పట్నానకువచ్చి షోడశపాత్రులవల్ల తప్పితం లేదని
విచారించ్చుక వారులచాత పిలువనంప్పించ్చగా వారులున్ను వచ్చి కని
కొలిచిరి. గనక మీవల్ల కపటమున్ను లేదు, ద్రోహచింతనాను లేదు-
అని పలుకరించ్చి వారలకు బహూమానములు శేశి వారల కూర్చుక 5
రాయలవారిని సందేహించ్చక మాటపలుకులాడేటప్పుడు గజపతివారు
రాయలదేవునితోను సమయోచితములుగా పలుకరించ్చినందులకు—

శ్లో. నష్టం కులం భిన్నతటాకకూపాః
విభ్రష్ట రాజ్యం శరణాగతంచ
గోబ్రాహ్మణాః దేవగణాలయాంశ్చ
యదుద్ధరే త్పూర్వచతుర్గుణం తత్.

అని శ్లోకం చదివి మరింన్ని ఉచితమైన మాటపలుకులాడంగ్గా రాయల
వారు గజపతివారితోను మీరనిన్ని మేమనింన్ని భేదము ఉన్నదా అని
ఉపచారములుగా మాటలాడి గజపతివారికి చాలా బహుమానసన్మానములు
శేశి నాలుగు నగల కోకతాకలున్ను యిచ్చినారు. గనక గజపతివారు 15
తమ కొమార్తె అయిన జగన్మోహినీ అనే కన్యకను ధారవోశి యిచ్చే
సమయాన చెప్పిన పద్యం.

క. హాటకపేటీ శాటీ, ఘోటీశకటీమదేభకోటీవీటీ
పేటీభృచ్చేటీ....మయూరికలు....వేడ్కన్.

అని నీతిచదివి ఆవలమరింన్ని అల్లునికింన్ని ఆడుబిడ్డెకున్ను యియ్య
తగిన బహుమానోచిత క్రమభూషణాలనింన్ని అంప్పించ్చి మరిన్ని తమ
తమ కొమార్తెకు పట్టుపరిమెళ పసుపులకని కృష్ణవేణికి దక్షిణపుదిక్కున
నడిచే రాజ్యాలున్ను కోటకొత్తళములున్ను దుర్గాలున్ను ఇచ్చి యేనుగ
గుఱ్ఱములు బంటుపరివారం దాసానుదాసులు అందోళిక హోయలు బండ్డి
పనలంప్రాయలు పాత్రసామగ్రిలు పగడపుకాళ్ళమంచము హంసతూలికా

యివి మొదలైనవిగా అడబిడ్డెకు యియ్యతగ్గ వరుసలన్ని యిచ్చి
అల్లునికింన్ని శాయతగ్గ వరిశలు అన్నిన్ని తప్పకుండా వఖసారి గానె
సకలపదార్థములున్ను యిప్పించ్చి తమ నగరగల భూషణములలో
అపూర్వమైన హెచ్చుబడిన నవరత్నభూషణాదులు అపరిమితముగా ఇచ్చి
5 అప్పాజి షోడశపాత్రులకు అంప్పించ్చిన పదారు నగల నవరత్నపొడి
సొమ్ములు యిచ్చి చీని చీనాంబరమైన పట్టుపతావళ్ళు పీతాంబరాదిగాగల
సకలమైన కోకశాకలున్ను యిచ్చి యేనుగ గుఱ్ఱం కత్తికేడం మొద
లుగా గల రాజోపచారమైన బహూమానములున్ను యిచ్చి విందు వీడుకళ్ల
ప్రసాదబడశేయించ్చి సుబుద్దినింన్ని వెంబ్బడికూర్చి అంప్పగా రాయలవారు
10 అత్యంత్త సంత్తోషయుక్తులై నగారాశేయమని గజారోహులై అప్పాజి
సుబుద్ధినికూడా చౌడోలున వుంచ్చుకొని బయలుదేరిరాగా యీపర్యాయము
లవిన్ని గోలకొండ్డ విజయాపురం అహముదానగరం యేలే ముగ్గురు
దునేదార్లున్ను విని యిఖను మనం రాయల దేవునితో యెదిరించ్చి కత్తి
కట్టేది కార్యం కాదు, అని యోచనచేసి భేటిశేసుకోవలెనని నిశ్చయించి
15 ఆఅద్దుకు ఆయిన సంవిధాన పురస్సరముగా వచ్చి నిలిచి సవినయంబ్బుగా
కుర్నిసులు శేశి రాయలవారి భేటిశేసుకొని కానుక నదురుదెచ్చి అపరిమి
తముగా పాదముల సమర్పించ్చి భయబుద్ధిగలిగి రాయలవారియొక్క
దానశాస్త్రములు తెలుసుకొని పలుకరింప్పశేశిన నీతిపద్యం—

చ. మలకలు మాప్రచారములు మాముఖము ల్విషవహ్నిఘోరముల్:
ఖలులము రోషజాతులము గర్వుల మేమొక మంచివారమే:
నలినదళాక్ష ప్రాణులకు నైజగుణంబులు మాన్పవచ్చునే:
వెలయఁగ మావికారములు వేయుమ నెంచఁగనేలభూవరా:

అని నీతిపద్యం చదివి అన్యోన్యమైన మాట పలుకులు నడిపించ్చి తమ
తమ దేశాలకు సరుదులు యేర్పాటు శేశుకొని కనమని కొలిచేవారై
రాయలవారిచేత అంప్పించ్చక వారివారి స్థలాదులకు పోయినారు. గనక

కృష్ణరాయలవారు ఉత్తరాదితురకల కార్యం జయం చేసుకొని శీమకై
తిరిగి తిరుపతికి రాంగా కల్యాణ కలుబరిగె కోటలవారు గర్వితులై కోట
మీదనుండి కూతలింగ్గా ఆవార్తలు రాయలవారు విని యెదిరి తెగవారిని
ఆడుగగా మ్లేచ్ఛుల తెగవారు వున్నారు గనక కోటమీదికై ఆంద్దల
మగుడించ్చ మని కలుబరగ కోట లగ్గ బెట్టించ్చి మూడు ముక్కాలు 5
ఘడియలలో కోటసాధించి ఆకోటలోవున్న యజమానుంణ్ణి చేపట్టుగా
పట్టుకొని ఆరువేల గుఱ్ఱాలవారినిన్ని గుఱ్ఱాలనున్ను ఏకవాగెగా
బట్టుకొని ఆకోటకు ఠాణ్యం గుజ్జరి కల్యాణరావును వుంచ్చి తిరుపతికి
వచ్చి అలమేలుమంగా సమేతులైన కల్యాణ వెంక్కటేశ్వరుల దర్శ
నంబు శేశి రొక్క రూపాయలు కానుకవేశి సకల భూషణములున్ను 10
స్వామికి నమర్పించ్చి ఆస్థలాన షోడశమహాదానాలున్ను శేశి సంన్నిధిని
నిత్యశేవగా అంజలిపుటులై పూర్వద్వార మందలి వుభయపార్శ్వములా
తిరుమలదేవీ చిన్నాదేవీ సహితంగా వుండేటట్టుగా తాంబ్రాన ప్రతిబింబ
మున శేయించ్చి స్వామిని యెదురుగా నిలిపి అంద్దుండ్డి కాళహస్తికివచ్చి
స్వామిని దర్శించి కానుకలున్ను నవరత్నాభరణములున్ను సమర్పించి 15
శ్రీముఖసంవత్సరం ఆశ్వీజ శుద్ధ ౧౨ దినములు రాదిగాగల వస్త్రము
లున్ను గ్రామాదులున్ను నమర్పించి స్వామి సన్నిధిని షోడశ మహా
దానములున్ను శేశి అవ్వారిగా సత్రములున్ను గలుగశేశి అంద్దుండ్డి
త్రిపురుల చేత పూజకొన్న మూడు స్థలాలకున్ను పోయిన స్వామి
దర్శనం శేశి వంద్దీశ్వర దర్శనం శేశి ఆళగరుగుడిక్కి వచ్చి శేవించ్చి 20
కానుకలున్ను ముత్యాల కిరీటం పచ్చలపతకం నమర్పించ్చి మధురకు
వచ్చి మీనాక్షి దేవినిన్ని చొక్కనాథస్వామినిన్ని త్రిసంధ్యల యంద్దు
న్ను సేవించ్చి కానుకలు వేశి అనేక భూషణములు పమర్పించ్చి
అమ్మువార్కి వజ్రాల కంమ్మలున్ను వైఢూర్యపు పతకములున్ను
పచ్చల కంమ్మలున్ను ముత్యపు ముక్కరాన్ను సమర్పించ్చి త్రిరా 25
త్రుళ్ళు వానముజేసి శ్రీవల్లి పుత్తూరికి వచ్చి చూడుకొడుత్తునాచ్చ్యారు
సమేతముగా నంప్పెంగ్గి మంన్నారు స్వామిని సేవించ్చి తిరుముక్క

కెంపుల వొడ్యాణం బంగ్గారు నూపురములున్ను నవరత్నకీలితమైన
సింహ్మముఖం ప్రభలున్ను సమర్పించ్చి గుంట్టతొవ్వించ్చి రాతికట్టాన
కున్ను నడిమిమంట్టపానకున్ను లక్ష మాళ్ళు యిప్పించ్చి కరువనల్లూరికి
వచ్చి క్షీరవర్ణస్వామిని దర్శించ్చుక శంకరనారాయణ దేవళానకువచ్చి
5 నాగతీర్థమున స్థానం శేశి గోమేతీసమేతముగా శంకరనారాయణస్వామిని
దర్శించ్చి దక్షిణకాశికిపోయి త్రికూటాచలమంద్దు ఆకాశగంగయంద్దలి
స్నానం శేశి చిత్రసభ శేవించ్చుక అగస్త్యపర్వతానకువచ్చి కల్యాణ
తీర్థమంద్దలి స్నానం శేశి అగస్త్యేశ్వరుని గోపుర గట్టించ్చి గజేంద్ర
మోక్షానకు వచ్చి స్వామిని సేవించ్చుక శాలివటపురానకు వచ్చి కాంత్తిమ
10 తీసమేతముగా వేణువనేశ్వరస్వామిని దర్శనం శేశి తామ్రసభకట్టించ్చే
టంద్దుకు కొంత్త రూకయిచ్చి కృష్ణరాయసముద్రమని తన పేర అగ్ర
హారముగావించ్చి తోతాద్రి స్వామిని శేవించ్చుక కురుంగ్గుడికి పోయి
పంచ్చనంబ్బులమంన్ను శేవించ్చి కన్యాకుమారికిజని అమ్మవారికి సేవిం
చ్చుక శ్రీకంద్దూరికి వచ్చి వల్లి దేవయానసమేతముగా సుబ్రంహ్మణ్య
15 స్వామిని శేవించ్చి నవ తిరుపతులకు వచ్చి ఆయా స్థలాదులకు దగిన
నవరత్నహొడి భూషణాదులు యిచ్చి ఆదిసేతువుకుపోయి రఘునాయకుల
సేవించ్చి కాళములమీద సముద్రతరణమై ధనుష్కోటిలో ఖడ్గంగడిగి
సేతుస్నానం తులాపురుషదానం మొదలైన దానాలాచరించ్చి కాశివిశ్వే
శ్వరులనుంన్ను రామలింగ్గస్వామినిన్ని సేతుమాధవస్వామినిన్ని పర్వత
20 వర్ధన అమ్మవారినిన్ని సేవించ్చుకొని చతుర్వింశతి తీర్థములయంద్దు
స్నానం శేశి కోటిగోదానం కోటిబ్రాహ్మణులకు అన్నదానముశేశి స్వామి
సంన్నిధిని మూఁడుతులలుతూఁగి అంమ్మవార్కి సకలాభరణములున్ను
నవరత్నహొడిగా యిచ్చి త్రిరాత్రి వసిఇంచి కోటితీర్థస్నానంశేశి స్వామి
చేత అంప్పించ్చుకొని మరలినవారై గోకర్ణస్థలమునకువచ్చి బృహదం
25 బ్బాసమేతముగా గోకర్ణేశ్వరుని సేవించి వకుళవనప్రదక్షిణముశేశి
గోకర్ణతీర్థమండున్ను మంకణతీర్థమందున్ను స్నానంశేశి అంమ్మ
వార్కికి సకలాభరణమ్ములుంన్ను సమర్పించ్చి శ్రీరంగపట్ణానికి వచ్చి ఆది

రంగ్గనాయకుల సేవించ్చి సుముహూర్త్తమంద్దలి విద్యానగరప్రవేశమై విఠల
విరూపాక్షుల సేవించ్చి కానుకలున్ను ఆనర్ఘ్యమైనటువంట్టి భూషణాదులు
న్ను సమప్పిఁయించ్చి నగరుప్రవేశమై పెద్దలకు మ్రొక్కి సుముహూర్త
మున హజారమునకు విజయంశేశి అప్పాజి మొదలైన సకలసామాజిక
లనున్ను అల్లుడికొామాళ్ళనున్ను రప్పించ్చుక నిండ్డుకొలువిచ్చి అప్పాజిని 5
రత్నకంబ్బలియంద్దు కూర్చుండ్డబెట్టి రత్నాభిషేకం స్వర్ణాభిషేకంశేశి
నాలుగుసగల కోకతాకలున్ను యిచ్చి చైసరాలున్ను పచ్చల కడియాలు
తాళిచౌకట్లు పచ్చలవొంట్లు ముత్యాల తురాయి వజ్రాల కంఠసరం కెం
పృల వుంగ్గరములు యివి మొదలైన భూషణములున్ను యిచ్చి గంధ
కస్తూరి తట్టుపునుగు జవ్వాజి మొదలైన పరిమెళముల చాతలెస్పాయిగా 10
బహుమానములు శేశి తక్కినవార్లకెల్ల తగుపాటి బహుమానములు శేశి
సకలవాద్య ఘోషములతోడట్టు గజాధిరోహులశేశి యింణ్లకు అంప్పించి
అటుపిమ్మట దొరమన్నెవార్లు రౌతురాణువ ప్రభుపాళ్యగార్లు అమర
నాయకంవార్లు బోయనాకంవాలుఁ కైజీతం వార్లను నియ్యోగులను
కరణీకులను రాయసాలవార్లను దినసరివార్లను విద్వజ్జనులను కవిజను 15
లను నాటకాలంకారులను దైవజ్ఞులు భేషజులు రవుతులు స్థానాపతులు
ఆశ్రితులు భాగవతులు మొదలయిన దెభైరెండ్డు వినియోగాల వారికింన్ని
వుడుగర వక్కలాకులున్ను యిచ్చి ఆదరణగా ఆనతిచ్చి అంప్పించిన
వారై మరుచునాడు కొలువులోపల యిష్టకథావినోదమైన నగరి నియ్యో
గులున్ను కవీశ్వరులు విద్వాంసులు మొదలైన నిండుసభలోన సాళువ 20
తిమ్మరసయ్యగారున్ను రాయసం కొండమరసయ్య మొదలైన వాల్లుఁ
న్ను ప్రసంగ్గం వెంబ్బడిని అంద్దరున్ను యెంచ్చినట్లు కవితాచాతుర్యము
గలవార్లుంన్ను రాయలవారిని జూచి ప్రసంగ్గం వెంబ్బడిని అంద్దరున్ను
యెంచ్చినట్లు కవితాచాతుర్యము గలవార్లుంన్ను రాయలవారిని జూచి
ప్రసంగ్గం వెంబ్బడిని నీదుకీర్త్తి శాశ్వతముగా నిలిచేటంద్దులకు ఆది 25
యంద్దు అవనీపతులు కృతులంద్దుచు రాంగా వాల్లుఁ ప్రతాపములున్ను
కీర్త్తింన్ని అంద్దరుంన్ను యెంచ్చినట్లు స్వామివారున్ను కృతులంద్దు

రాయవాచకము

కొంట్టే కీర్తి ప్రతాపములు శాశ్వతముగా నిలుచును గనక తిమ్మరసయ్య
అయ్యమరసయ్య కొండమరసయ్య బాచరసు తిప్పరసు అయ్యమరసు
మొదలైనవార్లు దెలుపగా రాయలవారున్ను చాలా సంతోషబడి ముక్కు-
తింమ్మయ్య అల్లసాని పెద్దయ్య మాదనగారి మల్లయ్య మొదలైన
5 కవీశ్వరులతో కృతులంద్దుకోవలెనని కవితానాయకులతో పలుకరింఛ్చి
ఆతీరున అయ్యాని ఆనంగా కుళ్ళాయి కబ్బాయి తాళి చౌకట్లు చేసరి
పేరులు కోకతాకలు యిచ్చి పారిజాతాపహరణమున్ను మనుచరిత్రాను
చెప్పుమని ఆనతిచ్చినారు. గనక స్వామివారికి యీవరకు నడుచు సమా
చారములకు వ్రాశి అంప్పించ్చినారు తర్వాత నడుచు సమాచారములకు
10 వెంబ్బడిగా విన్నవించ్చి అంప్పుతున్నాను కనక స్వామివారి పాదార
వింద్దములయంద్దు నిరంత్తరభక్తి యిచ్చి రక్షింపుగలది. యీ రాయ
వాచకం చదివినవార్లకు వింన్న వార్లకున్ను బుద్ధివివేక విచక్షణములు
గలిగి భాగ్యవంతులై యోగశాలులై ఆచంద్రార్కస్థాయిగా సుఖాన
వుంద్దురు. శ్రీరామార్పణమస్తు శ్రీరామజయం,

రాయవాచకము సమాప్తము.

---

# అనుబంధం 1 : పదవివరణ

అంగజాదులు (31:1): "గుఱ్ఱాలకు......పదారుగురు అంగజాదులనున్న" అంగజాలులు = కావలివారు; అంగరక్షకులు (సూ. ని.) అయియుండ వచ్చును. ఇచట అంగమర్దుడు (ఒడలు పట్టెడువాడు) అను అర్థమున వాడినట్లున్నది.

అంద్దుపడి (63:24) : అందుబడి = సమీపము.

అఘుపురం (49·15) 'ఆగ్రా' అని నేలటూరు వెంకటరమణయ్య, చూడు : కృ.దే.రా, పు. 105

అడ్డబడి (27:4;3:21) : అడ్డపడు, అడ్డము వచ్చు- అని. శ.ర, సూ.ని. కాని ఇచట 'సాష్టాంగపడు' అను అర్థమున వాడబడినది.

అణ్ణగర్లు (26:6;27:7) : (త. అన్నగన్, పేడి) కంచుకి, వేత్రహస్తుడు (సూ.ని.)

అధర్మపతులు (40:25) : అధర్మమునకు పతులు; అధర్మవర్తనులు అను అర్థమున వాడినది.

అర పేద, కాలు పేద (42:26) : ఇది తెలుగు, ఫారశీ మిశ్ర సమాసము. ప్యాదా అనే ఫారశీ పదానికి వికృతి పేద. కాలినడకవాడు, కాలిబంటు అని అర్థము. అర = సగము, కాలు = పాతిక. బలహీనులు అను అర్థమున వాడినది. అర్ధ రథుడు అన్నట్లు. చూడు, గో. కృ, పు. 44 పేద = పై. వి. భటుడు, అని శ.ర.

6)

పేద = (from Skt. పదాతి) n. a foot-soldier, భటుడు అని. బ్రౌ.ని; ప్యాదా n.s. for Piyaadah, a peon of footman (బ్రౌ. మిశ్ర)

అంజాలపడి (69:6) : సందర్భాన్ని బట్టి 'భీతి చెందీ' అను అర్థము సరిపోవును. నిఘంటువులలో ఈ పదము లేదు.

అవుగాములు (73:9) "అవుగాములనంగ"-అవుగాము లనక, అవును, కాదు అనక.

అము స్తీదు (28:23) చూడు ము స్తీదు.

ఆయాలాయం (30:26) (హిం?) వచ్చి, పోయే అను అర్థమున వాడినట్లున్నది. 'ఆయాలాయం గుర్రా'లని. ఇచట ఈ పదం గుర్రాలకు విశేషణంగా వాడబడ్డది. నిఘంటువులలో లేదు.

ఏకవాగె (77:7) "ఆరువేల గుర్రాలి వారి నిన్ని గుర్రాలనున్ను ఏకవాగెగా బుట్టుకొని". సందర్భాన్ని బట్టి 'ఏకవారము' 'ఒకేసారి' అనే అర్థము వస్తుంది. మిశ్రసమాసమని తోస్తుంది. 'వాగె'కు నిఘంటువులలో ఈ క్రింది అర్థాలు కనబడతాయి.

వాగె, వాగ, వాగియ, (Skt). గుర్రపు కళ్ళెమును తగిలించేవారు (బ్రౌ.ని.)

కందాచారము (29:4) "కందాచారం కరణాల పిలిపించి" ఈ పదము సూ.ని. లలో లేదు. బ్రౌ.ని. ఈ క్రిందివిధంగా అర్థమిచ్చింది.

కందాచారము (H and K) n. The native militia. కట్టుబడివాండ్లు ; adj. Military దండు సంబంధమైన (బ్రౌ.ని.) కాని దీని అర్థము Military Department, సైనిక శాఖ. (చూడు, వి. స, III, 488; Sstudies, P. 132)

కందాచారము (ఉ) (కందాచార్) (సం. స్కంధావారము) సైన్య సంబంధమైన లెక్కలు వ్రాయుట-శ.ర. అను, పు. 98.

కడ్డి కవళములు (30:26) గడ్డి+కవణమునకు మారుగా కడ్డికవళములు అని వాడినట్లున్నది.

కవణము = గుఱ్ఱము మొ॥ వానియొక్క ఉలవలు; దాణ (శ.ర; సూ.ని; బ్రౌ.ని.)

కత్తలాణి : ( ) కత్తళము. సం. కర్తలాణః కవచము తొడిగిన యశ్వము: అశ్వాది వాహనము అని సూ.ని; సం. తెల్లని గొరిజ కోక, వెండ్రుకలు గల నల్ల గుఱ్ఱము, కత్తలాని, కర్తలాణము అని శ.ర; దీనికి శ.ర; శివతత్వ రత్నాకరము నుండి నిర్వచనమిచ్చింది; కర్తలాణము (Skt.) n. a black horse having white hoofs and a white tail, కత్తలాని అని బ్రౌ.ని.

కాని ఇది సంస్కృత భవము కాదు. ఫారశీ నుండి వచ్చిన అన్యదేశ్యము. ఖుత్లాన్ దేశపు గుర్రము. చూడు గో.కృ. పు. 31; దొరస్వామి, భా. వా. వ్యా. పు. 177-179; పు. 182.

కత్తికట్టలాలు (54:22) 'కట్టలము' నిఘంటువులలో లేదు. 'కట్టడము', 'కట్టడము' అనే పదాలు బంధము, కూర్పు అనే అర్థంలో ఉన్నాయి. (సూ.ని; శ.ర; బ్రౌ.ని.) ఇచట కొమ్మకు వేలాడుతున్న మనుష్యులను క్రిందికి దించుటకు ఉపయోగపడు త్రాళ్ళ కూర్పుగా కనపడును.

కప్పణాలవారు (44:18; 57:13) : కంపణాలవారు; కంపణము దేశవిభాగము. క్రింద "వారి బాణంతా మాళ్ళు" చూచునది.

కబాయి, కబ్బాయి (30:6; 39:17; 55:26; 68:14; 50:8) కబాయి or కబాయీ (H) n. A shirt, an ornamental garment

(బ్రౌ. ని.); కబాయి (యీ) కబ్బాయి. (హిం. కబా. క. కబాయి. తా. కపాయ్) అంగీ (సూ.ని); కబాయి (దే)-అంగీ (శ.ర.)- ఇది అన్య దేశ్యము. శబ్దరత్నాకరకారుడు దేశ్యమన్నాడు. దొణప్పగారు కబాయిని బుదతకీచు సుతులలోనిదిగా చెప్పినారు. చూడు దొణప్ప, **భా.చా.వ్యా.** పు. 263; కబాయి or కపాయి n. s. Kaba, a shirt, an ornament garment; కపాయి for n. s. Qaba ; తురకలు తొడిగేవొక చొక్కా (బ్రౌ.మి.శ, పు. 18, 17).

కబ్బలి కొతుకు (30:8) : సందర్భాన్ని బట్టి "కబ్బలి" అనేది ఒక దేశ నామమో, లేక జాతి నామమో అయి ఉండవలెను. నిఘంటువులన్నిటిలో, కబ్బలి=కల్లమ్మువాడు (శ. ర); (సూ. ని.); A toddy seller (బ్రౌ.ని.) అని అర్థము ఇచ్చి ఉన్నది.

కరమల [55:20]. కమ్మరి. 'కరమల' అను రూపము శ.ర.,సూ.ని లలో లేదు. బ్రౌ.ని. లో ఉంది.

కర్తారు, కర్తరు [40:9; 51:1] : కర్తారు [డు]. (హిం. కర్తార్). 1. తురుష్కులదేవుడు (అల్లా). 2. సూర్యునకు తురుష్కభాషానామము. అని సూ.ని; బ్రౌ.ని.లో లేదు. ఈ పదాన్ని గూర్చి గోపాలకృష్ణరావుగ్గారు ఇట్లా వ్రాశారు : ఈ పదము ముస్లిము దేవతను సూచించునని శ్రీ సుర వరము ప్రతాపరెడ్డిగారు అనుమానించిరి. చదలవాడ మల్లన ప్రయోగము "కర్తారుండనుచుం దురుష్కులు మొదల్గా గొల్వం బ్రత్య క్షమై మార్తాండుండుదయించె" ఇట్టి అనుమానమునకు దారి తీసినది. శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు శబ్ద రత్నాకరము అనుబంధమున అన్యదేశ్యముల శబ్దముల అర్థమును వివరించు పట్టి ముస్లిముల దేవుడని భావించిరి. కర్తారుడు ముస్లిం దేవత కాడు. కర్త యను పదమువలన నేర్పడిన రూపము కర్తారుడు = చేయువాడు, భగవంతుడు అని

సామాన్యార్థము, – గో. కృ. పు. 29.; చూడు. "కర్తార" శబ్దం, ఆం. సా. ప. ప, 26 (4), ఈశ్వర, పు. 146 మొ॥; కర్తారుఁడను పదము హిందీయని కొందఱు. హిందీలో ఇది లేదు. 'కర్తృ' ప్రథమా బహువచన రూపము 'కర్తార'. సృష్టికర్త సర్వేశ్వరుఁడని అర్థము.– –దొణప్ప, భా. చా. వ్యా. పు. 194.

"సారెసారెకు) గర్తాలు దూఱువారు". కృ. రా. వి, III. 46;

John Shekspear, A Dictionary of Hindustani and English, Second Ed. 1890 లో ఈ క్రింద చూపినట్లు సంస్కృతభావంగా చెప్పబడింది.

S. Kartar (　　) S.M. The creator,an author, doer.

కాళము [78:17] "కాళములమీద సముద్ర తరణమై". ఇచట కాళము అనగా ఒక విధమైన పడవ అను అర్థము సరిపోవును. ఈ అర్థంలో 'కాళము' అనే పదము నిఘంటువులలో లేదు.

కుతుపుమలక [34:5] గోల్కొండ సుల్తాన్ కుతుబ్ షా. 'మలక' పారసీ 'మలిక్' శబ్ద భవము,

కుర్నీసులు : [76:16]."ఇది కొర్నిష్ అను పారశీక పదము యొక్క రూపము వినమ్ర శిరస్కులై రాజునకు ఏడు సార్లు సలాము చేయుట" చూడు, గో. కృ, 69.

కూర్నిసిషాతు(హిం. కూర్నిశాత్), సలాము; వందనము. (శ. ర. అను. 100).

కుళ్ళాయి [30:6; 30:6] పారశీ. కులహ్, బట్టటోపి - గో. కృ, పు. 22; కుల్లా < Dరసి. కులాహ్ = నల్ల గొఱ్ఱెపిల్ల తోలుతో కూచినా చేసి

ముస్లిము సాధువులు, దర్వేషులు ధరించెడి టోపి—దొంణప్ప, భా.చా.వ్యా, పు. 181

**కూచి** (62:18) "నగారా కూచి రేయిలచ్చమని'' కూచీ అను (ఫారశీ) పదము కూచి అయినది. దండును ప్రయాణము చేయించుట— గో. కృ, పు. 68: కూచీసేయు (హి. కూచ్), దండయాత్ర వెడలు శ. ర. అను పు. 100; కూచీ (హిం. కూచ్.) దండయాత్ర (సూ.ని; కూచిచేయు, To march an army (బ్రౌ.ని)

**కొత్తవాలు** (38: 16,19) ''కొత్తవాలు అనే తలారికి'' అని రాయవాచకమే అర్థ వివరణ ఇచ్చింది. ముస్లిం రాజ్యాలలో పోలీసు అధికారి. ''ముష్కర తురుష్కులవలంబొమ్మని కొత్వాలు కప్పగింతు'' రని, **కృ.శా.వి,** II.123.

**కౌనమూకలు** [64:2] 'సేనాముఖము' అనే అర్థంలో వాడినట్లున్నది.

**కోకతాకలు** [75:15; 76:7]. ''చీని చీనాంబరమైన పట్టు పతావళ్లు పీతాంబరాది గాగల సకలమైన కోక తాకలున్న" అని రాయరాచకమే అర్థాన్ని వివరించింది. కాని, ఈ ద్వంద సమాసము నిఘంటువులలో లేదు. 'తాక' అనే పదంకూడా లేదు.

**కోటకైచీ** [58:14] 'కైచీ' కి అర్థం తెలియదు. నిఘంటువులలో లేదు. **అగడ్త** అయి ఉండవచ్చు.

కంపోలం [64:14] ''అలజడి" అను అర్థము వచ్చును. నిఘంటువులలో లేదు.

**చీటీ పాటీ** చిక్కు చిల్వానములు [35:15]. అర్థం తెలియడంలేదు. చిల్వానము, చిల్లాణాము అనగా ఛాప (సూ.ని ) అయి ఉండవచ్చు.

చెరాజొరా [64:14] "చెరాజొరా బట్టి చాలా కంపోలం శేయంగా" చెరబట్టి, జొరాబట్టి (?). చూడు పైన, కంపోలం. జొరబడా (చొరబడి) ?

జవురు జంగులు [35:8] "జబురు జంగి ఫిరంగులు" అని కృ.రా.లి, 11. 122. ఒక విధమైన ఫిరంగి (గొ.కృ 37; బ్రౌ.మిశ్ర, పు. 33.

జీరా [24:18, 55:11] "జీరా సంజ్జోక గుఱ్ఱములు"

జీరా. n.s. Zira, Armonr, Nail కవచము బ్రౌ.ని. లో ఇది తెలుగు దేశ్య పదంగా చూపబడింది.

జీరా-జిరా (త. సీరా. హిం. జీరా) కవచ విశేషము అని సూ.ని. దీనికి భాషాంతర సంబంధాన్ని చూపించింది.

జీరా-దే.వి. కవచము, కవచ విశేషము (అని కొందఱు) అని శ.ర.

జిరా=ఏనుగు లేక అశ్వము మున్నగు వానిపై వేయు వస్త్ర కవచము. ఫా. జీరహ్-గో. కృ. 34; దొణప్ప, భా.పు.వ్యా, 190.

జిరా సంజ్జోకం గుఱ్ఱములు, అనగా జిరాతో కప్పిన గుఱ్ఱములు అని అర్థము.

జీరిఖు తాళ్ల (60:18) డేరాతాళ్లు. 'జీరిఖు' నిఘంటువులలో లేదు. బహుశా జీరుకాడు (=వ్రేలాడు) తాళ్లయి ఉండవచ్చు. లేక డెరిజా = డేరా తాళ్లయి ఉండవచ్చు. చూడు క్రింద 'డెరిజా'

డెరిజా (60:18) = 35:20; 86:1, 87:4,8.

డేరా-ఈ రూపము నిఘంటువులలో లేదు.

తాకీతు (72:4) తఖీద్ (ఫా) ఆజ్ఞాపత్రిక బ్రౌ.మిశ్ర. 44.

దావిసుహాలు (32:21) న్యాయసభా భవనము-గో.కృ. 39.

దిన ప్రతిన్ని (5:27) ప్రతిదినమూ.

దునేదార్లు (రులు) (27:16, 65:24, 67:3, 76:13) పర-(49:14) "గోల కొండ, విజయాపురం, అహముదానగరం యేలే ముగ్గురు దునేదార్లు"- ఈ వాక్యంలో ప్రభువులు (సూ.ని.)అనే అర్థం సరిపోతుంది; కత్తి చేత ధరించిన శూరుడు (శ.ర.);

దునియాదార్=మంచి వ్యవహర్త, చురుకైనవాడు, శూరుడు. పూర్వ కావ్యము లందు రెండువైపుల పదునైన కత్తి అను అర్థమున ప్రయుక్తమైన పదము-గో.కృ. 56.

నగారా (58:10, 61:16) నఖారా అను పదమునకు వికృతి, గో.కృ. 69 బ్రౌ.మిశ్ర, 57.

నదురు ( ) కానుక. నజీర్ అను పదానికి వికృతి - గో. కృ. 69.; బ్రౌ.మిశ్ర.పు. 57.

నల్ల ప్రజ (31:3) : కిరాతక సంఘము, ఆటవిక జనము (సూ.ని.) శ.ర. లో లేదు. చూడు, నేలటూరు వెంకట రమణయ్య, 'నల్లప్రజ', భారతి, 1938, డిశంబరు, పు. 663. సైన్యములోని బోయవారు.

నామజాదులు (36:19, 37:23; 39:26; 40:3; 41:16) ఈ పదం. శ.ర, సూ.ని., బ్రౌ.ని. లలో లేదు. బ్రౌ.మిశ్ర. లో కూడా లేదు. "నామ్జద్ అను పారశీక పదమునకు పేరుపొందిన, పేర్కొనబడిన అను అర్థములు కలవు. నామ్జద్ కర్నా అనగా నియోగించుట; ఇట నియోగింపబడినవారు అను అర్థమునందు "నామజాదు" లను పదము ప్రయోగింపబడినది" —గో.కృ. పు. 68; మోడేకుర్తి సత్యనారాయణ, "తెలుగు శాసనాలలో అన్య దేశ్యాలు," భారతి, 1959, అక్టో, పు. 69,

నిశానులు (61:16) : టెక్కెములు-గో.కృ. 69; Nishan-Flag, banner. ఝుండా. బ్రౌ.మిశ్ర. పు. 600

పట్టీ, పట్టె (59:17; 3:7) "రామలింగ్గమ నాయనికి పట్టీలు ఇచ్చె." గో.కృ. పు. 69 లో దీనిని ఫారశీ పదంగా తలచి, పట్టీ = జాబితా అని అర్థం చెప్పారు. కాని ఇక్కడ దీని అర్థము "తమలపాకు పట్టీ" అని. ఒక నియోగానికి (Commission) కు ముందు ఇట్టి పట్టీలిచ్చుట ఆచారము, చూడు, రా.వా. (3:17), "పట్టెలు", పట్టెలు, ఆభరణ విశేషమంని కులశేఖరరావు, ఆం.వచ.వాఙ్మ, పు. 517.

పదునెనిమిది రేవులు (4:6) కౌటిలీయార్థ శాస్త్రంలో చెప్పిన 18 ప్రభుత్వ శాఖలు (?) అష్టాదశ తీర్థములు.

పయడు బియ్యము వారు (69:9; 73:15) : పడి బియ్యము వారు-పరిమితాక సరములు కలిగినవారు అను అర్థమున వాడినట్లున్నది.

పరదునేదార్లు 49:14 శత్రురాజులు. చూడుదునేదార్లు.

పర భారకం (12:19) : మిక్కిలి భారము ?

పరాకు (18:25) ఉపేక్ష, నిర్లక్ష్యము.

పాయు (య) దళము (37:5; 63:2) "మూడు లక్షల పాయదళము." పాద దళమా ? Foot-Soidiers ?

ప్రతిచింత (28:11) : తిరుగు ఆలోచన, సరియైన ఆలోచన.

ప్రహరి బడగరము (3:13) : ప్రహరి=కోట ప్రాకారము: బడగరము (?) = అగడ్త (?) బడగరములు=ఆటవికజాతియోధులని కులశేఖరరావు. ఆం.వచ.వాఙ్మ, పు. 517.

బంటు బయదలు (25:8; 28:23) – బయదళాలు (47:24) బంటు పైద- (ప్యాదా అను పదమునకు వికృతి పైద), కాలినడక వాడు, (Foot soldier) అయి ఉండవచ్చు. ఏకార్థక పదములు జంటగా ప్రయోగించుట :- చూడు గో.కృ. 44.

బలమించ్చి (34:14) : బలముతో అధిగమించి.

భయిరవాసలు (49:23) బహిర్ + వాసము, పై గుడ్డ ; అధివాసము.

భారవసము (38:14) భరోసా = నమ్మకము :-గో.కృ. 69.

మకల చెక్కేములు (60:20) : మకల ? "మలక" అయి ఉండవచ్చు.
మలక = మహమ్మదీయ.

మలక చెక్కేములు = చంద్ర ధ్వజములు.

మరిగి (23:3) మరలి.

మరుచునాడు (55:21; 24:3; 64:5) మరునాడు: మరుసటినాడు The next day.

మర్త్యాఖండం (54:14; 55:15) : ఒక విధమైన పెద్ద కత్తి
ఖండా = పెద్దకత్తి (శ.ర.)

మానుషములు (59:22) పౌరుషములు అను అర్థమున వాడినట్లున్నది.
నిఘంటువులతో లేదు.

ముఖాములు [41:12 ; 43:12 ; 49.21]. "ముఖాములైన స్థానాపతులు" అని రాయవాచకమే [49:21] ముఖాములనగా స్థానాపతులని అర్థ వివరణ ఇచ్చినది. ముఖీం N. S. Muqim. A resident, ఉండేవాడు. కాపురముండేవాడు. అని బ్రౌ. మిశ్ర. పు. 94. "గౌరవమొప్ప నచ్చటి ముఖాములు వ్రాయదొడంగి రెంతయుడ్" అని కృ. శా. వి., 11 ; 113. "నిఘంటువుల కెక్కని పదములలోనిది యొకటి. ముఖాము అనగా స్థానము. తద్ధర్మార్థమున స్థానికుడనుటకు "ముఖీము" సరియైన రూపము. కృష్ణరాయవిజయమునందును కైఫియతులందును ముఖాములు అను రూపమే కన్పట్టుచున్నది"-గో. కృ. పు. 38

మూనుపటివారు వెనకటివారు యెడవంక్కవారల [57:19-20] ముందువరసల సైన్యము, వెనుక నిలిచిన సైన్యము, ప్రక్కల నుండి పోరాడే సైన్యము. Vanguard, Rearguard and flanks.

మును(న)కలు(గా) [21:1 ; 26:18,21 ; 74:5] ముందుగా.

మున్నెరిక [34:15]. మున్నెఱుక, ముందుగా తెలియునది.

ముల్లాశాస్త్ర ప్రవీణులు [42:1] ముస్లింధర్మశాస్త్ర ప్రవీణులు.

ముస్తీదు [25:3 ; 28:23] సిద్ధము, ఆయత్తము. బ్రౌ. మిశ్ర. పు. 97; శ.ర.పు.634;

ముస్తీపు [30:10]. అలంకరించిన ముస్తీబు N. S. Equipment, accourtment—బ్రౌ. మిశ్ర, పు. 97.

మోర్చావేశి [58:23] నిఘంటువులలో లేదు. "దుర్గము చుట్టు త్రవ్వబడు కందకమును మోర్చా అందురు. యుద్ధము నిమిత్తమై త్రవ్వబడు కందక మనియు అర్థము.మోర్చావేయుట॥సైన్యము దింపుట అని వ్యవహారార్థము. మోర్చ పారశీపదము"—గో.కృ.పు. 69.

యాదిహెచ్చరికలు [ ]. యాద్ అనగా జ్ఞాపకము. హెచ్చరిక అను భావార్థము. ఏకార్థకపదములు జంటగా ప్రయోగింపబడినవి. చూడు గో. కృ, పు. 70; బ్రౌ. మిశ్ర, పుట. 101.

యాయులు, స్థాయులు [67:13]. వచ్చినవారు, బయటనుండి; (ఇక్కడే నిలకడగా) ఉన్నవారు.

రస్తుసామగ్రీలు [34:16 ; 35:2 ; 35:21 ; 35:5 ; 36:7 ; 41:15 ; 45:24; 61:2; 62:12,14] 'రసద్' అనే పదానికి వికృతి - గో.కృ, పు. 69; బ్రౌ. మిశ్ర, పు. 103. వస్తుసామగ్రి. సమానార్థంలో "ధాన్యపున్ సామాగ్రు" లని కృ. రా. వి, II. 121.

రుమ్మీమత్తెఖండం [55:15].మూడు పైన మర్త్యఖండం. రూమీ మత్తెఖండమా? పెద్దకత్తి.

రొక్కరోజనాలు [68:10] ద్రవ్యము, వస్తువులు అను అర్థమున వాడినట్లున్నది.

లాలారిపురుషులు [36:12] అర్థము తెలియుట లేదు. లాహిరి ( ? ) = మైకము.

లశికిరీతనము [38:9] లష్కర్ = దండు. దండనాయకత్వము, సైనికబలము.- గో. కృ, పు. 68; బ్రౌ. మిశ్ర, పు. 107.

వరిశెలు [76:2] వరుసలు ( ? ), మర్యాదలు ( ? )

వింగ్గి [67:25] వీగి; ఓడి.

వీడుకళ్ల [76:8] వీడుకోళ్ల ( ? )

వుదరదోలి [58:12] ఆదరదోలి

వూడెము [58:12] గూడెము ( ? )

వూడెములవారు [63:15] గూడెములవారు ( ? )

వెముఖాసరించ్చి [67 : 4] : సందర్భానిబట్టి "ఎదిరించి" అను అర్థము సరిపోవును.

వేటూరు [53 : 5] వేయారు, చూడువెయ్యారులు [56 : 6]; వ్రేటుకు ఆరు, "వేటూరు తునుకలు" (53 : 5).

శెలవు శిద్దాయీలు [24 : 13] : వ్యయము, రాబడి.

సరాశము [53 : 9; 63 : 19] 'మార్గము' అను అర్థమున వాడినట్లున్నది.

సరుదుస్థలాలు [36 : 5; 38:8; 41:15; 18, 20, 18]; సరిహద్దు పొలిమేర -బ్రౌ.మిశ్ర.పు. 118.

సారి మార్గము [72:17] దండుత్రోవ, సారి = యుద్ధయాత్ర. (శ.ర.)

హజారము [23:9] 'హజా' అను పారశీ పదము దీనికి మూలము. ఆస్థానము, కొలువుకూటము, మొగసాల – గో.కృ.ప్ర. 24; బ్రౌ.మిశ్ర,పు. 128.

హుమ్మత్తుగా [47;17] పెద్దగా, గొప్పగా (శ.ర.); గట్టిగా, "హుర్మత్తుగా" [63:7]

హరిబాణం కొమాళ్లు [44:18; 57 : 14] హరిబాణం=అరివాణము=గిన్నె, గుండిగ. "Harivanam or Arivanam literally denotes the plate or dish from which the food is taken. Therefore, **Harivanam Kumallu** literally means the sons of the eating - dish. It may be remembered in this connection that one of the classes of retainers of a Ring or Princes is called 'Kumallu' or sons. They have the privilege of partaking the food left in the plate of the king or prince after he finishes his meal. The **Harivanam Kumallu** mentioned here are evidently retainers of this class. They appear to have been recruited exclusively from the province of Araga which was sub-divided into 18 divisions known as **Kampanas**" -N. Venkata ramanayya, **Further Sources**, III P. 133, n.

హామిక్ [67:11] హామిక=ఆమిక=ఆము, మదము (శ.ర.)

హురుమంజి [72:20] పారశీక దేశమందలి ప్రసిద్ధమైన రేవు —గో. కృ,31, దొణప్ప, **భా.చా.వ్యా** పు.212;

హేజీబులు [32:24] మంత్రి (శ.ర.); (Hejeb?), a clerk? a writer? ప్రౌ.మిశ్ర, పు.130; "ఇది హాజిబ్ అను పారశీ పదమునకు వికృతి. ప్రభుత్వ వ్యవహారములను కాని తదితర కార్యములను గాని నిర్వహించు ఒక ప్రభువులు పంపు అధికారులను హేజీబులందురు. వ్రాయసకాండ్రు, లేఖకులు అను అర్థము నందును ఈ పదము ప్రయోగింపబడుచున్నది". —గో. కృ, పు. 68.

# అనుబంధం 2 : అన్యదేశ్యాలు

(వీని అర్థవివరణకై, చూడు. అనుబంధం 1)

ఆయాలాయం (గుర్రాలు),

కత్తలాణి. (                )

కబాయి, కబ్బాయి,

కాకి(గి)తము, 4:7

కర్తారు, కత్తరు,

కుళ్లాయి,

కుర్చీసులు;

కొత్తవాలు (అనే తలారి),

కౌలు, కౌలిచ్చి, 63:9

జవురుజంగులు,

జాబు,

జీరా సంజ్జోకం, (గుఱ్ఱములు)

జీరీజు (తాళ్ల),

టోకించు (?), 52:25; 58:7;

తాణ్యము, 41:16

ద(ఫ)మామి, 52:25; 58:7; 62:18

డెరిజా,

తాకీతు,

దాదిమహలు,

దివాణం, 46:19; 55:11

దునేదారులు (ర్లు), 17;

పర —

# అనుబంధం 3 : రాజోద్యోగాలు

# అనుబంధం-4 : నామసూచి

## (రాజోద్యోగులు, ప్రసిద్ధ వ్యక్తులు)

ద



ధ



న



ప

య



ర



ల



వ

శ



ష



స



హ

# అనుబంధం - 5
# మధురనాయక రాజుల వంశవృక్షము

**నాగమ నాయుడు**

|

విశ్వనాథ నాయకుడు—భార్య నాగమ్మ (1529–1564)

|

వెంకటకృష్ణప్ప నాయకుడు—భార్య లక్ష్మమ్మ (1564–1572)

|

వీరప్ప నాయకుడు – భార్య తిరుమలాంబ (1572–1595)



| | | |
|---|---|---|
| రెండవ కృష్ణప్పనాయకుడు (1591–1601) | విస్సప్ప (రాయవాచకంలోని విశ్వనాథ నాయనయ్య) | కస్తూరి రంగప్ప |

|

ముద్దుకృష్ణప్ప నాయకుడు (1601–1609)



| | | |
|---|---|---|
| మొదటి ముద్దు వీరప్ప (1609–1623) | తిరుమల నాయకుడు (1623–1629) | కుమార ముద్దు వీరప్ప |

|

రెండవ ముద్దు వీరప్ప (1629–59)



| | |
|---|---|
| చొక్కనాథుడు—భార్య నాగమ్మ (1659–1682) | ముద్దళగిరి (1675–1678) |

|

మూడవ ముద్దు వీరప్పనాయకుడు—భార్య ముద్దమ (1682–1689)

|

[మంగమ్మ—చొక్కనాథుని భార్య (1689–1706)]

|

విజయరంగ చొక్కనాథుడు (మూడవ ముద్దు వీరప్ప కుమారుడు, మంగమ్మ పౌత్రుడు) (1706–1732)

| భార్య మీనాక్షి

మీనాక్షి (1733–1736)